## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010002226

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit, | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము. సంఖ్య. ౧౮.

శ్రీరస్తు.

# నారసింహపురాణము.

## → ఉత్తరభాగము ←



హరిభట్టారకప్రణీతము.

(ద్వితీయముద్రణము-౧౦౦౦.)

రాజమహేంద్రవరము.

శ్రీసుజనరంజనీముద్రాక్షరశాలలో ముద్రింపఁబడి

కాకినాడ, ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ

బ్రకటింపఁబడియెను.

1930.

వెల, రు. 1-0-0

# విషయసూచిక.

| విషయములు. | పొరటలు |
| --- | --- |
| ప్రహ్లాదుండు నిరుత్తరుండైన నింద్రునకు ధూమ్రాక్షుం డుత్తర మిచ్చుట. | ౯౭ |
| స్వర్గంబేలు ప్రహ్లాదునికడకు శుక్రాచార్యులు వచ్చుట. | ౧౦౨ |
| ప్రహ్లాదుఁడు విష్ణుదేవుని స్తుతించుట. | ౧౦౪ |
| నారాయణుఁడు వృద్ధబ్రాహ్మణవేషముఁ దాల్చుట. | ౧౦౫ |
| వృద్ధబ్రాహ్మణుఁడు ప్రహ్లాదుం బొగడుట. | ౧౦౬ |
| ప్రహ్లాదుఁడు వైకుంఠముపై దాడి వెడలుట. | ౧౧౦ |
| ప్రహ్లాదుని పశ్చాత్తాపము. | ౧౧౨ |
| ప్రహ్లాదునికి విష్ణుమూర్తి ప్రత్యక్షమగుట. | ౧౧౩ |
| శ్రీహరి ప్రహ్లాదునకు హరివాసరమహిమఁ జెప్పుట. | ౧౧౮ |

# నారసింహపురాణము

## ఉత్తరభాగము

### ఉపోద్ఘాతము.

ప్రాచీనాంధ్రకవిప్రవరుల ప్రశస్తకవిత కొంత, యిప్పటికిని దనసౌభాగ్య సంపత్తి నెఱుంగని జానపదులయట్టుకలపైఁబడి మట్టిబ్రుంగిన తాటియాకులలో శిథిలశిథిలంబగుస్వరూపముతోఁ గొనయూపిరి గలిగి మూల్గుచున్నది. అట్టి యాపన్న దురవస్థ నిప్పుడిప్పుడు కొందఱు భాషాభిమాను లత్యుదారభావములతోఁ దొలఁగింపఁ బ్రయత్నించుచున్నారు. వారిలో ముఖ్యముగా మన యాంధ్రసాహిత్యపరిషత్తువా రావిషయమై మిగులఁ బ్రశంసనీయముగఁ బని చేసియున్నారు. వారియమూల్యప్రయత్నమువలననే యీహరిభట్టునారసింహ పురాణకృతికన్యక—ఇంతకాలమువఱకు జీవితసంశయస్థితిలోనున్న యీకృతికన్యక—ఇప్పటికిమనయాంధ్రదేశరంగమునఁ, జిరకాలాజ్ఞాతవాసముచేఁగృశించి విశ్లథములైనశరీరభాగములతో నెట్లెట్లో తలయెత్తి ప్రజలలోఁబడి నడయాడఁ గలిగినది. మఱియు మనయాంధ్రదేశమున నింకను నెన్నెన్నికృతులడఁగిమడఁగి జీర్ణించుచున్నవో తెలియదు. కొన్నిసంవత్సరములక్రిందట, మ. రా. మానవల్లి రామకృష్ణకవిగారు గద్వాలసంస్థానమునఁ దాము సంపాదించినహరిభట్టు మత్స్యపురాణము (వ్రాఁతప్రతి)కడపట "This author also wrote another work called ఉత్తరనరసింహపురాణము as పూర్వనరసింహపురాణం was already handled by greater poets ఎఱ్ఱయ్య and వేములవాడ భీమకవి but this work is not available and only one stanza quoted by జగన్నాథకవి in his రత్నాకరము survives to lament over the loss of it.

సీ. మందారకుసుమంబు మంచుబిందువు పెంచి మౌళిభాగంబునఁ గీలుకొనఁగ
ఫణికుండలంబును మణికుండలంబును గళభాగంబునఁ గప్పుకొనఁగ
నరచక్రశీర్షాలాంఛనకరాగ్రహస్తములందు మెఱుఁగంచు భుజగకంకణములు లమరఁ
గనకకౌశేయంబు గజరాజచర్మంబు మునుఁగొని కటిభాగమున నటింపఁ
దిమిరముసుజంద్రికయు నొకసమ మైనట్లు, పుండరీకోత్పలద్యుతులు పొదలినట్లు
నీలవజ్రంబు లొకచోట నిలిచినట్లు, హరిహరాకృతి త్రిభువనాహ్లాదమయ్యె.

Quoted in రత్నాకరము Canto I."

అని వ్రాసికొని యీకృతి నాయూపశేష యయ్యె నని భావించిన స్థి
తిలో నిది యిప్పు డిట్లు లభించుట యాంధ్ర భాషాభిలాషుల కమూల్యమాణి
క్యము, లభించినట్లే కాదా? జగన్నాథకవిచే నుదాహృతమైన పై సీసపద్యమే
ప్రస్తుతము ప్రకటింపఁబడిన యీనారసింహపురాణమునందు విశేషపాఠభేద
ములతో నిట్లు కనఁబడుచున్నది:—

సీ. మందారదామంబు నిందుఖండంబును మౌళిభాగంబునఁ గీలితముగ
మణికుండలమ్మును ఫణికుండలమ్మును గండమండలముల నుండుకొనఁగఁ
జక్రాంకశూలాంకశయముల మాణిక్యకంకణభుజగకంకణము లమరఁ
గనకకౌశేయంబు గజరాజచర్మంబు మునుకొని కటిభాగముల ఘటిల్ల
రమయు నుమయును నుభయపార్శ్వముల నమరఁ
బులుఁగుఱేఁడును నందియుఁ గొలిచి మెలఁగ
వైష్ణవశ్రేష్ఠులును శైవవరులుఁ బొగడ
హరిహరస్ఫూర్తి యేకదేహమునఁ బొలిచె.

ఈరెండుపద్యములకును సీసపాదములలోఁ గొన్ని పాఠాంతరములు గా
న్పించుచుండుట వింతగాదు; కాని కడపటి యెత్తుగీతము లొకదానితో నొక
దానికిఁ బోలికయే లేకయున్నవి. ఇది చిత్రము! జగన్నాథకవిచే రత్నాకర
మున నుదాహరింపఁబడిన దని రామకృష్ణకవిగారు వ్రాసినసీసగీతి నించుమిం
చుగాఁ బోలుచున్న మఱియొకసీసగీతి మీగ్రంథమున నీహరిహరాకృతిసంద
ర్భమునసే యి ట్లున్నది.

సీ. - - - - - - - - -

నీలమును వజ్రఫలకంబుఁబోలి యుత్పలంబుఁగుముదంబుననఁదగిలచ్చితో[illegible]
యురము నగరాజపుత్రికకునికైన,మొడమవంక యుఁగలిగి శ్రీనిరవుకొనిరి.

మఱియు నిందలి ద్వితీయాశ్వాసమున మఱియొక సందర్భమునఁ జెప్పఁ
బడిన ౧౮-వ సంఖ్యగల కందపద్యములోని కొంతభాగము, మీఁద నుదాహ
రింపఁబడిన గీతపద్యభాగమును బోలుచున్నది.

క. చీఁకటియుఁ జంద్రికారస, మేకస్థానంబునందె యిరవొందుగతిన్
నాకౌకోరిపుకులమున్, నాకాలయకులము నొక్కనంటున మెలఁగున్.

మఱియు నీహరిహరరూపైక్యమును వర్ణించు సీసపద్య మింకొకటి గూడ
నిందుఁ గలదు. పై పద్యములయం దిట్టివిశేషపాఠభేదము లెట్లుగలిగినవో నిర్ణ
యించుటగాని కవికంఠోక్తపాఠము లివియని నిశ్చయించుటగాని మనకు శక్య

ముగాదు. తీఱకుగా నిట్టిభేదములు లేఖకులయు, సంస్కర్తలయు, ముద్రాప కులయు బుద్ధిసూక్ష్మతచే సంభవింపవచ్చు నని నాయభిప్రాయము. ఇదిప్రస క్తానుప్రసక్తముగా వ్రాయఁబడిన విషయము. ప్రస్తుతవిషయ మేమనఁగా?

ఈనారసింహపురాణమును రచించినకవి హరిభట్టు. ఏకారణముననో కాని, కృతికర్త యగుహరిభట్టుచేఁ గాక యతనికుమారుఁ డైన రాఘవమనీషిచే నీగ్రంథము ప్రోలుగంటి రంగప్రధానికిఁ గృతి యీయఁబడినట్లు కృత్యాదినిబద్ధమైన యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. విను రాఘవమనీషి! హనుమత్కృపావరలబ్ధకవిత్వవిలాసమహిమఁ
దనరి యేకాదశద్వాదశస్కంధముల్ తెలిఁగించె మీతండ్రి ధీయుతుండు
హరిభట్టు నిఖిలవిద్యాచతురాస్యుండు రాజమాన్యుఁడు కవిరాజనుతుఁడు
నారసింహపురాణపౌరస్త్యభాగంబుఁ జెదలువా డెట్టిన మొదలు నేయఁ
బ్రతిభ దళుకొత్త నుత్తరభాగమిప్పు డాంధ్రభాషను వచనకావ్యంబొనర్చి
నాప్రబంధంబు నాపేర నంకితముగ, నీవు గావింపవలయుఁ గవీంద్రగణ్య!

ఈపద్యమునుబట్టి తండ్రి హరిభట్టు రచియించిన గ్రంథమునే కొడుకు రాఘవమనీషివలనఁ బ్రోలుగంటిరంగన్న కృతిపొందినట్లు స్పష్టమగుచున్నది, కాని, తెలుఁగుకృతులలోఁ దఱచుగా గ్రంథకర్తయే తనగ్రంథమునుగృతియిచ్చు నాచార ముండుటచేతను, గృతికర్తృభిన్ను లిట్లుకృతు లిచ్చుట మిక్కిలి యరుదుగానుండుటచేతను, పై సీసపద్య మన్వయసారళ్యము లేమిం జేసి స్థూల దృష్టికి నన్యార్థద్యోతకముగ నుండుటచేతను, మఱియు నందలి "వచనకావ్య" శబ్దమిప్పుడు ప్రత్యేకగద్యకావ్యపర్యాయమై వ్యవహరింపఁబడుచుండుటచేతను, దొలుదొలుత నీగ్రంథము రాఘవమనీషికృతమైన ట్లించుక భ్రాంతి వొడమ వచ్చును. అది కేవలము రజ్జుసర్పభ్రాంతియే కాని మఱియొకటి కాదు. తండ్రి హరిభట్టు గ్రంథమును సంపూర్ణముగా విరచించి యెవ్వరికిని గృతి యీయక మున్నె వార్ధక్యరోగాదులచే నశక్తుఁడై యుండుటచేతనో, తనంతటఁ దాను నరులకుఁ గృతియిచ్చి ప్రతిఫలము నొందుట కిచ్చగింపనివాఁ డగుటచేతనో కొంతవేళఁ గాలధర్మము నొందుటచేతనో యతనికుమారుఁడు రాఘవమనీషి కృత్యాదిపద్యములును గృతిభర్తృవంశావతారవర్ణనాదికమును రచించి రంగ ప్రధానికిఁ గృతియిచ్చి యతనిచే "సకర్పూరవీటికాశాటికాలంకారపేటికా"ది పారితోషికములుపడసి యుండవచ్చును. ఇట్లే తెనాలిరామకృష్ణకవిచే రచింపఁబడిన ఘటికాచలమాహాత్మ్య మాతనిపౌత్రుఁడు తీసికొని వచ్చి ఖండోజీ విచిత్రరాయఁ డనురాజునకు సమర్పింపఁగా నాతఁడు వేంకటగిరీంద్రుఁ డను

విచే గృత్యారంభమున నడపవలసిన దేవతాస్తోత్రాదిక పద్యములును గృతి పతివంశావతారపద్యములును రచియింపఁజేసి కృతిపొందెను. ఈనారసింహపురాణమునందలి యాశ్వాసాంతగద్యము లన్నియు నీగ్రంథము హరిభట్టుకృతమనియే నొడువుచున్నవి. ఇందలి గద్యములకును హరిభట్టారకుని యితరగ్రంథములయందలి గద్యములకును గొంచెమైనను భేదము గాన్పించుటలేదు. సంస్కృతనారసింహపురాణమునఁ బూర్వభాగము చెదలువాడ యెఱ్ఱన్న* మొదట నాంధ్రీకరింపఁగా, నిఖిలవిద్యాచతురాస్యుండును, రాజమాన్యుఁడును, గవిరాజనుతుఁడును, ధీయుతుఁడు నగు మీతండ్రి హరిభట్టీప్పు డుత్తరభాగము నాంధ్రభాషయందు వచనకావ్యము (గద్యపద్యాత్మక మైన ప్రబంధము) గా రచించెను గావున నీవాప్రబంధమును నాపేర నంకితముఁ గావింపనలయు నని రంగప్రధాని కోరఁగా రాఘవమనీషి యట్లు చేయుట కేమియభ్యంతర ముండును? ఉండదు. వచనకావ్య మనఁగా గద్యపద్యాత్మకమైన ప్రబంధ మనుటకాధారము హరిభట్టుకృత మగువరాహపురాణమున నీక్రిందివచనమునఁ గన్పట్టుచున్నది. "పురాతనకవీశ్వరానుసరణంబును గుకవినిరాకరణంబునుం జేసి శబ్దార్థభావరసాలంకారబంధంబుగా నొక్కప్రబంధం బాంధ్రభాషాభవ్యంబగు వచనకావ్యంబుగా రచియింపం బూనిన సమయంబున" అను నీవచనము గల

వరాహపురాణము గద్యపద్యాత్మకమే కాని కేవలవచనకావ్యము కాదు. దీనిం బట్టిచూడఁగా వచనకావ్య మన్న గద్యపద్యాత్మకకావ్య మని హరిభట్టుకాలమున వ్యవహృతిలో నున్నట్లు స్పష్టమగుచున్నది. ఇందలి కవిత్వమునకును హరిభట్టుకృతము లగువరాహపురాణాదులయందలి కవిత్వమునకును సర్వజనవేద్యము లయిన పోలికలుఁ గూడఁ బెక్కులు గలవు. ఆయీకారణములచే నీగ్రంథము నిస్సంశయముగ హరిభట్టకృతమే యని స్పష్టమగుచున్నను, గించిద్భ్రాంతిజనకము లైనకారణాభాసములచే స్థూలదృష్టికి రాఘవమనీషికృతమని భ్రాంతిపొడమునేమో యని (అనవసర మైనను) ఇంతవఱకు వ్రాయవలసివచ్చినది.

ఏతద్గ్రంథకర్త యగుహరిభట్టు యజుర్వేదివైదికబ్రాహ్మణుఁడు.

---

† ఈతఁడే కవిత్రయమునందలి యెఱ్ఱాప్రెగ్గడ యనియు శంభుదాసుని యింటిపేరు చెదలువాడవా రనియు నామిత్రు లొకరు చెప్పిరి. చెదలవాడ మల్లయకవికృతమగు విప్రనారాయణచరిత్ర మీవిషయమునకుఁ బ్రబలప్రమాణముగా నున్నది. దీనిని ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిరి.

మ. అమృతప్రాయవిశేషకావ్యరచనాహంభావవాగ్రామణీ
రమణీమూర్తివి; వేదశాస్త్రవివిధగ్రంథార్థనిర్ణీతి; వే
కముఖబ్రహ్మవు; యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండ; వ
ర్యమతేజుండవు రాఘవార్య హరిభట్టా! సత్కవిగ్రామణీ!

అను వరాహపురాణపద్యము పై విషయమును దెలుపుచున్నది. మఱియు నితనిగ్రంథములయందలి యాశ్వాసాంతగద్యములం బట్టి యీతఁడు భారద్వాజసగోత్రుండును రాఘవమనీషిపుత్రుఁడును, హనుమదుపాసకుఁడును, అష్టఘంటావధానపరమేశ్వరబిరుదాంకితుఁడు నైయున్నట్లు తెలియవచ్చుచున్నది. అశ్వాసాంతగద్యములవలననే కాక వరాహపురాణమునందలి-

గీ. అష్టఘంటావధానవిశిష్టబిరుద, నీవు రచియింపఁదలఁచిన నిరుపమార్థ
రమ్యమగు నీవరాహపురాణకావ్య, మంకితము సేయు నాపేరనంచితముగ.

అనుపద్యమును బట్టియు నీతనికి "అష్టఘంటావధాన" బిరుద మున్నట్లు విశద మగుచున్నది- ఇది యెవ్వరిచే నీయఁబడినదో తెలియదు. ఇతఁడు తనచే రచియింపఁబడిన వరాహపురాణమున:—

సీ. వరుణదిగ్వీథి నేపురమునఁ బ్రవహించెఁ బావనసలిలసంపన్న పెన్న
దీపించె నేపురి గోపికామానసాస్పదవర్తి చెన్నగోపాలమూర్తి
భాసిల్లె నేవీటఁ బ్రహ్లాదభక్తివిశ్రాణి కొండనృసింహశార్ఙ్గపాణి
యేపట్టణంబునఁ జూపట్టె హితపద్మహేళి వీరేశబాలేందుమౌళి
చతురచతురంగబలరత్నసౌధయూథ, సాలగోపురతోరణ సకలవర్ణ
పౌరవారాంగనాజనప్రముఖవస్తు, మేదురం బట్టికంబముమెట్టుపురము.

అని కంబముమెట్టును వర్ణించియుండుటచే నాకంబముమెట్టయే యీతని నివాసస్థల మయి యుండునేమో యనితోఁచుచున్నది. మఱియు మత్స్యపురాణమునందలి—

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నాపస్తంబుఁడన్ దిమ్మమాం
బారాజద్వరగర్భసంభవుఁడ రామక్ష్మాసురానేకజ
న్మారూఢాధికపుణ్యలబ్ధ హరినామాంకాప్తసత్పుత్రుఁడన్
శ్రీరామానుజపాదపద్మయుగళీచింతానమాయుక్తుఁడన్.

అనుపద్యమువలన నీకవి యాపస్తంబసూత్రుఁడును, రామమనీషికిని దిమ్మాంబకును బుత్రుఁడును, వైష్ణవమతాసక్తుఁడు నైనట్లు తెలియవచ్చుచున్నది. ఇతఁడు మొదట వరాహపురాణమును రచియించి కంబముమెట్టుకరణమగు

కొలిపాక యెఱ్ఱన్నకుఁ గృతియిచ్చి యట్లు నరకృతి యిచ్చుటచేఁ గలిగినదో షమును బరిహరించుకొనుతలంపుతోఁ దరువాత మత్స్యపురాణమును రచించి శ్రీరంగనాథున కర్పించినట్లు మత్స్యపురాణమునందలి యీ క్రిందిపద్యము వలన నూహింపఁబడుచున్నది.

సీ. ఆయురారోగ్యనిత్యైశ్వర్యములు గల్గి విభవంబుతోఁ ధాత్రి వెలయఁగోఱకు
ధనమునకై నరాధములనన్నుతిసేయఁ బూడమిన పాపముల్ చెడఁగోఱకు
హృదయంబు లక్ష్మీశపదపంకజములందు నిశ్చలవృత్తితో నిలుచుకొఱకు
రౌరవమ్ములు వాసి రయమున వైకుంఠసదనంబునకు వేడ్కఁ జనెడుకొఱకు
బరమవైష్ణవజనులెల్లఁ బ్రస్తుతింప,మత్కృతంబయిహరికిఁ థామాన్యమగుచు
నుత్తమంబగు విష్ణుధర్మోత్తరంబు, రంగనాథునకర్పింతు రాణ మెఱసి.

ఇంతకమున్నలభించిన యేతత్కవికృతములగు మత్స్యవరాహపురాణ ములయందీకవికాలమును నిర్ణయించుటకుఁ దగినయాధారము లేవియు లభించినవికావు. కావుననే మ. రా. రా. కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమయాంధ్రకవులచరిత్రమునందు "కవికాలమును నిర్ణయించుటకీపుస్తకములు రెంటిలోను నాకాధారము లేవియుఁ గానరాలేదు. . . . . నిర్దుష్టమనిచెప్పఁ దగినగ్రంథరచనను బట్టియు శైలినిబట్టియుఁ జూడఁగా నీపుస్తకములు చిరకాలముక్రిందటనే రచియింపఁబడిన వైనట్లు తోఁచుచున్నది . . . అప్పకవి యీ గ్రంథములనుండి లక్ష్యములఁ జేకొనకపోవుటచేత నీకవి యాతనికిఁ దరువాత నున్నాఁడేమో యని యూహ కలుగుచున్నది, కాఁబట్టి తగిన యాధారములు దొరకువఱకును మన మిప్పటికీ కవికాలము క్రీస్తుశకము ౧౬౦౦-వ సంవత్సర ప్రాంత మని భావింతము. తెలియనివిషయముల నూహించి పెంచి వ్రాయుట కంటెఁ గవికృతగ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించి యింతటితో విరమించుట యుక్తము . . . ." అని వ్రాసియున్నారు. తరువాత మఱికొంత కాలమునకు మేమీకవిమత్స్యపురాణమును మాకవితాపత్రికయందుఁ బ్రకటించియుంటిమి. అప్పటికినిమాకీతనికాలనిర్ణయ మొనరించుటకుమార్గమేమియును దొరకకుండుటంజేసి యాగ్రంథపీఠికయందు "ఈతనికాలమింకను జరిత్రకారులచే సరిగా నిర్ణయింపఁబడలేదు; కాని యపూర్వమగు గ్రంథోపక్రమమును బట్టి చూడ నీతఁడు మిక్కిలి ప్రాచీనుఁ డైనట్లు తోఁచుచున్నది." అనివ్రాసి యుంటిమి.ఇప్పుడాంధ్రసాహిత్యపరిషత్తువారిచే విశేషవ్యయప్రయాసములతో సంపాదింపఁబడి ప్రచురింపఁబడినయీనారసింహపురాణమునందుఁ గాశకుశావ

లంబనన్యాయమున నించుమించుగాఁ గవికాలమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు చూపట్టుచున్నవి. ఎట్లనిన:-ఏతద్గ్రంథకృతిభర్త యగుప్రోలుగంటి రంగప్రధాని, నందెల చినయోబభూపాలుని దండనాథుఁడైనట్లు లీగ్రంథమునఁ గృతిపతిప్రస్తావమున రాఘవమనీషిచే నీక్రిందిపద్యములయందుఁ జెప్పఁబడియున్నది.

సీ. తనమండలాగ్ర సముద్దండారిమండల భూధరంబులకు దంభోళిగాఁగఁ
దనకృపారసము బాంధవ సేవకాళి తోద్యానసీమకు వసంతంబుగాఁగఁ
దనచక్కఁదనము కాంతామనశ్చంద్ర కాంతములకుఁ జంద్రికోదయముఁగ
దననీతివర్తన ధారుణీజనచాతకంబుల కభ్రాగమంబుగాఁగఁ
వెలసె నేరాజు సముదగ్రబలసమగ్ర, కమఠశర్మదభుజపీఠగమితధరణి
యతఁడు నందెలనరసింగయాంతరంగ, తామరసహేళి చినయోబదానశాలి.

శా. ఆరాజన్యశిఖామతంసచతురాశాంతావనీచక్రభృ
ద్ధౌరంధర్యుఁడు శత్రుసిర్మథనవిద్యాశాలి లీలావతీ
మారాకారుఁడు ప్రోలుగంటి నరసామాత్యాత్మజుం డార్యర
క్షారంభుం డగురంగమంత్రి యొకనాఁ డాత్మీయగేహంబునన్.

మఱియుఁ బ్రథమాశ్వాసము ౭౧ పద్యమున:—

సీ. . . . . . . . . .
నందెలచినయోబనాథహృద్వీణకు రంగుమీఱినతంత్రి రంగమంత్రి.

అనియు నున్నది. ఈనందెల చినయోబనృపాలుఁడా రెవీటిబుక్కరాజు వంశములోని వాఁడైనట్లు పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయకృతిపతి వంశావతారపద్యములవలనఁ దెలియనచ్చుచున్నది. ఆరెవీటి బుక్కరాజునకుఁ బెద్దభార్య యగునబ్బలదేవియందు సింగరయ్య,రామవిభుఁడు,అహోబలుఁడు నని ముగ్గురు పుత్రులు పుట్టిరి. వారిలోఁ బెద్దవాఁడగుసింగరయ్యకు నరసింగరాజు, నారయ్య,తిమ్మయ్య, యని ముగ్గురుకొడుకులు. ఆముగ్గురలోను నరసింగరాజునకు సింగరయ్య, నారయ్య, కుమారోబళుఁడు, వరదరాజు, రఘుపతి, యను నైదుగురు కుమారులు గలిగిరి. అందు సింగరయ్యకు నరసింహరాజు, రఘుపతి, ఓబరాజు, ననిముగ్గురు కొమాళ్లు. వారిలో నరసింహరాజుకొడుకు ఆవళిచినోబళుఁడు. ఇతఁడే యీమననారసింహపురాణకృతిభర్త యగుప్రోలుగంటి రంగన్నప్రభువు. ఈతని పినతాతలు నలుగురలో నారయ్యకుమారుఁడు నరసింగయ్య. ఈనరసింగయ్య కొడుకు కృష్ణమరాజు. ఈతఁడే కళాపూర్ణో

దయమును గృతిపొందిన నంద్యాల కృష్ణమరాజు, కనుక, నీకృష్ణమరాజునకు ఆవళి చినోబళుఁడు పెదతాతమనుమఁ డన్నమాట. మఱియు నీనంద్యాలవంశమున నింకొక చిన్నయహోబళుఁడును, గుమారోబళుఁడును, చిన్న యోబళుఁడును, ఓబయ్యయు, ఓబలరాజును, పెద్ద-ఉద్దండ-కనగిరి-శబ్దపూర్వకోబళులును గనుపట్టుచున్నారు, కాని, నామసామ్యముచేతను బిత్రునామముంబట్టియు నావళిచినోబళుఁడే ప్రోలుగంటి రంగన్నప్రభువైనట్లు నిర్ధారింపవలసి యున్నది. చూడుఁడు-

ఈగ్రంథమునందే ప్రథమాశ్వాసాంతపద్యములయందు:—

క. హావళిచినయోబళవసు, ధావల్లభమంత్రివర్య! ధైర్యాహార్యా!
ధీవిభవతోషితార్యా! పావననేత్రాబ్జయుగకృపారసధుర్యా!

అనియును ద్వితీయాశ్వాసాంతపద్యములయందు:—

ఉ. హావళిచిన్నయోభళీధరాధిపశేఖరసైన్యపాల! నానావిధ....

అనియు విస్పష్టముచేయఁబడినది. ఈయావళిచినోబళుని గుఱించి పింగళి సూరనార్యుఁడు కళాపూర్ణోదయకృత్యాదియం దిట్లు వ్రాసియున్నాఁడు.

క. ఆనారసింహవిభుఁ డన, మానగుణుఁడు రఘుపతికుమారవరుఁడు యశ
శ్శ్రీనిధియహోబళాఖ్యధ, రానాథుఁడు సకలగుణవిరాజితుఁ డయ్యెన్.

క. ఆమువ్వురలో నగ్రజుఁ, డై మించునృసింహునకుఁ దదంగనయగు శ్రీ
రామాంబకు నుదయించె మ,హామతి యావళిచినోబళాఖ్యుఁడు వెలయన్.

ఉ. దేవవిభుండు భోగమునఁ దీవ్రమయూఖుఁడు ఖండచండతే
జోవిభవంబునం దపనసూనుఁ డనూనవితీర్ణిపెంపునన్
దైవతమేదినీధరము ధైర్యమహత్త్వమునం దలంపఁగా
నావళిచిన్నయోబమనుజాధిపముఖ్యుఁడు రాజమాత్రుఁడే?

ఈపద్యములకును నీనారసింహపురాణములోని పై యాశ్వాసాంతపద్యములకును నామవిషయమున విసంవాదలేశ మేసియు లేకుండుటచేఁ బ్రోలుగంటి రంగప్రధానికిఁ బ్రభువైన యావళి చినయోబభూపాలుఁ డితఁడే యని తెల్లమగుచున్నది. కళాపూర్ణోదయకృతిభర్త యగునంద్యాలకృష్ణరాజువలెనే యీ యావళిచినయోబభూపాలుఁడును ఆరెవీటి బుక్కరాజున కాఱవతరము వాఁడగుటచే మ. రా. రా. కందుకూరి వీరేశలింగముపంతులుగారి లెక్కప్రకారము క్రీ-శ-౧౪౭౩-వ సంవత్సరము మొదలుకొని క్రీ-శ-౧౪౮౧-వ సంవత్సరమువఱకు రాజ్యముచేసిన బుక్కరాజునకుఁ దరువాతవచ్చిన యతనిసంతతి

వారు నలుగురు నొక్కొక్కరిరువదిసంవత్సరములుండిరనుకొన్న పక్షమునఁ జిన యోబనృపాలుఁడును గృష్ణరాజుకాలమున ననఁగా, క్రీ. శ. ౧౩౬౦ వ సంవత్సరప్రాంతమున నున్నవాఁడగును. అతనిదండనాయకుఁడగురంగప్రధానియు నతనికీగ్రంథమును గృతియిచ్చిన రాఘవమనీషియు నించుమించుగ నాకాలము వారే యగుదురు. ఈరాఘవమనీషి పసివాఁడై యుండఁగా హరిభట్టీగ్రంథమును రచించి యెవ్వరికి నంకితము సేయకుండమృతినొందినవాఁడనుకొన్న యెడలఁ దండ్రియనంతరము రాఘవనీషి పెరిఁగి పెద్దవాఁడై రంగప్రధాని కీగ్రంథమును గృతియిచ్చునప్పటికి అత్యధమ మిరువది వత్సరములైనఁ బట్టును. కావున నాయిరువదివత్సరములును రాఘవమనీషికాలమనుకొనుచున్న ౧౩౬౦ లోనుండి తీసివైచినచో హరిభట్టు నిర్యాణకాలము రమారమి క్రీ. శ. ౧౩౪౦-వ సంవత్సరప్రాంతమై యుండును. ఈతఁడు కొంచె మెచ్చు తగ్గుగా నేఁబదిసంవత్సరములు జీవించియుండు నని భావించినచో నీతనిజీవితకాల మించుమించుగా క్రీ. శ. ౧౨౯౦ వ సంవత్సరము మొదలు క్రీ. శ. ౧౩౪౦వ-సంవత్సరప్రాంతమువఱకు నని యేర్పడుచున్నది. ఇది యిట్లుండఁగా నీకృతిభర్తయగురంగప్రధానికి ముత్తాత యగుతిప్పన్న ప్రౌఢదేవరాయని దండాధీశ్వరుఁడైన ట్లీగ్రంథము నందలి—

క. ఆమునిపుణోకుఁజలనిధి, సోమునికైవడి జనించె సురుచిరవిభవో
ద్దాముఁడు సమధికసమర, స్థేముఁడుఁ బ్రోలుగంటి తిప్పనధాత్రిన్.

శా. ఆమంత్రీంద్రుఁడు ప్రౌఢరాయనృపదండాధీశసంపత్కళా
సామగ్రిన్విలసిల్లి మల్లిసుతుభాస్వత్కీర్తివిస్ఫూర్తి ను
ద్దామాసాధ్యసహోమహత్త్వమున సంధాయుక్తి దోశ్శక్తి వా
చామాధుర్యమునం బురావిభులతోఁ జర్చించు వర్చస్వియై.

అనుపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. ప్రౌఢదేవరాయలు క్రీ. శ. ౧౪౨౨వ సంవత్సరము మొదలుకొని ౧౪౪౭వ సంవత్సరమువఱకును రాజ్యముచేసినవాఁడు కనుక నాకాలమున నున్నప్రోలుగంటి తిప్పన్నకు మూఁడవ తరమువాఁడగురంగన్న (తరమున కిరువది సంవత్సరముల వంతునఁ బెంచిన యెడల) క్రీ. శ. ౧౩౮౦వ సంవత్సరప్రాంతమున నున్నవాఁడగును. మొదటి లెక్కకు నీలెక్కకును సుమా రేఁబదిసంవత్సరములు భేదమున్నను మొత్తము మీఁదఁ బ్రోలుగంటి రంగప్రధాని క్రీ. శ. ౧౫వ శతాబ్ద్యాది నున్నవాఁడగును గనుక నతనికి ముందున్న హరిభట్టు ౧౪వ శతాబ్దియందుత్తరభాగమున

నున్నవాఁడగుటకు సందేహముండదు. అట్లగుచో నీకవి శ్రీకృష్ణదేవరాయల రాజ్యారంభకాలమునకు ముందే యల్లసానిపెద్దనామాత్యునికంటెఁ గొంచెము పూర్వుఁడుగానో సమకాలమువాఁడుగానో యుండి యాధునికకవుల కాదియందుఁ జేర్పఁబడుటకు బదులుగా మధ్యకవుల కాదినో పూర్వకవులకుఁ గడపటనో చేర్పఁదగినవాఁడగును. అంతియే కాని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసినట్లు, అప్పకవి యీతనిగ్రంథములనుండి లక్ష్యములను జేకొనక పోయినంతమాత్రమున నీకవి యతనికిఁ దరువాతివాఁడేమోయని యూహించుట యుక్తముగాదు. అప్పకవిచే నుదాహృతములుగాని ప్రాచీనాంధ్రగ్రంథము లెన్ని లేవు? అవి యన్నియు నప్పకవికంటె నర్వాచీనులగుకవులచే రచియింపఁబడి యుండునని భావింపవచ్చునా? అంతకంటె-ఈతఁడు రచించిన గ్రంథము లన్నియుఁ బురాణాంధ్రీకరణములే యై యుండుటం బట్టియు మత్స్యపురాణమున నీతఁ డొనర్చిన యపూర్వగ్రంథోపక్రమమును బట్టియుఁ బ్రబంధకాలమునకుఁ బూర్వుఁ డని యూహించుట యుక్తమేమో?

ప్రస్తుత మీకవికాలనిర్ణయ మింతకంటె సరిగా నొనర్చుటకుఁ దగిన ప్రబలాధారములు నాకుఁ గనుపట్టకున్నవి. ఇంతకు ముం దీమాత్రమైన నాధారము గానరాని యీతని జీవితకాలనిర్ణయమున కిప్పు డీయాధారమైనదొరకినందుకు సంతసింపవలసినదే. ఇప్పు డీ నేఁజూపిన నిర్ణయాంశము గూడ నెంతవఱకు సరియైనదో చరిత్రపరిశోధనములం దభినివేశముగల తద్‌జ్ఞులుపరిశీలింపవలసియుండును; గావున నాభారము వారిపై వైచి యీనారసింహపురాణము నందలి కవిత్వముంగూర్చి యొకించుక వ్రాసి ముగించుచున్నాఁడను. హరిభట్టు గ్రంథము లిప్పటికి నాల్గు లభించినవి. ఇవిగాక యాతఁడింక నేవైన గ్రంథములు రచియించి యుండెనేమో తెలియదు. లభించిన గ్రంథములు (1) వరాహపురాణము, (2) మత్స్యపురాణము, (3) భాగవతషష్ఠైకాదశద్వాదశస్కంధములు, (4) ఈనారసింహపురాణము. వీనిలో నీగ్రంథ మెన్నవదో సరిగా నిర్ణయింపఁ జాలము కాని మత్స్యపురాణమునందలి—సీ.........ధనమునకై నరాధముల సన్నుతి సేయఁ బొడమిన పాపముల్ చెడుటకొఱకు.........అను దానింబట్టి, నరకృతి యీయఁబడిన వరాహపురాణము, మత్స్యపురాణము కంటె ముందు రచియింపఁబడెనేమోయని తోఁచుచున్నది. ఈనారసింహపురాణమునందు—సీ. విను రాఘవమనీషి! హనుమత్కృపావరలబ్ధకవిత్వవిలాసమహిమఁ దనరి యేకాదశద్వాదశస్కంధముల్ దెలిఁగించె మీతండ్రి ధీయు

తుండు హరిభట్టు .........అని చెప్పఁబడియుండుటచే నీగ్రంథము కంటె

హరిభట్టు భాగవతమునషష్ఠస్కంధముఁగూడ నాంధ్రీకరించియున్నాఁడు. అది మాప్తిరికాపురమునందలి యాంధ్రపరిశోధకమహామండలియందుండఁగా నేను జూచితిని. ఈపద్యమున దానిపరిసక్తి యేల చేయఁబడలేదో తెలియదు. అప్పటికీస్కంధ మాంధ్రీకరింపఁబడి యుండకపోవునా? అట్లయిన మఱి యెప్పుడు తెలుఁగుసేయఁబడి యుండును? ఈషష్ఠస్కంధకృత్యాదిపద్యములయందుఁ గూడ నీతనికాలనిర్ణయాదుల కనుకూలించువిషయములు లభించినవిగావు. అందు—

శా. శ్రీనీలాచలనాథు నంచితదయాసింధున్ జగన్నాయకున్
నానావైభవసన్నుతున్ మునిజనానందాలయుఁ సర్వదే
వానీకా(మల?)మౌళిరత్నరుచిదివ్యాంఘ్రిద్వయీశోభితు
న్సానాస్త్రప్రపిభవాశ్రయున్ హరిని సంశోభింతు నెల్లప్పుడున్.

మ. గురుకావ్యాదినిలింపసంఘములు వైకుంఠంబుతో సాటిగా
బురణింపం బురుషోత్తమాహ్వయమహాపుణ్యస్థలంబందు సా
గరతీరంబున నీలశైలశిఖరాగ్రంబందు వేంచేసి యు
న్నరమాకాంతుని భక్తవత్సలు జగన్నాథుం బ్రశంసించెదన్.

మ. కర(క్రమ?)మొప్పన్ ముసలాయుధుండునుసుభద్రాదేవియుంబార్శ్వభా
గమునం బ్రేమయెసర్ప రత్నమకుటగ్రైవేయహారాంగద
ప్రముఖానేకవిభూ ------ డై బ్రహ్మేంద్రగౌరీశ్వరా
ద్యమరుల్ గొల్వ సుఖోపవిష్టుఁడగు నీలాద్రీశ్వరుం గొల్చెదన్.

చ. ఎడపక విష్ణునిం బొగడ నెన్నఁడు నొల్లక దుర్మదంబునం
గడుపులకై నరాధములఁ గావ్యముఖంబుల సన్నుతింపఁగాఁ
బొడమిన పాపజాలముల బొట్టణఁగం బొలియించు ముక్తిఁ బొం
దెడుకొఱకై రచింతుఁ గృతి నీలగిరీంద్రున కర్పితంబుగన్.

శా. పర్సిస్కంధామరరాజ్యరక్షకుని భూభారాపహార్తన్ మహే
శస్కందాభినుతప్రభావుఁ గమలాసంక్రాంతరాజన్మహో
రస్కున్ విష్ణుఁ దలంచి భాగవతపౌరాణీయమైనట్టి ష
ష్ఠస్కంధంబుఁ దెనుంగుఁ జేసెదను గృష్ణప్రీతిగా వేడ్కతోన్,

క. కృతినాథుఁడు నీలాచల, పతియఁట శుకయోగి వదనభాషితమగు త
త్కృతి భాగవతం బఁటయిది,నుతిఁదలఁపగనింతకన్న మాన్యము గలదే.

వ. ఇవ్విధంబున సకలదేవతానాయకుండై యింద్రద్యుమ్నసరోవరతీరంబున నీలగిరినిలయుండైన జగన్నాథదేవునకు ననంతంబులైన సాష్టాం

ముందుగా భాగవతస్కంధము లాంధ్రీకరించినట్లుస్పష్టమగుచున్నది. వరాహ
పురాణమత్స్యపురాణము లంతకుఁ బూర్వమే రచింపఁబడియున్న యెడల వాని
ప్రస్తావ మిం దేల చేయఁబడ లే దని యొకశంక పొడమును; పోనిండు. భాగ
వతస్కంధములకును నారసింహపురాణమునకును బరమందే వరాహమత్స్య
పురాణములు విరచింపఁబడిన వనుకొందమన్నచో నా గ్రంథములు రచియించు
నంతకాలమువఱకు నీనారసింహపురాణము కవిచే నెవ్వరిపేర నంకితముచేయఁ
బడక మిగిలియుండి యిల్లేల కవిపుత్రునిచేఁ గృతియీయఁబడునని సంశయింప
వలసివచ్చును. ఇట్లు సంశయాస్పదమగు నేతద్గ్రంథరచనాక్రమమును గూర్చి
విశేషతర్కము లొనరింపవలసిన పనిలేదు, కాని, గ్రంథకర్తచే నెవ్వరికి నంకి
తము చేయఁబడక మిగిలియున్న దగుటచేతను, నీకవిచేతనే రచియింపఁబడిన
యితరగ్రంథములయందలి కవిత్వముకంటె నిందలికవిత్వము కొంత ప్రౌఢము
గాఁ గాన్పించుచుండుటచేతను నీనారసింహపురాణ మీకవిగ్రంథము లన్నిటి
లోను గడపటి దని సంభావించుకొని సంశయవిచ్ఛేదకమైనసందర్భాంతరము
సమకూరువఱకును సంతోషింపవచ్చును.

భారతభాగవతరామాయణాదులవలెనే యిదియును గథాసందర్భమున
సంస్కృతమూలము ననుసరించి యథేష్టముగాఁ దెలుఁగుసేయఁబడినట్లు కను
పట్టుచున్నది. కాని యెంతవఱకు మూలానుగుణముగా నున్నదో చూచి వివ
రించుటకు నాకుఁ దగిన యవకాశము చిక్కినది కాదు. ఇందలికథ యెఱ్ఱా
ప్రెగ్గడ నారసింహపురాణమునందలి కథ కుత్తరభాగమని తోఁచుచున్నది.

---

గదండపరిణామంబులు సమర్పించి తత్పాదపద్మంబులు మదీయమ
నఃపద్మంబునం గీలుకొల్పి తదర్పితంబుగా షష్ఠస్కంధంబు మతిగోచ
రించుకొలఁదిని దెనిఁగించెద.

గీ. పరుసమునకు నినుము బంగారమునునొక్క, విధమమైనయట్లువీఁకు సేయ
శ్వపచుఁడైన విప్రవరుఁడైన శ్రీవిష్ణు, భక్తికొక్కసమము పరిచరింప.

క. సురవరమౌళివిరాజిత, సురుచిరరత్నప్రభాభిశోభితపాదాం
బురుహద్వయాతినిర్మల, నిరుపమగుణసన్నివేశ నీలాద్రీశా!

వ. అవధరింపుము.

అను నీపద్యగద్యములతో గ్రంథోపక్రమము సేయఁబడి—"ఇది శ్రీ
హనుమత్కటాక్షలబ్ధవరప్రసాద సహజసారస్వతచంద్రనామాంకరామవిద్వన్మ
ణికుమారాష్టఘంటావధానహరిభట్టారకప్రణీతంబైన" ఇత్యాదిగద్యముతో
షష్ఠస్కంధము పరిసమాప్తి చేయఁబడియున్నది.

ఈగ్రంథమునందలి కవిత్వము నిరర్గళమైన ధారగలదై ప్రౌఢపాకమునఁ బడి చక్కఁగా నుండును.

చ. అలఘుభుజాబలప్రథితు లాశరపుంగవు లుగ్రసాధనం
బుల నరకేసరిం బొందువఁ బూనిన యంతనె తన్నృసింహుచూ
పుల మెఱుమంటలం జిమిడిపోయిరి జీర్ణములైరి జీవముల్
తొలఁగిరి తూలి రోటుఱిరి తొట్రిలి వ్రాలిరి కూలి రందఱున్ పఞ్చ॥ఆ॥౧౭౭

క. ఎదిరిసపగ మీలోపల నదిరినయది లేదు లోకములు గూకలిడం
గదనము సేయఁగఁదగునే, మదనజనక మదనదమన మానుఁడు గినుకల్.
ప్ర॥ ఆ॥ ౨౦౫.

సీ. సమరాభిముఖులైన యమరవీరులగిట్టి యని మొనఁదుత్తుమురాడవలదె
దర్పితదండయాత్రాభేరిభాంకార ఝంకారముల మిన్ను చెఱవవలదె
యుత్పలదళముల యొప్పునఁ బైకొను నరిశిలీముఖముల నాపఁవలదె
తుంగమాతంగశతాంగతురంగాంగ శకలకోటుల నేలఁ జమరవలదె
కలవె యొకనిఁగొలిచి గర్వవిహీనుఁడై, యూడిగములు సేయుచున్న ఖతికి
ధూర్తవిజయలబ్ధకీర్తిప్రతాపంబు, లసురసుతునకిట్టులడఁగఁదగునె. ద్వి॥౫౭

ఉ. పక్షికులేంద్రవాహనుని బల్విడిఁ దోలఁగరాదొ - - - - ద్వి. ఆ. ౬౮

శా. అన్నా! యన్నలుఁదమ్ములైనమిము మున్నాక్షేపముల్ పల్కెనే
నిన్నాళ్ళేలితి మూఁడులోకములు . . . . . . . . తృ. ఆ. ౯౧

మ. తపముల్ సేయుచు వ్రస్సిక్రుస్సి విపినాంతర్వాసులై . . . . . తృ. ఆ. ౯౫

క. గర్వించియశోవామ్ర, త్యుర్వా యని దివిజబలమహోగ్రాకృతివై
గీర్వాణవిమతజలనిధి, పర్వతమైనిలువవయ్య పాకధ్వంసీ. చ.ఆ.౨౬.

క. జలధిపతిబలపరాక్రమ,ములు జలలిపులుగ నొనర్చి ముచ్చెఱువుజలం
బులు ద్రావించిన నీయు,జ్జ్వలవిక్రమముగ్రతరము శత్రుధ్వంసీ! పం. ఆ. ౩౬.

గ్రంథవిస్తరభీతిచే స్థాలీపులాకన్యాయముగ నీపద్యము లెత్తిచూపఁబడినవి. కాని కవిత్వమంతయు నిట్లే మృదుమధురముగ నుండును.

ఈగ్రంథమునం దచటనచట నంత్యానుప్రాసాది శబ్దాలంకారములుగల పద్యము లుండుటం బట్టియుఁ గొన్ని పోలికలం బట్టియుఁ జూడ గ్రంథకర్తకు బమ్మెరపోతనామాత్యుని కవిత్వమునందు మిక్కిలియాదరమున్నట్లు తెలియ వచ్చుచుండును. ఈయాదరమే యీతక్కవిని భాగవతస్కంధములు రచింపఁ బ్రోత్సహించెనేమో?

మ. శరభేంద్రుండు మనంబులోఁదలఁచె రక్షస్సైనికాఖీలమున్
జిరవైరోద్ధతభాస్కరోద్భవశిరచ్ఛేదక్రియామూలమున్
బురవప్రావళిభూరిమేఘవిలయప్రోద్భూతవాతూలమున్
వరఘంటాజనితాతిదీర్ఘనినదవ్యాలోలమున్ శూలమున్. ఆ. ౧. ౧౮౮

ఉ. విక్రమసత్త్వసంయుతుఁడు వీరనృసింహుఁడు లోఁదలంచె ని
ర్వక్రపరాక్రమక్రమధురంధరసాహసికత్వవిభ్రమో
పక్రమమీనధామగృహపాలనిజధ్వజినీమహోపుర
శ్చక్రము నిర్గళజ్జ్వలనశోషితనక్రము నాత్మచక్రమున్. ఆ. ౧. ౧౯౨

క. కదనంబున నా తెక్కలు.

సీ. వలమానదహనకీలల నీనునెమ్మోముములికితో డావంక కలికితోడ ఆ౧. ౯౮

సీ. హృదయంబు లక్ష్మీశపదపద్మములయందు వీను లుపహరికథల్ వినుటయందు

క. వచ్చినచోటికిఁ గ్రమ్మఱి, వచ్చుం బోదోఁటసూది వచ్చుఁ బ్రియముతో
నెచ్చెలులనడుగునడుగుల, మచ్చమరయునోఅలుఁదెరలుమలఁగుంగలఁగున్
ఆ. ౩. ౧౧౩.

శా. అన్నా! వెన్నునినమ్మఁగా వలదు మాయానాట్యకేళీరతుం
డన్నారాయణుఁ డాదితేయులకు రంధ్రాన్వేషసంపాదియై
యున్నీసంపద లన్నియుం గిలిబి తానిచ్చున్నిజంబీవు నం
పన్నప్రౌఢి వహించి యేమఱకుమీ ప్రత్యర్థికృత్యంబులన్. ఆ. ౪. ౧౯౯.

యతిప్రాసపాదపూరణాదులకై వచ్చిపడు వ్యర్థపదము లీగ్రంథమున విశేషముగాఁ గానఁబడవు. శైలి సర్వత్ర మనోజ్ఞముగానున్నది; కాని యందందుఁ గొన్ని విరుద్ధప్రయోగములు గనుపట్టుచున్నవి.

క. ఏమియపరాధ మొదవెం, దామరవిరిమనుమనందుఁదత్కథసర్వం ఆ౧-౬౦

సీ. . . . . . . . . . . . . .
మఱియు నీవొనర్చుమానుషక్రమములు, లెక్కసేయువారు లేరు నిజము
ఆ. ౧. ౨౨౪

సీ. . . . . . .
ఏసమయము చూచినా సదాశివమిత్రగోచరగ్రంథార్థసూచనంబు
ఆ. ౨. ౧౪.

గీ. ఆహిరణ్యకశిపు నందు నీమూమిషి, క్రింది సోమరెట్లు బొందియెత్తె
ఆ. ౨. ౫౬.

క. భావించి కల్పతరువుల, రావించిట్లనియె . . ఆ. ౩. ౫౫.

క. మొకమడఁచినఁగానఁగలే, శోకవస్తువు నిట్టి దనఁగ నోడిరి లోకుల్
శకలితహరికాయమణికో, రకములలోనణఁగిరనఁగ రాత్రిటివేళన్ ౩-౧౭౪.

చ. హరికిని నీకు నేమిపని యాయన నన్నెఱుంగే నెఱుంగుదున్
హరిని . . . . . . ఆ. ౪. ౧౧౫.

గీ. కర్మసర్మక్త్రుడై చెంచుగబ్బిగుబ్బ, లానికతమునఁబాతిత్యలీనుఁడయ్యె.౫౧౭౧

దండకము. వంచనాచుంచురత్వంబున న్నీపదాంభోజముల్....

ఇట్టివి మఱియుఁ గొన్ని గలవు. ఇవియెట్లు దొరలెనో కాని కవియజ్ఞతచేఁ బ్రయోగింపఁబడినవని చెప్పసాహసింపఁదగదు. మొత్తముమీఁదఁ గవిత్వము నిర్దుష్టమనియే చెప్పవచ్చును. మఱియు నిందు యతిప్రాసములయందు గురు లఘు రేఫభేదము పాటించినట్లు కనఁబడదు. ఇందలి పద్యగద్యములు చాలభా గము సంస్కృతపదభూయిష్ఠములై యున్నవి. కొన్నిచోట్లఁ దేట తెలుఁగుమాట లతో నలరారు నాటములగు పద్యములునుగలవు. అందందు రూఢిపదములకు మాఱుగఁ బర్యాయపదములు ప్రయోగింపఁబడియుండుటచేఁ బద్యపఠనోత్తర కాలార్థావబోధమున కవి యించుక ప్రతిబంధముఁ గలుగఁ జేయుచుండును. అయిన నది యొక గొప్పలోపముగాఁ బరిగణింపఁజనదు. ఈగ్రంథము పెక్కు తెఱఁగులఁ జాలఁ బ్రశస్తమైన దని యేతునకుఁ జెప్పవలసినమాట. తినఁబోవు వారికి రుచులు సెప్పనేల యేను తలంపుతోడను, ఆయాసందర్భములయందిం తకు మున్నుదాహృతములైన పద్యములే చాలుననునాశయముతోడను గవితా రీతిని దెలుపుటకై పురలఁ బ్రత్యేకముగాఁ గొన్నిపద్యము లెత్తి వ్రాయలేదు. పాఠకమహాశయు లీగ్రంథమును సాంతముగఁ జదివి యిందలికవితారసమునా స్వాదించి యాంధ్రసాహిత్యపరిషత్తువారి పరిశ్రమము ఫలవంతి మొనర్చుట యుభయతారకము. గ్రంథవిస్తృతియేల?

కవితావిలాసము. } ఓలేటి వేంకటరామశాస్త్రి.
పీఠికాపురము. }

# ముద్రణవిషయము

ఈనారసింహపురాణోత్తరభాగమును, చిత్రకవిపెద్దనార్యుఁడు రచియిం
చిన లక్షణసారసంగ్రహమును, బరిషత్పుస్తకభాండాగారమునకై మైసూరు
దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారాధిపతులయొద్దఁగొనఁబడినవి.
ఈపురాణమును లక్షణసారసంగ్రహమును చిత్రకవివారియింటినుండియే మై
సూరు దొరతనమువారికి దొరకియుండును. నారసింహపురాణము చివర—

శ్రీమత్ఖాదిరీనృసింహాయనమః. శ్రీ వేంకటేశాయనమః.

క. ధరశుభకీలకసంవ, త్సరమున శ్రావణమునందుఁ దగఁజిత్రకవీ
శ్వరుబుచ్చయార్యుతమ్ముఁడు, వరమతి నరసింహుకథయు వ్రాసితివేడ్కన్.

శ్రీశారదాంబాయైనమః, కీలకనామసంవత్సర శ్రావణశుద్ధ ౨ వరకు
శ్రీమత్ఖాదిరీనృసింహవరప్రసాదుఁడగు చిత్రకవి బుచ్చయాచార్యులతమ్ముండు
రామాచార్యులు వ్రాసిన నారసింహపురాణమునకు శుభమస్తు-అనియున్నది,

లక్షణసారసంగ్రహమును పై రామాచార్యులే దుర్ముఖిసంవత్సరపుష్య
శు. ౬ లో వ్రాసినట్లున్నది.

ఈకీలక దుర్ముఖులు మొన్న మొన్నటివికాక వానిపైవి యగును.
వానిపైవియైనఁగానవచ్చునని యాకులప్రాఁతదనము కొంతసూచించుచున్నది.

ఈపురాణమునకు రెండవప్రతి మనయాంధ్రదేశములో నెక్కడను లేదు.
ప్రకటనరూపముగాఁ గోరి ప్రత్యంతరమునకై వేచియుంటిమిగాని లభింపకుం
డుటచేఁ గొన్నితావులఁ బాఠములు సవరింప వలనుపడలేదు. లుప్తభాగము
లట్లే విడువ వలసివచ్చినవి. అందందు లోపము లున్నను గథాభాగమునకు
హానివచ్చునంతటివిగా లేవు.

శ్రో. సూ.

శ్రీరస్తు.

# నారసింహపురాణము.

## ⇛ ఉత్తరభాగము ⇚

### ప్ర థ మా శ్వా స ము.

———:(o):———

— కృత్యాదిస్తోత్రాదికము —

శా. శ్రీమహిళాంతరంగసరసీజనభోమణి యాదవాన్వయ
గ్రామణి సర్వదైవతశిఖామణి యాశ్రితభక్తలోకవాం
ఛామణి శాంబరీమృగదృశామణి వేంకటశైలరాజర
త్నామని ప్రోలుగంటి నరసప్రభురంగనఁ బ్రోచుఁగావుతన్. ౧

చ. మదుని జయించి యుస్మరల మచ్చిక వచ్చి ప్రసన్నమూర్తియై
గిరిజకు మేను జాహ్నవికిఁ గెంజడలుం దగ నిచ్చి నిచ్చలు
న్సురతసుఖప్రసంగతులఁ జొక్కెడుశంభుఁ డొసంగుఁగాత భా
స్కరసమతేజుఁ డైననరసప్రభురంగన కీప్సితార్థముల్. ౨

సీ. చిలుకతోఁ దేనియల్పలుకంగఁ బలుకుచుముద్దాడు నేవేల్పుముద్దరాలు
తనతనూరుచిధారఁ దనరుచందురుడాలు వారించు నేవేల్పువారువంబు
మధురసం బానించి మధులిహంబుల కింపుపుట్టించు నేవేల్పుపుట్టినిల్లు
కలనన్నమాత్రానఁ గలకల నగుచు నానందించు నేవేల్పునందనుండు
కల్పితాఖిలలోకైకవేల్పు వేల్పుఁ, బెద్ద నలువ కృపాసముపేతదృష్టిఁ
గలితయశుఁ బ్రోలుగంటిరంగప్రధాన, శేఖరునకాయురభివృద్ధిసేయుఁగాత.

చ. నరసురవంద్యుఁ డౌకమలనాభుసురఃస్థలి నున్నమాడ్కిఁ గి
న్నరసముదాయభర్తసదనంబుననిల్చినవైఖరిం బ్రసూ
నరసమిళచ్ఛరాసను ననన్యజుఁ గన్నపయోధికన్య యీ
నరసయరంగమంత్రిభవనంబున వేడ్క వసించుఁగావుతన్. ౪

ఉ. అంబ నిజాంఘ్రిపద్మవినతాఖిలదేవకదంబ చారువ
క్త్రాంబుజవైరిబింబ లలితాలకనిర్జితనీలనీలరో
లంబ సమగ్రమంగళవిలాసకళానికురుంబ ప్రోచు నె
య్యంబునఁ బ్రోలుగంటినరసాధిపురంగయమంత్రిపుంగవున్. ౫

చ. కలకలఁ గేలిచిల్క పలుకం బలుకం దళుకొత్తు నెమ్మితోఁ
బులకలమేను దేలఁగిలఁ బొంగుము బంగరువీణెఁ బానపుం
గులుకులు రాల్చి సల్పఁ జనుగుబ్బలతాఁకునఁ జొక్కఁజేయు నా
పలుకులకల్కి నిచ్చలును బాయక నామది నిల్చుఁగావుతన్.

మ. హరుఁ డంకంబున ముద్దుసేసి తను బాలార్పంగఁ దన్మస్తకాం
తరవిన్యస్తమృగాంకరేఖ బిససూత్రం బంచు లోశంకనోం
ది రతిం దుండము సాఁచి పట్టి తెలియన్ దీకొన్న దానోల్లస
త్కరిరాజాస్యుఁడు మత్ప్రబంధమునకుం గావించు నిర్విఘ్నముల్.

సీ. వల్మీకసంభవవ్యాసభట్టారకకాళిదాసుల వేడుకల భజించి
భవభూతిశివభద్రబాణమయూరుల ఘనతరవాక్యవైఖరులఁ బొగడి
మలహణక్షేమేంద్రమాఘభారవిభాసదండిచోరులకు వందనమొనర్చి
హర్షసౌమిల్లమురారిసుబంధులఁ బటుభక్తిఁ దలఁపులోఁ బాదుకొలిపి
ఘనమయశులు నన్నపాచార్యతిక్కన, యాయజూకు లెఱ్ఱయప్రధాన
వర్యుఁ డాదిగాఁగ వహికి నెక్కినమహాకవులనాశ్రయించి గరిమగాంచి.

క. ఇప్పటిదుష్కవు లొకకృతి, చెప్పంగాలేరు గాని చెప్పినకృతులం
దప్పులు పట్టను బ్రహ్మలు, మెప్పింపఁగ వశమె వారి మృడునకునైనన్. ౯

వ. అనియిష్టదేవతాభివందనంబును మహాకవీంద్రాభినందనంబును గుకవినిం
దనంబునుం గావించి సకలసుకవిజనశ్రావ్యంబుగా నొక్కకావ్యం బేను
రచియింప నుపక్రమించుసమయంబున. ౧౦

సీ. తనమండలాగ్రముద్దండారిమండలభూధరంబులకు దంభోళి గాఁగఁ
దనకృపారసము బాంధవసేవకాశ్రితోద్యానసీమకు వసంతంబుగాఁగఁ దన
చక్కఁదనము కాంతామనశ్చంద్రకాంతములకుఁ జంద్రికోదయముగాఁగఁ
దననీతివర్తన ధారణీజనచాతకంబుల కభ్రాగమంబు గాఁగ
వెలసె నేరాజు సముదగ్రబలసమగ్ర, కమఠశర్ధదభుజపీఠగమితధరణి
యతఁడు నందెలనరసింగయాంతరంగ, తామరసహేళి దినయోబదానశాలి.

శా. ఆరాజన్యశిఖావతంసచతురాశాంతావనీచక్రభృ
ద్ధౌరంధర్యుఁడు శత్రునిర్మథనవిద్యాశాలి లీలావతీ
మారాకారుఁడు ప్రోలుగంటి నరసామాత్యాత్మజుం డార్యర
క్షారంభుం డగురంగమంత్రి యొకనాఁ డాత్మీయగేహంబునన్. ౧౨

సీ. హితులుసామంతులునుతులుదాయాదులున్నృపులు బాంధవులుమనీషివరులు
పౌరాణికులు రాయబారులు సుకవులు వందిమాగధులు దైవజ్ఞమణులు
దొరలు పురోహితు ల్దుర్గాధినాథులు మంత్రులు గణికులు మాన్యజనులు
భటులువారస్త్రీలునటులు నాటకు లాదియగుని యోగము లెల్లఁదగిన యెడల
వరుసతోఁగొల్వవై భవస్ఫూర్తిమెరసి, రాజమిగ్గి సేసికొండనయింద్రుమూర్తి
గొలువుసకలంబుఁజెంగల్వకొలనిఁబోలఁ గొలువుగూర్చుండిహరికథాగోష్ఠిఁ
క. ననుఁ బిలువఁబనిచి యర్ఘ్యాసనమున నుపవిష్టుఁ జేసి సన్మానములం (దవిలి.
దనియించి చిఱునగవు మొగమున నీరికెలొదవ వినయమున నిట్లనియెన్.
సీ. వినురాఘవమనీషి హనుమత్ప్రసాదసంలబ్ధకవిత్వవిలాసమహిమఁ
దనరి యేకాదశద్వాదశస్కంధము ల్దెనిఁగించె మీతండ్రి ధీయుతుండు
హరిభట్టు నిఖిలవిద్యాచతురాస్యుండు రాజమాన్యుఁడు కవిరాజనుతుఁడు -
నారసింహపురాణపౌరస్త్యభాగంబుఁ జెనలువా డెట్టిన మొదలుసేయఁ
బ్రతిభ దళుకొత్త నుత్తరభాగ మిప్పు, డంధ్రభాషను వచనకావ్యంబొనర్చి
నా ప్రబంధంబు, నాపేర నంకితముగ, నీవు గావింపవలయుఁ గవీంద్రగణ్య.
క. కృతము మనినసత్పురుషులు, కృతులవలనఁ గాదె భువినిఁ గీర్తి గని మహా
కృతకృత్యులైరిగావునఁ, గృతి దక్కఁగ నొండు కీర్తి హేతువుగలదే. ౧౬
వ. అని సకర్పూర వీటికాశాటికాలంకారపేటిక లిచ్చినం బరిగ్రహించి ౧౭
క. మిసిమిగల*పసిఁడి పుయిదకు, వసుదేవజముద్ర దొరకువడువున నస్త్ర
ద్రసవత్కవితాయువతికి, రసికుం డగుప్రోలుగంటి రంగన గలిగెన్. ౧౮
వ. అని పరమహర్షోత్కర్షంబున నంగీకరించి యేతత్ప్రారంభంబునకు శోభ
నాచారంబుగాఁ దదీయవంశానతారం బభివర్ణించెద. ౧౯
సీ. గాధినందనతపోగాధపయోధి పార్ష్ణిద్వయద్వయస మేనియతమతికి
నింద్రసన్నిభహరిశ్చంద్రాదిభూపతుల్ శిష్యులై మెలఁగి రేశీలఖనికి
యోగీశవాఙ్మనసాగమ్యతత్త్వంబు కరతలామలక మేపరమమునికి
సకలవిద్యావిశేషజ్ఞానసారంబు హృదయస్థ మేవిజితేంద్రియునకు
నతఁడు ఫణివరకుంభజన్మాబ్జమిత్ర, నివసనోచితదండకుండీజపాళి (యు..
వలయుఁడమరాదినుతతపోబలముకలిమి, జయముప్రూని యరుంధతీజానివెల

* పసిఁడి పూదెకు అని యుండవలయు నేమో, పూదె యనఁగా బంగారు
పూస.

క. ఆమునిమణికులజలనిధి, సోమునికై వడి జనించె సురుచిరవిభవో
ద్దాముఁడు సమధికసమర, స్థేముఁడు నాప్రోలుగంటి తిప్పనధాత్రిన్. ౨౧

శా. ఆమంత్రీంద్రుఁడు ప్రౌఢరాయనృపదండాధీశసంపత్కళా
సామగ్రిన్విలసిల్లి మల్లిసుమభాస్వత్కీర్తివిస్ఫూర్తి ను
ద్దామాసాధ్యమహోమహత్త్వమున సంధాయుక్తిదోశ్శక్తివా
చామాధుర్యమునం బురావిభులతోఁ జర్చించు వర్చస్వియై. ౨౨

క. అరుదంద లోకమాతని, బిరుదందియఁ గెలుకొన్న భీకరశత్రూ
త్కరములకు ననుదినంబును, సొరిది న్నమకూరు భోగసుకృతఫలంబుల్. ౨౩

సీ. కదలనిభక్తితోఁ గట్టించెఁ బంపావిరూపాక్షదేవుని గోపురంబు
విఠ్ఠలపతికిఁ గావించి యర్పణచేసె మహనీయతరభోగమండపంబు
మాల్యవంతమురఘూత్తమవధూభర్తకు ఘనకిరీటం బుపాయన మొసంగె
*దరిసెనంబిచ్చె మ్మతంగ+వీరన్నకుఁ గట్టాణిముత్యాలకంఠమాల
బ్రాహ్మణులనిల్పె నగ్రహారములయందు, దిక్కులన్నింటఁ గీర్తులు పిక్కటిల్ల
వెలసె దుర్మంత్రిసంఘాతవిభవజాత, తిమిరకుముదారియగుచు నాతిప్పశౌరి.

చ. అతనికి భామినీతిలకమై నుతికెక్కిన భైరవాంబకు
న్సుతు లుదయించి రిద్దఱు యశోరమణీయచతుర్దిగంతరు
ల్వితరణచాతురీజితరవిప్రభవామరధామధేనువు
ల్కుతలకనత్పురందరులు కొండనమంత్రియు నాగశౌరియున్. ౨౪

వ. తదగ్రజుండు. ౨౫

ఉ. నిండినవేడ్కఁ దేగవహి నిల్పినబంగరుకొండ నాఁగ భూ
మండలి నెల్లవార్లు బహుమార్గముల న్వినుతింప నశ్వవే
తండవినూత్నరత్నసముదంచితకాంచనముఖ్య వస్తువుల్
కొండని తిప్పయప్రభుని కొండన యర్థుల కిచ్చు నిచ్చలున్. ౨౬

గీ. వాఁడు నిర్మలనిజవంశవర్ధనుండు, వాఁడు బాంధవసముదాయవత్సలుండు
వాఁడు దేవేంద్రసన్నిభవైభవుండు, వానిఁబోలఁ బ్రధానులివ్వసుధఁ గలరె.

సీ. ఘోరాహవక్షోణిఁ గుంది ధైర్యము దూలి కురురాజు మడుఁగులోఁ జొరక యున్న
జీవనస్థితి చౌకగా వానరములచే వడిసముద్రుఁడు గట్టువడక యున్నఁ
బోరిలో నడుఁకుచుఁ బూని ధర్మతనూజుఁ డాచార్యుతోఁ గల్లలాడకున్నఁ
బురహరనేత్రవిస్ఫురదనలాహుతిఁ గంతుఁ డనంగుండు గాక యున్న

---

* దర్శనంబిచ్చె. మూ.   + వీరణ్ణకు. మూ.

జగతిపై మానగాంభీర్యసత్యరూప, గరిమలను గొంత యొనవత్తు రరసిచూడ
శ్రీశపాదాబ్జసేవాసమృద్ధుఁడైన, మంత్రి తిప్పయకొండనామాత్యునకును.

క. ఆకొండమంత్రిసుతునికి సత్కృతిఁ జెన్నొందుమల్లమాంబకు రామ
శ్రీకృష్ణులగతిఁ బుట్టిరె, ధీకలితులు నరసవిభుఁడుఁ దిమ్మఘనుండున్. ౩౦

ఉ. కొండయదండనాయకునికూరిమితమ్ముఁడు నాగరాజు మా
ర్తాండుఁ డఖండతేజమున నంబుజవైరి సమగ్రకాంతి నా
ఖండలమూర్తి భోగమునఁ గర్ణుఁడు దానమునన్ లతాంతకో
దండుఁడు రూపసంపదల ధైర్యమున న్సురశైల మారయన్. ౩౧

క. ఆనాగమంత్రివరునకుఁ, బ్రాణపదంబైన దేవమాంబకు దానే
దానీంతనకానీనుం, డౌనాఁ దగి చెన్నశౌరి యుదయము నొందెన్. ౩౨

సీ. ఆమంత్రిపుంగవుం డష్టభాషాకవివర్యుఁడై పొగడొందె వసుధయందు
ద్విపదగా నారసింహపురాణ మొనరించి భక్తి నహోబలభర్తకిచ్చె
బాలభారత మంధ్రభాషను వచనకావ్యంబుచేసెను గవీశ్వరులు మెచ్చ
సౌభరిచరితంబు జక్కులకథ చెప్పె లాలితనవరసాలంకృతముగ
మఱియుఁ బెక్కుకృతుల్పటుమతిరచించె, ఖ్యాతినరసింగరాయలచేతఁగొనియె
నగ్రహారంబులును వివిధార్థములును, వెలసెఁగొండమఁబెండ్లియై విభవమునఁగ

క. అచెన్నయమంత్రికిఁ బుణ్యాచారకుఁ గొండమాంబ కంచితనీతి
న్వాచస్పతితుల్యుఁడు విద్యాచతురాననుఁడు నరసనాఖ్యుఁడు పుట్టెన్. ౩౪

గీ. తిప్పయామాత్యకొండమంత్రికి నిపుణ్య, సాధ్వియగుమల్లమాంబకు సకలభాగ్య
సహితులై యుద్భవించినమహితకీర్తి, హారులగునారసింహతిమ్మాఖ్యులందు

సీ. శ్రీమదహోబలస్వామిపాదాబ్జము లర్చగించినాఁ డాత్తమధులిహమును
దానాంబుధారల ధారణీసురదైన్యకర్దమపుంజంబుఁ గడిగినాఁడు
సత్కీర్తిమల్లికాసౌరభ్యములను వైరించాండపేటి* వాసించినాఁడు
చండప్రతాపమార్తాండమండలిచేత ధూర్తారితుహినంబుఁ దోలినాఁడు
ప్రణుతియొనరింపఁదగదె నృపాలసభలఁ, బరమభాగవతోత్తముభవ్యచరితుఁ
జారుతరపుణ్యగణ్యు నీసకలదండ, నాథకులసింహుఁగొండయనారసింహు.

మ. పరకాంతామణిఁ దల్లిగా మనమున న్భావించు నేవేళ నె
వ్వరితోఁ బొంకఁ డొకప్పు డన్యధనము ల్వాంఛింపఁ డశ్రాంతమున్

* వైరించాండపెట్టె-మూలము.

హరినామస్మరణంబె కాని యితరవ్యాసంగముల్ సేయఁ డా
నరసామాత్యునిసాటి యాదురె పరిధానశ్రేణిలో నెవ్వరున్. ౩౭

క. నారదుఁ బ్రహ్లాదు న్శుకుఁ, బారాశర్యు న్వసిష్ఠు బలి గాంగేయుం
గోరి వినుతించువేళల, ధారుణిలో నరసమంత్రిఁ దగు వినుతింపన్. ౩౮

సీ. ఆనరసామాత్యుఁ డద్రినందనతోడ నలయరుంధతితోడ నదితితోడ
భూమిజతోడ లోపాముద్రతోడ నాజాహ్నవితోడఁ గౌసల్యతోడ
ధారణీకాంతతో భారతీసతితోడఁ బౌలోమితోడఁ సుభద్రతోడ
రుక్మిణీరమణితో రోహిణీదేవితో దమయంతితోడ గాంధారితోడ
సాటిసేయంగఁ దగినట్టిజలరుహాక్షిఁ, బరమకళ్యాణిఁ దిరుమలాంబను వరించి
రమ్యమగుప్రోలుగంటిపురంబునందుఁ, దనరె సౌభాగ్యముల బంధుజనులు

క. శ్రీదనర ననుదినంబును, మేదురభోగములచేత మించినవేడ్కన్ (వొగడ.
మేదినిలోపల నెసగిన, యాదంపతులకును బంధు లానందింపన్. ౪౦

సీ. నెత్తమ్మితావిఁ జెందినపద్మినీజాతికొమ్మల కతనుండు తిమ్మఘనుఁడు
బంధువర్గంబులభవనాంగణంబుల వెలయువేలుపుఁదప్ప వెంగళప్ప
వెలలేనివస్తువు ల్విద్వత్కవీంద్రుల కొసఁగుదానవిహారి యోబశౌరిఁ
నందేలచిన యోబనాథహృద్వీణకు రంగుమీఱినతంత్రి రంగమంత్రి
చండమార్తాండసదృశుండు కొండవిభుఁడు, దిశలసత్కీర్తిచంద్రికల్ తేజరిల్ల
జననమొందిరి కల్పవృక్షంబులేను, బురుషరూపముధరియించి *పుట్టెననఁగ.

గీ. అందు నగ్రజుఁడైనతిమ్మాహ్వయుండు, ప్రేమతో లక్ష్మమాంబను బెండ్లియాడి
కుశలవులఁ బోలువారలవిశదయశుల, సింగనను మాదనను గాంచెఁ జెన్నుమీఱ

క. ఘనుఁడైనవెంగళప్పయు, నొనరఁగాఁ దిమ్మమాంబ నుద్వాహంబై
దిననాథప్రతిమప్రభు, జననుతచారిత్రు సూరసచివుని గనియెన్. ౪౩

చ. ఉరుతరపుణ్యగణ్యుఁ డగునోబయమంత్రియు గోపమాంబ నం
బురుహదళాయతాక్షిఁ బరిపూర్ణనిశాకరసన్నిభాననం
బరిణయమై చెలంగి కులపావనుల స్మహనీయవైభవ
స్థిరులను గాంచె నిర్వురను జెన్నచమూవరుఁ దిమ్మనాహ్వయున్. ౪౪

చ. ఘనతరుఁడైనదానగుణగణ్యుఁడు రంగనదండనాథుఁ డా
వననిధిరాజకన్య కెనవచ్చినకోమలి యజ్ఞవేదిమ

---

*పుట్టిరనగా-మూలము.

ధ్యను హనుమాంగనామణి ముదంబలరంగ వివాహమై సుహృ
జ్జనములు సన్నుతింప ఘనసంపద సొంపువహించె నెంతయున్. ౪౫

క. అంగజనిభుండు కొండన, యుం గవుడై భాముమీాఁద నుత్పలగంధిన్
రంగాంబను నిరుపమితను, భాంగి న్వరియించి మించె సంచితలీలన్. ౪౬

గీ. ఆనరసమంత్రిశేఖరుననరజుండు, గంధిలాశుగలావణ్యగణ్యమూర్తి
తిమ్మధీమణి వెలసె ధాత్రీతలమున, బన్నగారాతివాహనభక్తిపరత. ౪౭

మ. భువిలో నన్నము పెట్టు ద్వాదశుల నాభూదేవరత్నంబు కొం
డవరుక్మాంగదభూకళత్రుఁడో యనా సర్థుల్ ప్రియంబందఁ గ
ర్ణవితీర్ణిప్రతిభావిభాసి యయి *యన్నాంజాలి మందాకినీ
లవలీకల్పలతాసితాంశుహిమఖేలత్కీర్తిసంపన్నతన్. ౪౮

గీ. ఆతనికిఁ బుణ్యవతియైనయక్కమాంబ,వలనఁ బనయులుగలిగిరివనధినములు
తిమ్మధీరుండునప్పమంత్రియునునరస,నచివుఁడునుదిర్మలయ్యయుఁజారుయశులు

క. ఏవంవిధవంశంబున, నావిఖ్యాతప్రధానహర్యక్షులలో
శ్రీవెలయఁ గీర్తిశుభగం, భావుకుఁడై రంగమంత్రి వహి నుతికెక్కెన్. ౫౦

సీ. సర్వంసహామహాజలరుహాకరమున విహరించు నేమంత్రివిజయలక్ష్మి
దిగ్వధూదరహాసదీప్తులతోఁ జెల్మి గావించు నేమంత్రిఘనయశంబు
పెరిమె నంభోధికిఁ బెక్కండ్రుసతుల నుత్పాదించు నేమంత్రిదానవారి
పున్నమజాబిల్లిచెన్ను నన్నుపచేసి నవ్వు నేమంత్రిసౌందర్యరేఖ
యతఁడుహావళిచినయాభళానసీశ,బహుళసామ్రాజ్యధారేయమహిమనిపుణ
విపులబాహార్గళాటోపవిజితభుజగ,సార్వభౌముండు రంగయసచివఘనుఁడు.

సీ. వైభవస్ఫురణచే వజ్రాయుధుండయ్యు సత్యభామినిఁ గోరఁ డాత్మయందు
సౌందర్యరేఖతోఁ జక్రాహితుండయ్యుఁ దొడిఁబడ నిజగురుద్రోహిగాఁడు
వరదానవైఖరి వైరోచనుండయ్యుఁ గించిత్తు నర్థికిఁ గ్రించుపడఁడు
వల్గువిక్రమశక్తి ఫల్గునుండయ్యును వెఱచి పోర శిఖండివెనుక నిలువఁ
డవుర కర్ణాటలాటచోటాంధ్రముఖ్య, మానవాధిపఘనసభామధ్యభాగ
మాంగధానీకజేగీయమానకీర్తి, రమ్యగుణహారి నరసయరంగశౌరి. ౫౨

శా. కట్టించెం గలశాంబురాశితనయాకాంతామితాగారము
ల్పెట్టించెన్ ధరలోన సత్రములు భూబృందారకశ్రేణికి

* యున్నాక్ - మూ.

క. ఆశ్వలకులోజ్జ్వలునకు, గర్వితరిపుగహనదహనకనదనలునకున్
సర్వంసహామహాధిక, ధూర్వహబలునకును విగతదుశ్శీలునకున్. ౬౧

క. ఖండితఘనదుష్కృతికిని, బండితజేగీయమానపరహితకృతికిన్
గండస్థలమండితమణి, కుండలవితతికి నిరస్తకుహనామతికిన్. ౬౨

క. పాత్రచరితాశ్వలాయన, సూత్రున కధికతరసుకృతశుభగుణచంచ
ద్గాత్రునకును బుధనుతచా, రిత్రున కశ్రాంతకృతహరిస్తోత్రునకున్. ౬౩

క. శ్రీవరపాదాంభోరుహ, సేవాదత్తావధానచిత్తాబ్జునకున్
భావభవసదృశరూపధు, రావంచితనిష్కళంకరాకాబ్జునకున్. ౬౪

క. హిమమండలరిపుమండల, సమచండిమభీమధామసంస్త్యాయునకున్
రమణీయసురమణీనిక, రమణీధ్యేయునకు దానరాధేయునకున్. ౬౫

క. సరసప్రధానురంగస, కరినృపదుర్మంత్రిగర్వహాతిచంగునకుం
గరుణాగుణసంగునకును, బరమతిరపరోపకారఫలితాంగునకున్. ౬౬

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నే రచియింపంబూనినయుత్తరనరసింహపురా
ణంబునకుం బ్రారంభం బెట్టి దనిన.

—: కథా ప్రారంభము. :—

ఉ. పుణ్య మగణ్యయాగఫలభోగినిరస్తసమస్తదేవకా
ర్పణ్యము ముక్తియావతశరణ్య ముదగ్రసమగ్రబోధదా
క్షిణ్య మశేషకాననవిశేషవరేణ్యము నైన నైమిశా
రణ్యము చూడ నింపగుఁ దరణ్యభిభావిసరణ్యగాగ్రమై. ౬౭

సీ. ఏయరణ్యమునందు నింద్రాదిదేవతాతతి సకుటుంబమై తరలకుండు
నేయరణ్యమునందు నిసుమంత జాతివైరములేక సత్త్వజాతములు మెలఁగు
నేయరణ్యమునందు నిందుశేఖరధాతృకమలాక్షముఖులు సౌఖ్యంబు గాంతు
రేయరణ్యమునందు నాయురారోగ్యాభివృద్ధిప్రదాయి వివేక మడరు
నేయరణ్యంబునందు భక్తేప్సితార్థ, సిద్ధికరి యైనయోగలక్ష్మియుఁ జెలంగు
నట్టి శ్రీనైమిశారణ్య మఖిలమౌని, విహరణస్థానమై యభివృద్ధిఁ దనరు. ౬౮

వ. ఆనైమిశారణ్యంబుసంప్రబోధనిస్తంద్రులగుమహామునీంద్రులునఖిలకళ్యాణా
కర్షణుం డగురోమహర్షణువలనహిరణ్యకశిపుజన్మంబును నతనితపోమహత్త్వం
బును జంభునిఘాతుకైసయంభోరుహాత్మజుఁ గయాధు వనుదానిస్వయంవరం
బును మొక్కలంబున నక్కన్యకారత్నంబు హిరణ్యాక్షపూర్వజుం డఖర్వ

దోర్గర్వంబునం దెచ్చుటయును జంభహిరణ్యాకశిపుల యుద్ధసంరంభంబును నారంభోరువువలనఁ బ్రహ్లాదు నుదయంబును నతండు దైత్యకుమారులకు విష్ణుభక్తి ప్రకారం బుపదేశించుటయును గనకకశిపుండు తనతనయుం గనలి పలుకుటయును శ్రీనృసింహావతారంబునుహిరణ్యాకశిపువిశసనంబును మొదలుగాఁ గలుగుకథావధానంబులు విని యక్కథకునకు శౌనకాదిమునీంద్రు లి ట్లనిరి. ౨౦

ఉ. శ్రీనరసింహమూర్తి సురసిద్ధగణంబులు సన్నుతింప న
ద్దానవనాథువక్షము శితత్రిదశేశ్వరవజ్రనిష్ఠురా
త్యానతవిస్ఫురన్నఖచయాగ్రముల న్విదళించి యంతఁ ద
త్సూనునిఁ గాచి మెచ్చుటికిఁ జువ్వన నేగనొకో యకల్మషా. ౨౧

గీ. విష్ణుకథలు తొల్లి వినినవేనియు నిత్య, నూతనోత్సుకంబు నూలుకొలిపి
పరిణమింపఁ జేయుహరిణాంకకిరణంబు, లభినవములుగా వెయునుదినంబు. ౨౨

క. భవదీయముఖవినిర్గత, వివిధకథామృతము గ్రోలి వివశములై మా
చెవు లిపుడుఁ దనివిఁ బొందవు, భవగుణరహితప్రచార పరమోదారా. ౨౩

వ. అని పలుకునమ్మహాతపోధనుల మునుమినుకులం బోని సూక్తిజాలంబు లాలించి సహర్షోత్కర్షంబుగ రోమహర్షణుం డమ్మహాత్ముల కిట్లనియె. ౨౪

క. నారాయణపదయుగళాం, భోరుహసద్భక్తు లఖిలపూజ్యచరిత్రుల్
మీ రెఱుఁగని విష్ణుకథా, ప్రారంభము లున్నవే మహామతులారా. ౨౫

గీ. అయిన నేమి యుష్మదంఘ్రిపదార్చనా, ఫలితబుద్ధిసిద్ధిఁ బరఁగి యేను
నృహరిదివ్యదేహనిర్యాణ*వృత్తంబు, వినినయంత మీకు విన్నవింతు. ౨౬

—: నారదుఁ డింద్రునికడకు వచ్చుట. :—

వ. అది యెట్టి దనిన నొక్కనాఁడు మహేంద్రుండు దేవగంధర్వసిద్ధసాధ్యరక్షోయక్షదిక్పాలకకిన్నరకింపురుషగణంబులునురంభాదిసురకామినులుం గొలువ నిండుకొలువున కేతెంచి యందు రత్ననిర్మితం బైనసింహాసనంబున సమాసీనుండై యున్నసమయంబున సమరభోజనప్రయోజనవిశారదుండగు నారదుం డేతెంచిన నమ్మహాత్ముని నెదుర్కొని యర్ఘ్యపాద్యాదు లర్పించి సముచితాసనంబున నుపవిష్టుం జేసి కృతాంజలియై యిట్లనియె. ౨౭

క. భవదీయపాదరేణువు, దవిలిన మద్భవన మెల్ల ధన్యత నొందెన్
వివిధశుభాస్పద మయ్యెను, దివమును ద్వద్దర్శనమున దివ్యమునీంద్రా. ౨౮

---

* వృత్తమే-మూ.

గీ. అడుగవలయు నొక్కటడిగెద నది మాకు, నిర్ణయింపవలయు నేర్పుతోడ
నీజగంబులందు నెఱుఁగనిదొకటైనఁ, గలదె మీకు నఖిలకలుషదూర. ౭౯

క. హరి నరహరియై నఖముల, సురవైరి వధించి యతనిసుతుఁగాచియనం
తరమున నిజతను వేక్రియఁ, బరిముక్తము చేసెనొక్కొ పరమార్థజ్ఞా. ౮౦

వ. అని పలికిన దేవేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. ౮౧

ఉ. ఆ నరసింహుఁ డట్లు శరభాకృతిఁ దాల్చు పురాసురారితోఁ
బూనినరోషవహ్ని నిజభూతకృతిమారుతవేగవర్ధితం
బై నలినోద్భవాండము నహర్నిశమున్ దహియింప దేవతా
దానవబృందము ల్బెగడఁ దానొనరించె రణం బరీణుఁడై. ౮౨

క. శరభనృహరు లీక్రియ దు, ర్ధరయుద్ధము చేసి చేసితమతమ తేజ
స్స్ఫురణాపరిణాహము లా,దరమున నజువలనఁ దెలిసి తత్ప్రియమునకై. ౮౩

క. నరసింహశరభరూపము, లురవడి నుపసంహరించి యొద్దికతోడన్
హరిహరు లొకతనువున నిలి, చిరి సురలునుతింప భువనచిత్రచరిత్రా. ౮౪

క. ఆక్షేత్రము హరిహర మన, దక్షిణదిక్ప్రథిత మయ్యెఁ దన్నికటమహీ
మక్షికయు నిలిగి యక్షయ, మోక్షశ్రీ నక్షియుగళముకురము సేయున్. ౮౫

వ. అని యిట్లు నారదుండు నృసింహావతారోపసంహారవృత్తాంతం బెఱింగించిన విని పురందరుం డిట్లనియె. ౮౬

క. హరిహరులు లోకరక్షా, పరులు నృహరిశరభరూపబంధురులై భీ
కరఖరకరకరసితముఖ, శరముల ననిసేయు టేమిచంద మొ యనఘా. ౮౭

క. సురభావితపదయుగ యగు, శరభాకృతి పూర్ణచంద్రశరభాకృతి శం
కరునకుఁ బూనఁగ నేపని, హరు, వయ్యెనొకో రణాశనా తెలుపఁగదే. ౮౮

వ. ఇవ్విధంబున శచీవల్లభుండు పలికినఁ దపోధనవల్లభుండు విని శరభావతారవృత్తాంతంబు స్వకీయాపరాధంబున నైనది యగుటం జేసి యతండు తత్కథావిశేషంబు సంకోచంబునం జెప్పి బ్రహ్మలోకంబునకరిగెనని రోమహర్షణుండు శౌనకాదులకు విన్నవించిన నమ్మునీంద్రు లిట్లనిరి. ౮౯

క. ఏమియపరాధ మొదవెం, దామరవిరిమనుమనందుఁ దత్కథ సర్వం
బామీఁదఁటివృత్తాంతము, ధీమహితా నీవు మాకుఁ దెలుపఁగవలయున్. ౯౦

వ. అనిన విని రోమహర్షణుం డమ్మునీంద్రుల కిట్లనియె.

సీ. హరిదానవాధీశు నణఁపనుద్యుక్తుఁడై పురుషహర్యక్షవిస్ఫురణ దాల్చి
త్రిభువనానందవర్ధిష్ణుఁడై యాహిరణ్యకశిపు నరికట్టి యురగఁబట్టి

యాదిభాగవతుఁ బ్రహ్లాదునిఁ దద్రాజ్యవిభునిఁగానొనరించిశుభములొదవఁ
బ్రజలరక్షించిభూభారమంతయుమాన్చినిశ్చింతహృదయుఁ డైనెగడియుండె
నంతహతశేషులైన దైత్యాధిపతులు,సంతతంబునుభయసమాక్రాంతులగుచు
మందరద్రోణికామధ్యమంబునకును, జేరి యచ్చో మిథస్సమాసీను లగుచు.

క. చింతాపరవశులై మది, నెంతయుఁ బరితాప మంది హితకార్యంబుల్
చింతించుచుఁ దమలోన, త్యంతంబును బ్రతుకుఁదెరువుప్రహతహసూపక్.

ఉ. దానవనాయకుం డణఁగెఁ దత్సుతుఁ డిప్పుడు విష్ణుభక్తుఁడై
దీనునిమాడ్కిఁ బ్రత్యహము దేవగణంబుల కాప్తుఁడై తదీ
యానుమతంబు లైనపను లర్థి నొనర్చుచు నున్నవాఁడు దు
ర్మానముతోడఁ దండ్రిపగ మానసవీథిఁ దలంపఁ డింతయున్. ౯౪

సీ. అవినీతుఁ డైనప్రహ్లాదుని మనకెల్లఁబలిగాఁ దలంచినఁ బ్రాణహాని
వంద్యుఁడై దేవుఁడై వరదుఁడై దైతేయపతులకెల్లను దిక్కు. పార్వతీశుఁ
డామహాత్ముని నాత్మఁబ్రేమతోఁదలఁచినఁగలుగు*నిష్టములైన ఫలములెల్ల
నీయఁడే తొల్లిదైత్యేంద్రుల కతిమోదమునవరంబులు లోకములునుతింప
ననుచుఁదలపోసియాతుధానాగ్రచరులు,పద్మమిత్రునిపై దృష్టిపాదుకొలిపి
జలమువాయువు నాహారములుగనడస్కి,తపము సేయంగఁబూనిరిదర్పముడిగి.

—: దానవులు శివునింగూర్చి తపము చేయుట :—

చ. దనుజులు దేహవాంఛ విడఁదన్ని శివాధిపుఁగూర్చి సంతసం
బునఁ దప మాచరించునెడఁ బుట్టినతద్దహనోగ్రకీలల
స్మనుకొని సర్వలోకములు ముచ్చముణింగె బెహారి సంచుల
ద్దినముతుది స్మణంచినగతిం బ్రవిముక్తబహిఃప్రచారతన్. ౯౫

క. దనుజకృతం బగుతపమున, మనసిజసంహారునినిండుమనము గరంగెం
గనదనలద్రావితనూ, తనవనీతప్రపూరితకలశలీలన్. ౯౬

సీ. వలమానదహనకీలల నీను నెమ్మోముములికితో జ్ఞావంక కలికితోడ
వెలఁదివెన్నెలరేల వికసించు విరవాజి†పువ్వుతో నిద్దంపునవ్వుతోడ
వలపువసంతంబుఁ దలకొల్పు సుస్నిగ్ధభూతితో శృంగవద్యుతితోడ
వికటంపులీలలు ప్రకటించి నర్తించు నందితో‡ విసురాపుమందితోడ
భుజగహారంబుతోడఁ గర్పూరతుహిన, రాశిసంకాశకాంతిపూరంబుతోడ
నమరరిపులకుఁ బ్రత్యక్షమయ్యెనిఖిల,సంయమివశంకరుండగుశంకరుండు.

* నిష్టము-మూ. † విరివాజి-మూ. ‡ వందితో-మూ.

మ. కని రాదైత్యులు నందివాహనుని శ్రీకంఠుం ద్రిశూలాయుధు
న్వనజాతారికళాధరుఁ హిమసుధావర్ణుం ద్రినేత్రుఁ భుజం
గనికాయాంచితభూషణుం బ్రమథసంక్రాంతున్ జటాపర్యట
ద్ఘనపుష్పాకలితున్ హిమాద్రితనయాకాంతు న్మహాశాంతునిన్. ౯౯

వ. అంత నద్దనుజవీరులు కరుణారసప్రవాహ మకరందనిష్యందతుందిలంబును
నకుంఠితకంఠకాళిమకలభసలకలభమసృణంబును బ్రసవశరశరీరగంధసార
సంజనితక్షోదమేదురపరాగంబును సరాగజటాపటలఝాటఘటితకుటిలకు
ముదినీవిటకోరకంబును నుదారబాహామండలవిటపమండితంబును దుహిన
గిరిదుహితృలతాలింగితంబును నగు నాయనంగమథనునాకారంబు నిజతపః
ఫలప్రదాయకంబగు లేఖనాయకశాఖిశేఖరంబుగాఁ దలంచి యలంతకలంత
యుం దొలంగి తదీయశీతలచ్ఛాయాచక్రంబు నాశ్రయించుచు నవని కెఱఁగి
లేచికరకమలపుటంబులు నిటలంబుల ఘటియించి యిట్లని స్తుతియించిరి.

—:రాక్షసులు శివుని స్తుతియించుట.:—

సీ. శ్రీనీలకంఠ యాశ్రితభక్తవత్సల పురవిభేదన సర్వభూతనాథ
శంకర గౌరీశ శర్వ లోకేశ్వర గంగాంబుపరిషిక్త కాలరూప
కందర్పభసితసంక్రాంతభవ్యశరీర చంద్రశేఖర నాగచర్మవసన
నందివాహన జగద్వందిత, శూలవిభ్రాజితకర లోకపాలవినుత
భవ మహాదేవ పన్నగాభరణ రుద్ర, ప్రమథనాయక దక్షాధ్వరప్రశమన
యంధకాసురహరణసత్యస్వరూప, మమ్ము రక్షింపవలయు భీమప్రభావ.

క. పురుషుఁడు రుద్రుం డనుమను, నొరయుచు నలసకలవేదములు చాటెడిచోఁ
బరమేశ పురుషద్వైతం, తర*మున్న దియే జగత్త్రితయమునఁ దలఁపన్. ౧౦౨

క. జ్వలనవియన్మరుదచలా, జలదీక్షితచంద్రపంకజప్రియు లన మీ
విలసన్మూర్తులఁ ద్రిజగంబులు నిత్యము వృద్ధిఁబొందు భూతనివాసా. ౧౦౩

క. నారదసనకసనందన, మారుతభుగ్రమణవిబుధమంత్రిషడాస్యాం
భోరుహసంభవముఖ్యులు, మీరూపముఁ దెలియఁగలరె మీనాంకహరా.

మ. కరిదైత్యేంద్రుని సంహరించి త్రిజగత్కల్యాణముం గోరి శం
కర నీ వాక్రియఁ దాండవంబు సలుపంగా నీదుపై రాలున
మ్మరులుం గమ్మనిబూది దేవమునిసామ్రాట్సిద్ధగంధర్వభా
స్కరచంద్రాదులు దాల్తు రౌఁదలల రాకాకాముకాభప్రభా. ౧౦౫

---

* మున్నదయే. మూ.

చ. ధరణి రథంబు చక్రములు తారకనాయకలోకలోచను
ల్పరపగు వేదజాలములు పన్నిన తేజులు నల్వ యంత ని
ర్జరగిరి విల్లు సింగిణి భుజంగమభర్త శితాస్త్ర మిందిరే
శ్వరుఁడును నై చెలంగఁ బురసంహరణం బొనరించి తీశ్వరా. ౧౦౬

చ. గరుసులు మీఱ మందరముఁ గవ్వముచేసి సురాసురావళుల్
తరువఁగఁ దర్వఁగా నిఖిలదాహకరోత్కట కీలజాల మై
గరళము పర్వఁ గేలఁ గొని కంఠము సేర్చితి విట్టి మొక్కలం
బొరులకు సంభవించునె సురోత్తమ పాదనతాత్మవిత్తమా. ౧౦౭

ఉ. దక్షుఁడు దక్షుఁడై క్రతువిధానమొనర్పఁగ దర్పఘోరరూ
క్షేక్షణవిస్ఫులింగముల నెల్లజగంబుల వేఁచుచు న్విరూ
పాక్ష తదీయమస్తకము హాస్తకనస్తణికందుకంబుగా
నాక్షణమాత్రఁ జేయవె మహాపురభైరవ కాంతికైరవా. ౧౦౮

క. రక్షారుద్రాక్షాపరి, లక్షితశుభలక్షణులకు లంచము లిడు న
స్మాక్షరమ యిక్షుకార్ముక, శిక్షాకాక్షేయనిటలశిఖిజటిలశిఖా. ౧౦౯

క. కలువీఁడుఁ జేతికూడు, న్నలకలజందెంపుఁద్రాడుమదనునిసూడున్
వలచేఁ గంకటికోడుం, గలవాఁడా నీదుకరుణగలవాఁడు శివా. ౧౧౦

చ. పరధనచోరకుండు గురుభామలతో రతిసల్పువాఁడు భూ
సురవరహంత మద్యపుఁడు సూనృతవాక్యవిహీనుఁ డాదిగాఁ
బరఁగున శేషకల్మషులు పన్నగభూషణ మీపదాంబుజో
పరిపరిలగ్నభక్తిపరిపాకమున న్సుఖు లౌదు రెయ్యెడన్. ౧౧౧

క. శివశివ యని మిముఁ దలఁచిన,భవభవ రాహిత్య మొంది పంచజనుఁడు ప్రా
భవభవనాయితతనువై, కవకవ నగు జన్మపాశ కాండావృతులన్. ౧౧౨

ఉ. సైకతదారులోహమణిచందనపంకములందు దివ్యలిం
గాకృతిగా నొనర్చి మిము నందుపయి న్విడియించుచున్ వృథా
పాకముగాని నేమముల భక్తిభరంబునఁ బూజసేయు పు
ణ్యాకృతు లందు రందుఁ బ్రమథాధిపులై రజతాద్రికందరన్. ౧౧౩

క. శివలింగదాన మర్వీ, దివిజులకు నొసంగునట్టి ధృతిమంతులు పు
త్రవధూధనవాహనబాం, ధవపరివృతు లగుచు సంపదలు గాంతు రిలన్.

సీ. భసితత్రిపుండ్రము ల్ఫాలపట్టికలపై ధరియింపనేర్చిన తత్త్వవిదులు
కంఠభూషలుగాఁగఁ గైకొని రుద్రాక్షదామము ల్దాల్చినధర్తరతులు

ప్రేమతోఁ బంచాక్షరీమంత్రరాజంబు జపియించు సంతతాచారపరులు
బాహ్యంబుమఱచి యా*భ్యంతరమ్మునమిమ్ముధ్యానంబుసేయుపుణ్యస్వరూపు
లన్య మెఱుఁగక శైవమార్గానురక్తిఁ, బొదలుచుండెడు విశ్రుతాద్భుతచరిత్రు
లలఘుపుణ్యులుభవబంధములుత్యజించి, ప్రమథులై మిమ్ముసేవింతురమరవంద్య

విరోష్ఠ్యసీసము.

సతతసత్యాకార చంద్రశేఖరశైలతనయాధినాయక దైత్యహరణ
గరళసంక్రాంతకంధర దయాసాగర హరిరాజకటక యనంగదళన
గంగాధర యహార్యఖండనాద్యాశాదశేశార్చిత శ్రీశ హితగణేశ
ఘనగజాజినచేలకలితకటిస్థల రజతాద్రినిలయ సారజ్ఞరసిక
ఖరఖరానలశశినేత్ర కాంచనాగ, శార్ఙ్గరంజితకరకంజ చక్రహస్త
నిశితసాయక నిఖిలార్థనిత్యచరిత, సకలజగదయనయద రసాళతాంగ. ౧౧౬

చ. జయజయపార్వతీరమణ చంద్రహుతాశనసూర్యలోచనా
జయజయ దేవతానివహసంతతసన్నుత భక్తవత్సలా
జయజయ పద్మజాదిమునిసంఘనిషేవితభావభావితా
జయజయ వామదేవ గజచర్మధరా బహుధర్మసాదరా. ౧౧౭

వ. అనియిట్లు దానవవీరులు సాక్షాత్కరించిన దాక్షాయణీవల్లభుని ననేక
విధంబుల సన్నుతించి మఱియు నిట్లనిరి. ౧౧౮

సీ. విను విరూపాక్ష నీకనికరంబునఁజాల బొదలి హిరణ్యాక్షపూర్వజుండు
భూస్వర్గపాతాళములు మూఁడునరికట్టి గరిగంటిగాని సౌఖ్యములఁదనరి
విభవసంపూర్ణుఁడై చెలసి యుండెడిచోట దంష్ట్రాకరాళవక్త్రంబుతోడ
నరసింహరూపంబుధరియించి కఱివేలు పుక్కుఁగంబమువించియుఱక వెడలి
తొడలపైఁ బెట్టిదైత్యేంద్రు సడఁగఁబట్టి, శితనఖరశిరములఁగుక్షిఁజీరివైచి
సకలరాక్షసబలమెల్ల సంహరించి, తెమ్కుమారుసిఁగాచెనంధకవిదారి. ౧౧౯

క. ఆనరకేసరినాసా, నూనానిలనిహతిఁ గెరలుసురుదంష్ట్రాదం
డాననదహనజ్వాలకు, దానవసంతానములు పతంగములయ్యెన్. ౧౨౦

వ. మఱియును.

సీ. హాలహాలారవనర్తనారంభరంగమై మేటిజిహ్వాకకోల మెఱుఁగులీనఁ
జిటచిటారభటితోఁ జెలఁగుదంష్ట్రాటంకసంవర్తవహ్ని పోసనముగొనఁగ

---

*యభ్యంతరంబు-పా.

భగభగధ్వనులతో నెగసి మిన్నందుచు భూత్కారవాయువుల్పుటము లెగయఁ
గిటకిటచ్ఛబ్దసంకీర్ణంబులై దంతకూటకోటికలు కోలాటమాడఁ
బద్మజాతాదిసురలెల్లభయమునొంద, నున్నవాఁడదె నరసింహుఁడుగ్రుఁడగుచు
నతనికతమున నుద్భవంబైన సాధ్వసంబు దొలఁగించి మముఁ బ్రోవు చంద్రజూట.

వ. అని యిట్లు సురలు నరసింహావిర్భావవృత్తాంతం బెఱింగించిన నాకర్ణించి
పరమేశ్వరుం డిట్లనియె. ౧౨౩

సీ. దనుజనాయకులార తథ్యంబు చెప్పెద వీనులు దనియంగ వినఁగవలయుఁ
గార్యసాధ్యము లైన కర్తవ్యకర్మముల్ ఖడ్గసాధ్యంబులు గావు ఖడ్గ
సాధ్యంబులైనట్టి సకలకర్మంబులు గార్యసాధ్యంబులు గావు తెలియ
నీరెండు నెఱిఁగి యెయ్యది యెందు కర్హంబు తద్వినియోగంబు దగినకార్య
మందుఁ దలకొల్ప సిద్ధించు నర్థలాభ, మట్లుగావునఁ దత్తఱంబాత్మ నణఁచి
తపము చాలించుఁ డెంతయే నుపముఁ జేసి, పాదుకొల్పెద మీకార్యభాగ మిపుడు.

వ. అని యాకాకోదరకుండలుం డామహోదరదీర్ఘదర్శిదంతఘోటకప్రముఖులైన
పూర్వబర్హిర్ముఖుల నాదరించి. ౧౨౪

క. సురగరుడోరగనరకి, న్నరనానానుతులు చెలఁగ నాగాభరణుం
డరిగెఁ దన వెండికొండకు, గిరిజాకరజలజపత్రకీలితకరుఁడై. ౧౨౫

వ. ఆసమయంబున. ౧౨౬

సీ. భర్గుమైభోగంపుఁ బచ్చడంబులకుఁ గెంజడరంగుచం ద్రికచాయ వేయఁ
బండువెన్నెలమ్రుగ్గుపై నిండఁ జేరిన పద్మారిగతి మేనిభసిత మమర
నాకాశగంగామహాకుల్య వలిమలఁబోలెఁ జన్నిదముల పొంకమమరఁ
గరుణాంబుపూర్ణహృత్కమలంబుగతిఁ గేలి తీర్థకుండికె భానుదీప్తిఁ దెగడ
నక్షమణిభూషణాంకితుం డాద్విజేంద్రు, డాన్వయవతంస మఖిలవిద్యావిశార
దుండు నారదుఁడే తెంచె ఖండపరశు, వెండికొండకుఁ గన్నులపండువగుచు.

క. హరుని గనుంగొని తత్పద, సరసిజయుగమునకు మ్రొక్కి చతురయువతిక్రొ
మ్మురువున నురమున బాయక, మరుబుజ్జోనఁగఁ జేయుతనదుమహతీవీణన్

వ. ప్రసారితంబులైనతంత్రీముఖముఖంబులం దుసారియల్లొనరం గూర్చి యరదు స్థా
యిసంచార్యారోహావరోహభేదరూపంబులవాద్యానువాదివివాదిసంవాదులు
మొదలైనద్వావింశతిశ్రుతిమండల సమేతంబులైనంద్యావర్త జీమూతసుభ
ద్రనామకంబైనగ్రామత్రయంబును గలిగి యేకోనవింశతిమూర్ఛనానామభే
దంబులం బ్రవర్తించు షడ్జఋషభగాంధారమధ్యమపంచమ దైవతనిషాదస్వరం

బులుషాడవౌడవసంపూర్ణంబులంబ్రకీర్ణంబులుగానావర్తనప్రకారంబులం
బరిభ్రమించు భైరవిభూపాళశ్రీరాగమాళవినాట గామక్రియాశంకరా
భరణబళహంసాదిస్త్రీపురుషరాగంబులు శుద్ధసాళగసంకీర్ణంబుల శ్రవణమ
నోహరంబగునట్లంగుళీస్పర్శనచమత్కారవిశేషంబునఁ బాడుకొలుపుచు రా
గాలప్తిసమేతంబుగాఁ ద్రిపురవిజయాపదానంబు రూపకాలప్తిమార్గంబు
న వినిపించినఁ దద్గానంబునాకర్ణించి గోకర్ణివలయుం డాదరించిన సంతం
దద్భావంబెఱింగి పరమేష్ఠికుమారుం డిట్లనియె. ౧౩౦

చ. ధరణిఁ బదద్వయం బనలతారకనాయకలోకబాంధవుల్
గరహరనీకు నేత్రములు గాడ్పులు నాభిజలంబు మే....మం
బరము శిరంబునై న్నిగమపంజరకీరము నీశరీర మీ
శ్వర జగదేకపూర్ణవిలసన్మహిమంబున నుల్లసిల్లెడున్. ౧౩౧

క. అవనతముఖమగుతామర, పువుటిత్తిగ మీఁదుగాఁగఁ బొంగించి శిర
స్థవనజసహస్రపత్రము, లవిక్రిందుగ నమృతమాను యతి యసమమతీ.

క. భుక్తియు ముక్తియు నొసఁగఁగ, శక్తుండవు నీవె యనుచు సంసారసుఖా
సక్తిఁ గడకొత్తి భక్తులు, భక్తి న్నినుఁగొలుతు రమృతభక్తాధీనా. ౧౩౩

శా. బ్రహ్మాండోదరపూరితుండవగు నీపాదాంబుజద్వంద్వముల్
బ్రహ్మాదుల్గనలేర యెన్నను భవద్భక్తిప్రభావోన్నమ
ద్బ్రహ్మజ్ఞుల్ హృదయంబులం దలఁచుచుం బ్రఖ్యాతులై చాలఁ ద
ద్బ్రహ్మానందసుఖంబు నొందుదురు రుద్రా భద్రనిర్వాహకా. ౧౩౪

వ. అని నానాప్రకారంబులనిర్వికారాకారుండై నీరజాసనకుమారుండుకుమార
జనకుం బ్రణుతించిన నాపన్నగకంకణుండు ప్రసన్నుండై యతని కిట్లనియె.

చ. మునివర నీవెఱుంగనివి మూఁడుజగంబుల లేవు తజ్జగ
జ్జనితములైన వృత్తాంతములజస్రము ధాతకుఁ గానిపించునా
యనకడనుండి నీవిటకు నై చనుదెంచుట కెద్ది హేతు వీ
వని గనఁగోరి త్రిమ్మరుదు వంతియ కా కితరంబు గల్గునే. ౧౩౫

గీ. భామినీసుతార్థపశుగతంబగు కోర్కి, లేదు నీకు నొక్క లేశమైన
ముక్తివేఁడెదన్న ముక్తుండవిటమున్న, యేమి గోరి వచ్చితో మునీంద్ర.

క. అని నీలకంధరుఁడు పల్కినపల్కుల నాలకించి కేలిమొగుపుతో
మునివరుఁడు వినయవిస్మిత, తనుఁడై యిట్లనియె నతనుదళనుని*తోడన్.

---

* తోనన్. మూ

—:నారదుఁడు శివునకు నరసింహుని ప్రతాపము చెప్పుట:—

సీ. దేవ నీకరుణార్ద్రదృష్టి నాపైఁ బర్వునఁట యింతకంటె నిష్టార్థ మెద్ది
నాకొక్కనికె కాదు నరనాగపశుపక్షితతికి నీకృపయ వాంఛితములొసఁగు
వినవయ్య వేఁడొక్కవిన్నపం బమరారియురమునృసింహుఁడు కరరుహముల
విదళించి మించె నవ్విభుకోపవిభవంబు మున్జగంబులుఁ జుట్టుముట్టుకొనియె
నప్పు డింద్రాదిసుర లెల్ల నిప్పుడొక్కొ,నట్లు మిట్టించి రంభాదు లైనయప్స
రోగణంబులఁ గొని బ్రహ్మ వేగఁ గదిసి,విన్నవించిన నతఁడును వెల్లనయ్యె.

వ. ఆహిరణ్యగర్భునకు హిరణ్యకశిపువిశసనకారి నివారించు భుజాసారంబు
లేదయ్యె వినుము. ౧౪౦

సీ. పాదఘట్టనములఁ బగిలి భూవలయంబు నెఱిదప్పి యొడ్డులు విఱిగి పడఁగ
నాసాకుటీరనిశ్వాసమారుతహతి శైలసంఘము బొమ్మరాలఁ బోల
దంష్ట్రాక్షినిర్గళద్దహసకీలల వియద్భ్రష్టదారాలాజపటలి పెటులఁ
గుటిలనటాచ్ఛటాకోటికుట్టనముల విరిసి మేఘంబులు మురిసిపోవ
నట్టహాసార్భటి బ్రహ్మాండమావులింప,హాలహాలారావమునజిహ్వ సెలసికొనుచు
మించిక్రోధంబుమూర్తిభవించెననఁగ, నుద్భవించె నృసింహదేవోత్తముండు.

క. గిరినిష్ఠుర మగుదానవ,వరువక్షము వాఁడిగోళ్ల వ్రచ్చుట యెట్లా
నరకేసరిపౌరమవి,స్ఫురణాటోపమున కీడు జోడుం గలదే. ౧౪౨

క. మసమసగ వడియె దిక్కులు, విసరె ననమయప్రభూతవిలయానిలముల్.
కసుగందెఁ దరణి ధరణియు, వసివాఁడె నృసింహుకోపవహ్నులునిగుడున్.

క. సురపరివృఢశతమేనియుఁ, బరమేష్ఠిసహస్రమైనఁ బావకపవిభా
స్కరు లొక్కలక్షయైనను, హరిహరి నరహరికి నెదురె హరిణాంకధరా.

క. ఆకాలకూటకబళీ, స్వీకారము చేసినట్టి వీరుఁడవు నీవే
మోకాని మాకుఁ జూడ మ, హాకాళ నృసింహు నెదురు లాఁగంగలరే.

క. ఈనెఱి బరిమితిఁ జనియె, శ్రీనరకేసరిప్రతాపశిఖిచండిమ మీ
కే నెఱిఁగింపఁగ వచ్చితి, నానాయుధదర్పహరణ సురనుతచరణా. ౧౪౬

ఉ. మానుపలీల నన్నెదుర మారుతభుజ్ఞరులందు లేరు వై
మానికు లెల్ల నట్ల పురమర్దనుఁ డొక్కఁడె విజ్ఞుఁడీఁగడిం
దా నెఱబంట నంచుఁ గదనంబున నాతఁడె పన్ని నిల్చినన్
మానముఁ బ్రాణముం గొని నమస్కృతయశంబు వశంబు చేసెదన్. ౧౪౭

వ. అని పలుకుచుండ నప్పరులుమానిసిమొకంబు వికవిక నగుచుండ దేవా నీ వావావదూకుం బోనీక యాఁగి యాఁగిన పంతంబు నంతయు విడిపించి శాంతునిం జేసి యీసకలభువనక్షోభంబు నుపసంహరింపం జేయవలయు నని కంజభవప్రభవుం డంజలిసేయుటయు నాయుగ్రుం డుదగ్రలోచనప్రభలు నిగుడఁ బాయక సేవసేయుచుం జేవచెయి మీఁదగు నమందప్రారంభు నందికేశ్వరుం డమోఘగుణవికారకలితహృదయుండై చూచుటయు నాత్రిలోచనదౌవారికుండు నారదున కిట్లనియె. ౧౮౯

క ఇది యాడఁదగినవాక్యం, బిది యాడఁగరా దటంచు నెఱుఁగరు విప్రుల్ తిరిఁ దోఁచినకాలఁదిన యాఁ, డుదు రేమేనియు శ్రవఃకఠోరము గాఁగన్

సీ. తెగఁ బ్రేయఁడే ధగద్ధగదుగ్రకరవాలధార నంధకశిరస్తామరసము గూల్పఁడే సురశైలకోదండనిర్ముక్తపుండరీకాక్షాస్త్రమునఁ బురములు నుఱుమాడఁడే మామనోముని మఁగఁ జోచ్చుతిండిపోతుల వేల్పుదుండగీల నటచేత వెనుపట్టి చఱవఁడే ముందలపట్టి మృత్యువుఁగిట్టి బాధపెట్టి యమ్మహాదేవునాస్థాని కరుగుదెంచి, మేరమీఱంగ మానిసిమొకముబీర మేలకొనియాడెదవునీకు నెఱుక లేదె, నయనహృత్పూర్ణతంద్ర వీణామునీంద్ర

చ. హరునిభుజాబలంబుఁ గనకాద్రి యెఱుంగు గదాభిఘాత మా తరణి యెఱుంగు బింక మలతామరచూలి యెఱుంగుఁ దూపుబ ల్పరునదనం బెఱుంగుఁ బురపం క్తిలలాటకృశానుకీల ల మ్మరుఁడె యెఱుంగుఁ గాక వెడమాను లెఱుంగఁగ నంతప్రోడలే. ౧౯౧

క. హరునిపరాక్రమమును నర, హరిశౌర్యము నెల్లి నేఁట నమరాసురపం కరుహాభవాదులు నీవును, బరికింపవ దేల వేగపడ జటిలవరా. ౧౯౨

క. మృగలక్షణధరు నాదిమ, మృగయుఁ గరాసక్తయజ్ఞమృగు విధిమృగప న్నగమూర్తిఁ గనినయీవర, మృగమేమియొనర్పఁగలదుమృడునెఱుఁగవొకో

క. శంకాతంకకళంకము, గింకము నొకకొంత లేక క్రిక్కిటిసిన యీ శంకరునభలో నాడిన, బొంకరి నినుఁ దడవఁదగదు భూసురుఁ డగుటన్

క. విను దేవసభల వీణెయుఁ, గొనిపాడెదుగాణ వగుటఁ గుసుమాయుధభం జనుబలము చెప్పఁజూచితి, వినవెకనవె శంభుఁ బొగడువిద్వజ్జనులన్ ౧౯౫

వ. అని యిట్లు సజ్జనానంది యగునంది డెందంబునం గుంది పలికినపలుకులకులికి తెలితపసి వెలువడియె వెడవిలుతుపగఱయుఁ దగుపరివారంబును సంతర్ధానంబు నొంది రంత. ౧౯౬

---

సీ. బలితంపుటెక్కు మొక్కలమొక్కలపుగాడ్పు ప్రాఁతగుబ్బలులను బ్రఁతలఁప
మురియించునిరువంకముఖరంధ్రములనుండిపొఁగలేనిమంటలుబుగులుకొనఁగ
గజగాత్రములసావిఁగబళింపఁ దునుకలై బలునీటిమోపరిబలఁగ మగల
మెట్టియాఁదిన నేలపట్టువిచ్చిన గాడినెరియల బలియింటినెలవు దోఁపఁ
దారకలు రాలగ్రహములు ధరణివ్రాల, జలధి ఘోషింప దిక్కులు జలదరింప
హరుఁడు శరభావతారంబు నవధరించి, వేగ మానవహరిపురోవీథి నిలిచె.

వ. ఇవ్విధంబున రుధిరోద్గారిముఖద్వయతిలకీకృతతృతీయలోచనద్వితయంబు
నుశాతచంచూపుటవిపాటితహరిదంతదంతికుంభకూటంబును బ్రహసితగ్ర
హారమణికిరణధారాపరిణాహసితప్రహరణఘృణిద్విగుణీకృతివలయమణికి
రణభుజాదండంబునునఖండపక్షవిక్షేపప్రక్షుభితనభోభూమిభాగపాతాళగో
ళసంచారిసంచయంబును దర్పితసర్పహారకర్పూరప్రకారకాంతిసంతానవ
ర్ధితశరశరదభ్ర విభ్రమంబునుజతురచరణచంక్రమణసంచలితకులాచలనిచ
యంబును నపారవీరవేశఘోరాటోపదీపితాంతరంగ తరంగితక్రోధరసవిక
సనచకితజఠరస్థజగజ్జాలంబునైయాభీలం బగుశరభాకారంబు తోరంపు
బింకంబునం గొంకక తనకట్టెదుటం జూపట్టుటయు నాకంబంపుంబుట్టు వా
జగజెట్టి తనబెట్టిదంబు వారించుటకునై చేరినమారవిరోధిమతకంపురూపు
గానెఱింగి కోపంబులోపలనే యడంచి గాంభీర్యగౌరవకాఠిన్యగర్వగర్భిత
వాక్యసందర్భంబున నిట్లనియె. ౧౫౮

క. నీయందము నీచందము, నాయందములోనియవియ నాళీకహిత
చ్ఛాయకు లోపడనితమం, బేయెడనున్నది యెఱుంగవే వికృతఖగా. ౧౫౯

సీ. అర్ధపౌరుషము నీకనుషక్తమైనది యాలంబుమీఁదనెట్లానపుట్టెఁ
గరతలామలకమై కనుపట్టుశూలంబు భవవైద్యుఁడనుకొంట పాటియగునె
తోలు గప్పియు నెట్లు తొడవనేర్చితి పుగ్రవారవాణము వీరవర్ణితంబు
భంజళ్ళఁ ద్రొక్కింపఁ బాండిత్యమున్నదే యీజరద్గవమువిహీనజవము
పెంటబూడిదపండైనతొంటిమేను, విడిచి యొకపుల్గవై యేలవిఱ్ఱవీఁగె
దింత నిలుపోకుపోకు నీగంతులెల్ల, మానిపించెద శరభనమాఖ్యతోడ.

క. ప్రద్యోతనతేజంబున, విద్యుత్ప్రభ యడఁగినట్లు విక్రమమున నీ
యుద్యోగము వారించెద, నాద్యంత ముదగ్రవిగ్రహానలశిఖలన్ ౧౬౧

* వారవాణము.

వ. అనిన విని కనలి సరభసంబుగ నాశరభశ్రేష్ఠంబు నిష్ఠురాలాపంబులుదీపింప నాదివ్యహర్యక్షుంబుతో ని ట్లనియె.

క. కులమును రూపును గుణమును, గలవాఁడవె పోలె నొరులఁ గఠినోక్తులచే గలఁగఁగ నాడెదు నీకును, గులమును రూపంబు నొక్కగుణముం గలదే.

సీ. సర్వ*జాతుల యథేచ్ఛావృత్తి వర్తింతు కుహనావిహారివై రహివహింతు వేకాకివై యుందు వీరంపుగుహలందుఁ బట్టిచూడఁగరాదు పరుఁడ వెపుడు తండ్రిబిడ్డలకైనఁ దల పెట్టుదువు పోరు కాద్రవేయము†పోలెనిద్ర ఘనము పుణ్యజనశ్రేణిఁ బొలియింతు వ్రూరక దామోదరుఁడవు శ్రీధరుఁడ వెట్లు కొలుచువారలలచ్చి కేక్రచ్ఛదంతుఁ‡, గబ్బుమీాఱెద విసుమంతగాని లేవుస నిన్ను నీసుద్దులన్నియుఁ గన్నవార, మేల నామ్రోలనూరక ప్రేల నృహరి.

క. కదనంబున నాతెక్కలు, సదనంబుగఁ బొడముదెంచు ఝంఝానిలముల్ వదనంబు సోఁకునప్పుడు, పదనంబుజనాభ!తివిచి పట్టెద వెచటన్. ౧౬౫

క. ధరఁ దూఱిన గిరిఁ జేరిన, శరనిధిఁ గ్రొచ్చిన నభంబు చని చొచ్చిన నా కరరరణనఖరధారలఁ, బురుషమృగమ నిన్ను నిపుడ పొలియంజూతున్.

ఉ. సంధికి వచ్చినాఁడ విను సర్వజగంబులుఁ గ్రోధవహ్నికి ట్లింధన మేలచేసెద వోకించుక శాంతి వహించు నీకు మ ద్బాంధవముద్ర మే లిటులు పల్కుట నిగ్గని వీఁగి కాదు ధీ బంధురు లైనవారిపరిపాటిసుమీా యిది చాటి చెప్పితిన్. ౧౬౭

క. వీరమఖాని విఱివీఁగిన, దారుణమత్తో టికోటిదంభోళిమహో దారతరధారలన నీ, గోరపురూపంబు నడఁగఁగొట్టుదుఁగలనన్. ౧౬౮

చ. అన విని యట్టహాసభయదాననుఁడై నరసింహదేవుఁ డా ఖినుకుల తేజపుల్గుదొరమీాఁదఁ గఠోరకటాక్షవీక్షణం బొనరఁగఁ బల్కు నీవు వినవో కనవో దనుజారిపౌరుషం బునదటు నిన్నుఁ బట్టి యిదె పొట్ట పగిల్చెద బిట్టుఁ గూల్చెదన్. ౧౬౯

—:నారసింహశరభయుద్ధము.:—

క. అని యన్యోన్యముఁ బరుసపుఁ, బెనుఁబలుకులుపల్కి వేల్పుపెగ్గడలురయం బునఁ గదిసి పోరఁ దొడఁగిరి, కనదనలోగ్రస్ఫులింగకలితేక్షణులై. ౧౭౦

* సప్త. 2 కాద్రవేయమె. ‡ కృచ్ఛదంతు-మూ.

సీ. చఱచె ఱెక్కల నృకేసరిఁ గిట్టి శరభంబు పక్షీంద్రుగోళ్లఁ జీరె శ్రీభర్త
శూలి చంచున వనమాలిఫాలము చించె హరి ముష్టిహతి నొంచె నంగజారి
గళ నురం బవియించెఁ గమలాక్షుఁగామారి కొంగవాలున శార్ఙ్గిగొట్టె శివుని
హరుఁడు జానువులఁగంసారిప్రక్కలు నొక్కెఁ బ్రమథేశుఁ జక్రివాలమునఁ జుట్టె
మంత్రితవిభూతినగ్నులు మండఁ జేసి, విష్ణు దేవుని పైఁ జల్లె విషధరుండు(దర.
భుజగశయనుండు మాయంపుఁ బాగలు ముంచెఁ, బంచవదనుని భూతప్రపంచము
సీ. క్రోధంబు చాలదే కుముదాహితుని మ్రింగఁ గడకంటమిడుఁగుఱుఁగదుపు లేల
యార్పులే చాలవే యఖిలంబు బధిరంబు గావింప బిగినవ్వుగమక మేల
క్షతజంబు చాలదే జలధుల పొంగింపఁ గమియు మేనుల నుబ్బు చెమట లేల
బుసకొట్లు చాలవే పుడమి దిద్దిరఁ ద్రిప్పఁ జటులహుంకారప్రచార మేల
యెంతయుద్రేక మెంతదుర్దాంతశక్తి, యెంతబింకంబు పొంకంబు నెంతయనుచు
నిలిచి దివమున నిర్జరావలులు పొగడ, సమరవృషభులు చేసి రుగ్రాహవంబు.
వ. ఈప్రకారంబున దీప్తాకారంబై యాప్రథమపురుషద్వయం బద్వయం బగు
పౌరుషంబునఁ దారసించి మేరలు మీఱిన వారాకరంబులును నార్పరానియన
లంబును నుడివోవని యుగ్రవాయువులును నొండొంటిఁ దాఁకిన యుర్వీ
ధరశ్రేష్ఠంబులుం బోలె నానాముఖనిష్ఠ్యూతకీలికీలాభీలంబుగ నాలంబు సే
యు సమయంబున సదభ్రభ్రమణచంక్రమణప్లుతపరివర్తనస్థానకోర్ధ్వణాది
గతి విశేషంబులు గానిపించె నయ్యిద్దఱయందును దారతమ్యంబు సా
మ్యంబు చూపె నప్పుడు. ౧౭౩
సీ. దివి మాసెఁ గనుమాసె దినకరబింబంబు కురిసె మేఘములు నెత్తురులవాన
విధి దూలె ధర వ్రీలె వేఁగెఁ దారాపంక్తి దిక్కులు చినచినవ్రక్కలయ్యె
శిఖి మ్రగ్గె శశి మ్రొగ్గెఁ జింతాభరాక్రాంతినుడుకెత్తెఁ బ్రజలకు నుదరపేటి*
ఫణిగుండెఁ గిటిగుండెఁ బ్రథమకచ్ఛపరాజు తలపొట్టలోఁ దూర్చె మలలు వడఁకె
మునులు వెఱచిరి సిద్ధులు ముచ్చముడిఁగి, రసురలోకంబు నసురుసురయ్యె సిద్ధ
సాధ్యగంధర్వయక్షులు జలదరించి, రాశరభనారసింహుల యాహవమున.
చ. హరి శరభంబుఁ దోలియును నాశరభేంద్రుఁడు నారసింహునిం
దెఱలఁగఁ జేసియు న్మగుడ దీకొనియు న్సరిపోరి పోరి యా
సురగతి నుండు వేళ హరుచుట్టునుఁ బారిషదుల్ నరాదులు
న్సురియలు దాల్చి నిల్చిరి వచోనిచయారభటీవృతాశులై. ౧౭౪

---

* నుదరపెట్టె.

క. మున్నాడి యసురవీరులు, పెన్నాటికమైనసేన పిలపిల మనఁగా
నన్నారసింహుఁ గదిసిరి, కన్నారం జూచుఖచరగణములువొగడన్ ౧౭౬

చ. అలఘుభుజాబలప్రథితు రాశరపుంగవు లుగ్రసాధనం
బుల నరకేసరిం బొదువఁ బూనినయంతని తన్నృసింహుచూ
పులమెఱుమంటలం జిమిడిపోయిరి జీర్ణములైరి జీవము
ల్దొలఁగిరి తూలి రోటఁజిరి తొట్రిలి వ్రాలిరి కూలిరందఱున్ ౧౭౭

ఉ. ఆసమయంబునం బ్రమథు లార్చి రయంబొనగూర్చి పేర్చి బా
ణాసనసంప్రయుక్తనిశితాస్త్రములం బరఁగింప భూతసం
త్రాసకరంబులై నిగుడు తచ్ఛరము ల్నరసింహవక్త్రని
శ్వాసభవాగ్నిచే నడఁగి సర్వము భస్మము లయ్యెఁ జయ్యనన్ ౧౭౮

వ. ఇట్లు నరసింహదేవుండు.

క. ప్రమథుల సంగరలీలా, విముఖులఁ గావించుటయును విఱిగి పఱచి త్రా
సమున శరభేశువెనుకకుఁ, గమియఁజనిరి నృహరి నిలిచెఁ గల్పాగ్నిరుచిన్

గీ. విఱిగివచ్చిన ప్రమథుల వెఱపుదేరఁ, బలికి సంగరసన్నాహభయదలీల
నూలుకొనఁజేసి నంది యుల్లోలరోష, భీషణాకృతి నని మొనఁ బెరిఁగి నిలిచి.

వ. పక్షికులాధ్యక్షుండు వీక్షింప మనుజహర్యక్షుంబు నాక్షేపించుచు నక్షీణ
క్ష్వేళాముఖరితహరిన్ముఖుండై ఖరకరసహస్రసహశ్రోత్రయు భూతజాతభయా
నకప్రభాపటల చటులంబును ద్రిపురపురపురంధ్రీకపోలతలముకురనికరమ
కరిపత్రికాల్రతాలవిత్రంబునునిజప్రతాపదహనధవిత్రంబు నగునొక్క శక్తిం
బ్రయోగించిన శేషజిహ్వాంచలాకారంబై ఘోరంబై మెఱయుచు నప్పర
మసాధనంబు మాధవరూపాంతరంబు పైనిగిడిన నాబలుమగండు గండు
మెఱసి దండధరదండోద్దారం బగునాక్రూరంపుటలుగును నేలం బెట్టి కాలం
జమరి కదియుటయు మదనహరదౌవారికుండు వైరంబుపేరినమన్నో
వికారంబున ఘోరాననుండై నారాచాసారంబు గురియుచు నరమహావీ
రంబుఁ గదిసి బెట్టిదంబుగ నిట్టు లనియె. ౧౮౧

సీ. కనుఱెప్పవేయక కనలిచూచిన నేమి సర్వతోముఖలీలఁ జనిననేమి
ఘుర్ఘురధ్వనులతోఁ గొప్పరించిన నేమి బలునోరు దెఱచి గర్జిలిన నేమి
భువనసంపూర్తిగాఁ బొడవుసూపిన నేమి క్రొన్నెత్రుమైఁ బుల్కొన్న

కపట్టమునివృత్తిఁ బ్రాఢిమగనిననేమి, కొదమసామ్రాణినెక్కి తూఁగొనిననేమి
నీకు వెఱతునె పోర నాళీకపత్త్ర, నయన శంకరభృత్యుండునందివీఁడు. ౧౮౩

క. నను గెలిచికాక శరభేం, ద్రుని పైనడరంగ వశమె దోషాచరమ
ర్దన నీబీరము గీరము, గనిపింపుము నాకుఁ గలనఁ గలనాశక్తిన్. ౧౮౪

క. అనుటయు నమ్మాటకు మదిఁ, గనలి యనలశిఖలఁ బోలు కాండములేసెన్
దనుజారి నందికేశ్వరు, తనువున నవి గ్రోలఁదొణఁగెఁ దద్రుధిరంబున్. ౧౮౫

క. కడుదురులు గఱచి నట్లై, యొడలు విద్రుచుకొనుచు నందియును బఱచిన నా
కడసంజపొడుపుదేవర, వెడనవ్వుగ నవ్వి శరభవీరుని బొదివెన్ ౧౮౬

లయగ్రాహి.

వారిరువురుం గదిసిపోరిరిలయాంబుధులుపోరునెఱజోకమదవారణకులేంద్రుల్ పోరుగతిసింగములుపోరునెసకంబునను దారుణభుజంగములు పోరుమరియాద ఘోరదవవహ్నులొగిఁ బోరుచటులస్ఫురణమారుతములుద్దవిడిఁ బోరుబలువీఁకం దారలిలరాలఁ దివిరారి రుచిప్రేలఁ *బలవైరినెరిదూల నిజపౌరుషము వాలన్.

మ. శరభేంద్రుండు మనంబులోఁ దలఁచె రక్షఃసైనికాభీలముం
జిరవైరోద్ధతభాస్కరోద్భవశిరశ్ఛేదక్రియామూలముం
బురవప్రావళిభూరిమేఘవిలయప్రోద్భూతవాతూలము
న్వరఘంటాజనితాతిదీర్ఘనినదవ్యాలోలము న్శూలమున్. ౧౮౭

సీ. గబ్బిమే నుబ్బునఁ గదిసిన గజదైత్యుకండలు చెండిన గదురుకంపు
నలచిత్రకాయకాయము విదారించినఁ గడుఁజుట్టుకొను విస్రగంధలహరి
యంధకోరఃకవాటాంతర్విపాటన మాచరించుటనైన నసిచువలపు
కొనగోరఁజిమ్మివాకులకొమ్మమగని యాఁదలగ్రవ్వఁబొదువుమేదంపుఁబొలసు
సురకరవిముక్తమందారతరులతాంత, గంధములఁబొత్తుగలసిన బంధురాత్త
కీర్తిసౌరభవైభవస్ఫూర్తి చేత, నుడువుకొనుశూల మడరెనమ్మృడునివ్రేల.

క. పుటములుగొను పెటపెటలుం, జిటచిటలుం గలిగి విలయశిఖు లుదయించెన్
జటిలములై నిజతేజః, కుటిలములై సూఁడు మొనలక్రూరాస్త్రమునన్.

వ. ఇట్లు సాక్షాత్కరించిన యాశుశుక్షణిబింబంబునుం బోని శూలంబుఁ గేలం గీలించి శరభుం డసురభంజనుపై పైనం బూనుటయు. ౧౮౮

ఉ. విక్రమసత్త్వసంయుతుఁడు వీరనృసింహుఁడు లోఁ దలంచె ని
ర్వక్రపరాక్రమక్రమధురంధరసాహసికత్వవిభ్రమో

* లీల - మూ.

పక్రమమీనధామగృహపాలనిజధ్వజినీమహోపుర
శ్శుక్రము నిర్గళజ్జ్వలనశోషితనక్రము నాత్మచక్రమున్. ౧౯౫

క. తలఁచిన నిలిచె సుదర్శన, మలఘుసుదర్శనము సజ్జనానందంబుం
దలకొలుప నరిప్రభయము*, నెలకొలుపఁగ నృహరికేల నిర్భరలీలన్.

వ. ఇట్లు శరభనృసింహులు సంహారరుద్రాకారులై జగదుపప్లవకారణం బగు మహారణంబునకు నుపక్రమించి శూలచక్రంబు లెత్తుటయు మొగులు మొత్తంబులు నెత్తురులు గురిసె ధరణి విరిసె గిరులు వడంకె సముద్రంబు లిపురంబాఱె మహాకూర్మంబు బిలంబుఁదూఱె నరనాగసురాసురగరుడ గంధర్వసిద్ధసాధ్యు లసాధ్యం బగు మనస్తాపంబునం దపించిరి భూతప్రపంచంబు కుంచితసంచారం బయ్యె నంత. ౧౯౭

—: బ్రహ్మ హరిహరులయుద్ధము మాన్పవచ్చి స్తుతించుట. :—

సీ. హస్తాబ్జముననున్న యక్షమాలిక వ్రేవ వైచి మ్రొక్కులను నున్న వాణిమఱచి
హరిపాదతీర్థపూరాభిపూరితమైన పద్మరాగపుగిండి పగుల నడిచి
నలువంక మొగములఁ దలచూపు చెమటలమంచునేత్రంబులముంచుకొనఁగఁ
గీలుగంటూడిన లోలజ్జటాచ్ఛటావళి యొకకేలనె బలిమిఁదుఱిమి (నకును
కోపమో కాక యావేశగుణమొ కాక, గ్రహముసోఁకెనో కాక యీద్రుహిణు
డనుచు జనములు బెగడంగ నంచ తేజి, రౌతు కాల్నడవచ్చెనుద్భూతభీతిఁ

క. సమరము సేయుచు ఘూర్ణిలు, నమరేంద్రుల నడుమ నిలిచి యాగమసూక్త
క్రమమున నుతియించువచో, రమణీరమణుండు చతురరచనారభటిన్.

సీ. జయ పుండరీకాక్ష జయ ప్రమథాధ్యక్ష జయ రమాతరుణీశ జయయుమేశ
జయ యోగిగణసాధ్య జయ సజ్జనారాధ్య జయ చైత్రగుణజాల జయసుశీల
జయ భక్తమందార జయ ధనళాకార జయ కవిస్తుతిపాత్ర జయ పవిత్ర
జయ సముజ్జ్వలవేష జయ తిరస్కృతదోష జయమేఘసంకాశ జయమహేశ
జయ సువర్ణపటావృతస్థపుటజఘన, జయ మృగాజినచర్మసంఛాదనఘన
జయ గదాపాంచజన్యాసిచక్రహస్త, జయ త్రిశూలదిశస్త్రరాజప్రశస్త.

చ. జయ ఫణిరాజతల్ప జయ సర్వజగన్నుత కౌస్తుభాంకితా
జయ నరసింహరూప జయ శాశ్వత వార్ధితనూభవాధిపా
జయ రజతాద్రిగేహ జయ శంబరశాత్రవభూతిభూషితా
జయ శరభావతార జయ శంకర శైలసుతామనోహరా.



* గరిప్రభయము. మూ. ౪ నుద్భూతభూతి.

సీ. వెడఁదయుదరంబున నెడమభాగంబునఁ జలువవుట్టిండ్లకొమ్మలు చెలంగ
మదుఁగుళాస్పను గేలికడియంబునై గాడ్పుప్రతిలక్ష్మియునైనప్రాణిదనర
బ్రబలనాభిజటాపటలాంచలంబులఁ గమలంబులొకరెండుకాంతిమీఱఁగ
నొఱపైన సాంబ్రాణియును ముద్దుఁగొడుగునై యనురాగమునవినాయకులు మె
బంచజనసింహశరభరూపములు దాల్చి, ప్రాణమును మేనుబోలెనున్నట్టి మీకు
వందనంబును నతి నమోవాక మంజలియును గావింతు నాదిమ లేఖులార.

వ. అని యిట్లు నృసింహశరభరూపంబులు ధరియించినకాంచనాంబరపంచవద
నులకు విరించి వందనంబు లందంద కావించి వెండియు నిట్లనియె. ౨౦౦

గీ. ప్రజలఁ బ్రోచుపనికి బద్ధకంకణులైన, యఖిలమయులు మీరలాగ్రహమున
మేర మీఱిపోరు కారణంబునఁ దమ్మి,యాకు మీఁదినీరమయ్యె జగము.

శా. భూమీకంటకులైన దైత్యవరులం బోనీక శౌర్యక్రియా
సామగ్రిన్మలుచూపువారిశిరము ల్చెక్కాడి యుక్కెక్కి యు
ద్దామఖ్యాతిఁ జెలంగుట ల్విడిచి భూతశ్రేణి భీతిల్లఁగా
నీ మేరిద్దఱుఁ బోరుట ల్తగునె లక్ష్మీశా యుమావల్లభా. ౨౦౨

క. మీరిరువురు భువనావన, కారణములు మీర లిట్లు గదిసి పెనఁగిన
న్నేరుచు నెవ్వఁడు సర్వక, ర్మారంభము చక్క నిలువఁ బ్రకృతిస్థంబై. ౨౦౩

గీ. ఈతమోవికార మేటికి మీకు మీ, నామపఠనమాత్ర నరులకెల్లఁ
జిక్కుఁవడినమనసుచీఁకట్లు వాయుంగఁ, దెలిసికొనుఁడు మీప్రదీప్తమహిమ.

క. ఎదిరినపగ మీలోపల, ముదిరినయది లేదు లోకములు గూఁకలిడం
గదనము సేయఁగఁదగునే, మదనజనక మదనదమన మానుఁడు గినుకల్.

సీ. కైటభమధుశిరఃఖండనావక్రంబు చక్రంబు తేజ మసహ్యతరము
లోలకాలానలాభీలాననంబైన శూలంబు జనమనశ్శూలగదము
గావున నివి రెండుఁ గదనజయాకాంత మీరు ప్రయోగింప మేర లణఁగు
నావిన్నపము విని నసుఁ జాల మన్నించి యుపసంహరింపుఁడీ యుగ్రసాధ
నముల నని నల్వ ప్రార్థింప నలిననేత్ర, ఫాలనేత్రులు తమపూఁచిపట్టియున్న
యాయుధంబులు క్రమ్మఱునట్లు సేయ, భూతజాలంబు సంతోషమునఁ జెలంగె

వ. ఇట్లుపసంహృతాయుధంబై యాయోధద్వయంబు.

క. కర్పూరదీపకళికల, నేర్పునఁ దమయంత నుడిగి నిర్మలకాంతుల్
[illegible] కాంతిమయుహస్తి, దర్పణమొనిలిచె భువనతాపము నుడిగెన్ ౨౦౮

సీ. వై జయంతీలలితోజ్జ్వలభుజామధ్యంబు విధిశిరోమాలికావేల్లితంబు
హరిచందనామందతరసౌరభమయంబు సూనాస్త్రతనుభూతిసురభితంబు
దివ్యతీర్థౌఘమందిరపదాంభోజంబు మందాకినీవృతమకుటతటము
చక్రప్రముఖదివ్యశస్త్రాస్త్రకలితంబు శూలాదిసాధనశోభితంబు
నీలనీలంబు మృదుఫేనజాలనిభము, గరుడవాహంబు వృషభప్రకాండరథము
నైనరూపంబు హరియునుహరుఁడుఁదాల్చి, నిల్చిపొల్చిరిబహురామణీయకముల
సీ. ఆమ్నాయసూక్తిహృద్యముగాఁగఁగీర్తించెసనకాదియోగీంద్రసంచయంబు
శబ్దానుశాసనసౌభాగ్యమధురంబుగాఁ గాద్రవేయపుంగవుఁడుపొగడెఁ
బరమమంత్రరహస్యపరిపాటి వాటిల్ల సైద్ధలోకంబు ప్రశంసచేసె
సంగీతమాధురీసాధురీతి సెలంగఁ గిన్నరగంధర్వులు నుతించి
రఖిలభువననివాసు లాయాయి తెఱఁగు, లేర్పడభజించిరాకంసదర్పహరుని
సర్పహారుని గ్రూరిప్రచారముడిగి, రాఁబింబాభిరాములై తేజరిల్ల. ౨౧౦
మాలిని. హరిదిభకటదానాయత్తమత్తాలిపంక్తుల్
మురులుకొనుచు వెంట న్నాటికి న్నాటికి న్నా
సురకరపరిముక్తాత్యుద్రనిర్నిద్రపుష్పో
త్కరము మునురువట్టెన్ గంధపాణింధమంబై. ౨౧౧
క. సింధునినదగాంభీర్య ధు,రంధరములు త్రిదివసౌధరంధ్రగతంబుల్
బంధురములు సురదుందుభి, ధింధిమములుచెలఁగె సకలదిక్కులయందున్
వ. ఆసమయంబున వాసవాలయవధూనాట్యవైదగ్ధ్యంబులు విదగ్ధనయనరంజ
కంబులై చెలంగె భృంగీశ్వరుం డాపతంగధ్వజపుంగవధ్వజుల నిజమనోవృ
త్తంబు తనచిత్తంబున నెఱింగి నాట్యరంగంబున నిలిచి మృదంగతాళవీణా
వేణునినాదంబులు క్రందుకొనఁ బతాకత్రిపతాకాదు లైనయసంయుతచతు
ర్వింశతిహస్తంబుల నంజలికపోతస్వస్తికప్రధానంబులై సంయుతంబులైనత్ర
యోదశకరంబులును జతురశ్రరేచితార్ధరేచి తాభిధానంబు లైతనరు త్రిం
శద్గాత్రో... పాణితలంబులఁ బ్రయుక్తంబులైన ముద్రావిశేషంబుల భావార్థా
భినయంబు చూప సంగప్రత్యంగోపాంగరూపంబు లగునవయవంబులచేతఁ
దంతన్యమానంబై మార్గకుండలిదేశ్యుద్ధతబహురూపవిలాసంబు లనంబ
రఁగు మద్విధంబులం బ్రవృత్తంబులై తత్కృతంబు లైనచౌకంబును మొగ
చాళియు నిస్సరణంబును నటనంబును భావంబునుజివ్వకునుదలారంబు నుమం
డలంబును నాయుధచారులును దిశయు శవదియుఁ దట్టుమానంబును దల

చంచును, జచ్ఛలికెయుఁ జిత్రతాళంబును నల్లకత్రంబును నురుపును దువా
ళంబును బుష్పాంజలి మొదలయిన నటనపటిమంబులు తాళలయంబు లను
సరించి రూపక వార్తిక చిత్రక మానంబులం బ్రవర్తించు చంచుపుట చాచ
పుటాది తాళభంగుపెటెంగియంగహారకరణస్థానకవృత్తిమండలసంయుక్తం
బుగఁ దాండవం బఖండపాండిత్యంబునఁ బ్రకటించుటయు నన్నిటలన
యనహాటకపటులు హాటకం బగునమ్మహాపారిషదునిం బారితోషికప్రదా
నంబున సన్మానించి రంత విరించి యప్పరమపురుషులం గూర్చి యి ట్లనియె.

సీ. ఇది హేమమయపీఠ మే మున్న గల్పించి పాటించి దాఁచితిఁ బాటవమున
నని బహుయోజనాయతము మాణిక్యసింహాంచితంబును ననర్ఘ్యలిబు నైన
గద్దియ యొకటి వేగంబ యాకర్షింప నది భానుబింబసహస్రతుల్య
మగుచు నిల్చుటయు నాహార్యతత్పీఠిపై నజుఁడు నిల్పఁగ హరిహరులు నిలిచి
నీలమును వజ్ర ఫలకమ్ము బుఁబోలియుత్ప, లంబుఁ గుముదంబున పఁదగిలచ్చితోడి
యురమునగ రాజపుత్రికకు నికిమ్మైన, యెడమవంక యుఁగలిగి శ్రీనిరవుళొసిరి.

గీ. అట్టివేళ నలువ యానందజలరాశి, నోలలాడుచున్నయుల్ల మలర
లోకనాథు లట్టు లేకాసనస్థులై, తేజరిల్లఁ గని నుతించె మఱియు. ౨౧౫

మ. ఘనసంసారసముద్రవారినిజదుష్కర్మాగతానేకరో
గనిపీతాంగవిలాసులై ధనసుహృత్కాంతావియోగార్తి సం
జనితం బైనమనోవ్యథం గుదియు తుచ్ఛస్వాంతు లెల్లన్ జనా
ర్దన నీపాదపయోజపత్రజలధారల్ గ్రోల రేకాలమున్. ౨౧౬

క. ఉపవాసక్రతుదానము, లపరిమితము లాచరించు నైనం గానీ
త్రిపురాంతకసఖ నీయెడ, నపరాధము దలఁచెనేని యతియును యతియే.

క. నీనామస్మరణంబును, నీనామజపంబుఁ జేయు నిశ్చలహృదయుల్
శ్రీనాయక యపవర్గత, మానాయకుల్గలగుదు రమరమానితు లగుచున్.

క. బుజ*వైచితి వసురేంద్రుని, భుజమధ్యము చించి భువనమునఁ గలబాధల్
గజరాజవరద నీయ, క్కజపునదటు నుదుటు మున్న గని మదిమెత్తున్.

క. దానవునెపమునఁ బొడమిన, నీనిర్భర తేజ మిట్లు నిఖిలము నొంచెం
గాని జగన్నాయక నీ, మానస మీజగముమీఁద మచ్చరపడునే. ౨౨౦

వ. అని హంసవాహుఁడం డాహరిం బ్రశంసించి హరున కభిముఖుండై యి ట్ల
నియె. ౨౨౧

---

*భుజ. మూ.

చ. పురమథనం బొనర్చితివి పొంగువిషానల మారగించి ని
ర్జరులకు మేలుఁ జేసితివి చంగునఁ బైఁబడు బెబ్బులిన్ భయం
కరకరశూలఘాతములఁ గాలుని ప్రోలికి నంచి మించి తీ
శ్వర భవదద్భుతోద్ధతి ప్రశంసయొనర్పఁగ నాకు శక్యమే. ౨౨౩

క. భవదాకారము లింగ, వ్యవహృతిపై నావహించి యాగమసరణిం
దవిలి భజియించు శైవులు, ంవయుదు రతిధన్యముక్తికన్యామణులన్.

సీ. చక్కాడితివొ లేదొ సంవర్తమున జగజ్జాలంబు శూలంబు కేలఁ గ్రాల
ముక్కుచెక్కితొ లేదొ మొక్కలంబుననబ్జుద్రొక్కిమృత్యువునెత్తితోడుపుఁగత్తి
వ్రక్కలించితొ లేదొ వారణాసురగాత్రగోత్రంబు నఖరాగ్రదాత్రలతలఁ
జెక్కువ్రేసితొ లేదొ జక్కవచెలికానిఁ బట్టి గీపెట్టి లోఁదట్టువాఱ
మఱియు నీవొనర్చ*మానుషక్రమములు, లెక్కసేయువారు లేరు నిజము
గజముఖప్రసూతిగలవేల్పు నాయల్పు, జల్పసరణి నీప్రశంస కురునె. ౨౨౪

—:అవతారద్వయోపసంహారము:—

వ. అని పంకజాసనుం డాసారాకారసుధాధారంబగువాక్యప్రకారంబున సారె
సారెం బొగడిన నగుమొగంబు లొలయ నాజగద్రక్షకు లిద్దఱు నావేల్పుఁ
బెద్ద పెట్టినగద్దియపై నతనికోరిక లీరికలెత్త నీరంబు నీరంబును దుగ్ధంబు
దుగ్ధంబును బారదంబు పారదంబునుం గలసినకరణి నేకీభవించి హరిహర
రూపం బాపద్మసంభవునకు వరప్రదానలాభంబై శోభిల్లె నాక్షణంబ.

గీ. బీజ మొకట రెండుభూజంబు లుదయించు, నోజ నట్టిదివ్యతేజమునను
హరియుహరుఁడునంగ తొంగులై యుదయింప,వదనవలయమమరెవనజజునకు

సీ. మందారదామంబు నిందుఖండంబును మౌళిభాగంబునఁ గీలితముగ
మణికుండలమ్మును ఫణికుండలమ్మును గండమండలముల మెండుకొనఁగఁ
జక్రాంకశూలాంకశయముల మాణిక్యకంకణభుజగకంకణము లమరఁ
గనకకౌశేయంబు గజరాజచర్మంబు మునుకొని కటిభాగముల ఘటిల్ల
రమయు నుమయును నుభయపార్శ్వముల నలరఁ
బులుఁగుఱేఁడును నందియుఁ గొలిచి మెలఁగ
వైష్ణవశ్రేష్ఠులును శైవవరులుఁ బొగడ
హరిహరస్ఫూర్తి యేక దేహమున నిలిచె. ౨౨౫

వ. ఇట్లు నారాయణస్థాణువు లొక్కతనువునం గ్రిక్కిఱిసిన నెలవు హరిహరా
భిధానం బగు మహాతీర్థప్రధానం బయ్యె నందు. ౨౨౬

---

* నీవొనర్చు- మూ.

సీ. తానంబు లొనరించు ధన్యుఁ డాకాశగంగానదీకల్లోలఘటల నీఁదు
దానంబు గావించుధర్మతత్పరుఁ డర్థపతినిధానములకుఁ బ్రభుతఁగాంచు
రోగంబుగలవారిఁ బ్రోచుపుణ్యాధికుం డేబాధయును లేక యెసఁగు దివిని
నుపవాసజపతపోహోమంబు లొనరించుకృతిఁ గీర్తనము సేయుఁగిన్నరాళిఁగుఁ
హరిహరారాధనము నన్వహమునుజలుపు, నిష్ఠనిను బాడు*వారలనిలయముల
జాల వశవర్తియైయుండు సకలలోక, గర్భపరిపూర్ణకీర్తిసందర్భుఁ డగుచు.

వ. అని రోమహర్షణుం డమ్మహర్షులకు నరసింహశరభసమరవ్యాజంబున హరి
హర తేజోవిశేషం బశేషంబును వర్ణించి వెండియు నిట్లనియె. ౨౩౦

క. శరభనృసింహులచరితము, నిరుపమసద్భక్తి వినిన నిర్మలమతులై
నరులు సుఖింతురు సుస్థిర, పరమైశ్వర్యానుభావభావితు లగుచున్. ౨౩౧

క. హావళిచినయాభిళవసు, ధావల్లభమంత్రివర్య ధైర్యాహార్యా
ధీవిభవతోషితార్యా, పావననేత్రాబ్జయుగకృపారసధుర్యా. ౨౩౨

ఉ. దానవిలాసకంధర ప్రధానయుగంధర హారకంధరా
మానవతీమనోభవ సమగ్రరమాభవ జిష్ణువైభవా
మానవిధానురోధన సమంచితబోధన సద్యశోధనా
మానసవైరిభీషణ తమఃపరిశోషణ బంధుపోషణా. ౨౩౩

తోటకవృత్తము. దినకృద్ద్యుతివత్పరిదీప్తివిభా, వనరాశినివాసనివాసమనా
వినయోజ్జ్వలభూషణవీర్యనిధీ, ధనరాశివితీర్ణకథాచతురా.

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాద సహజసారస్వతచంద్రనా
మాంకభారద్వాజనగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమార రాష్ట్రఘంటా
వధానపరమేశ్వర హరిభట్టారక ప్రణీతంబైననరసింహపురాణోక్తం
బగునుత్తరభాగంబునందుఁ బ్రహ్లాదప్రతిష్ఠాపనంబును రాక్షసులతపోమ
హత్త్వంబును వారలకు హరుండు ప్రత్యక్షం బగుటయు నారదాగమ
నంబును నందికేశ్వరనారదసంవాదంబును శరభావిర్భావంబును శర
భనృసింహులయుద్ధంబును బితామహసమాగమనంబును బ్రహ్మస్త
వంబును నవతారద్వయోపసంహారంబును హరిహరక్షేత్రమహత్త్వం
బు ననంబరఁగు ప్రథమాశ్వాసము.

---

* నునువాడు. మూ.

# నారసింహపురాణము

## ఉత్తరభాగము

### ద్వితీయాశ్వాసము.

క. శ్రీరమణీహృద్రంజన, నారాయణచరణయుగళనీరజసేవా
పారాయణ పరితోషిత, నారీనివహాంతరంగ నరసయరంగా. ౧

వ. ఆకర్ణింపు మట్లు శౌనకాదిమునివరులు రోమహర్షునివలన శరభావతారశర
వృత్తాంతం బెఱింగి సంతసించి మఱియు నిట్లనిరి. ౨

క. నరసింహదత్తరాజ్య, స్థిరుఁడై ప్రహ్లాదుఁ డేమి చేసెనో తుదఁ త
చ్చరితంబు వినఁగవలయును, బరిపూర్ణవచోవిశేషపరమార్థజ్ఞా. ౩

వ. అని పలికిన మునివరులకు రోమహర్షణుండు సంతుష్టహృదయుండై యి
ట్లనియె నట్లు ప్రహ్లాదుండు నరసింహరూపంబు ధరించిన లక్ష్మీవల్లభుని వర
ప్రసాదలబ్ధం బగురాజ్యంబు నిష్కంటకంబుగఁ బాలనంబు సేయుచు. ౪

సీ. కండక్రొవ్వున రేసి కలహింపఁబూనిన సకలశాత్రవకోటిఁ జక్కఁజేసి
న్యాయంబువిడిచియన్యాయమార్గంబునఁ జనఁబూనుక్రూరులఁజదియ మోది
పరకామినీధనాపహరణోద్యుక్తులౌ చక్రాంకసమయదూషకులఁ దునిమి
శ్వాపదధ్వంసియై సారంగశశశల్యరురుముఖ్యములకు నారోగ్య మొసఁగి
జవ్వనపువింతసంభృతోత్సాహుఁ డయ్యుఁ, గామరోషాదిరిపులచేఁ గట్టువడక
నవ్యధర్మప్రతిష్ఠాపనంబుచేత, నొనఁగెఁ బ్రహ్లాదుఁ డానందరసము రసకు. ౫

క. తమనోరికల్లు గొన్నివె, రమునం గారించు దైత్యరాజు మఱచి యా
గములఁ బురోడాశము లా,యమరేంద్రాదులు భుజంతు రతనిముఖమునఁ. ౬

సీ. కలుషసంఘాతంబు గడికండములుచేసి దోషంబులకుఁ జేటుఁద్రోవఁజూపి
యేనస్సమూహంబు లీనంబుగావించి వృజిననిర్బంధంబు వీడఁదన్ని
యంహోనికాయోగ్రరంహంబు [illegible] చేసి
దుష్కృతశతముల ధూళిలో ప్రస్గించి [illegible] పటాపంచ* చేసి
ధరణిధేనువునాల్గుపాదములనిలిచి, తుష్టిఁబురుషార్థములఁబడయ [illegible]
నేలె రాజ్యంబు దానవాధీశసూతి, నాలుగంచుల నపమా[illegible]సందు. ౭

---

*పటాపంచు. తుఱా.

సీ. పౌలోమిపాలిండ్లపంచఁ జెక్కిలి చేర్చిసుఖయించె బలపాకసుఖవిరోధి
జముఁడు నారకలోకసౌఖ్యోపదేష్టయై వర్తించె నతిభద్రవర్తనముల
వరుణుండు గావించె సురతరుప్రసవనిర్గళదచ్ఛమధుపానకౌతుకంబు
వెలిఁ బాఱవైచిన వివిధనిధానంబు లర్థాధిపతి తెచ్చె నాలయమున
కాచరించిరి నిర్విఘ్న మగుతపంబు,మునులు కాలంబుదప్పకచినికెమొగులు
నారసాతలధరణీసురాలయములు,పూర్వగతినిల్చెఁజాంచల్యమును*దొలంగి

సీ. అశ్రులుహోమధూమావృతాక్షులయందె మద మత్యుదగ్రద్విరదములందె
వర్ణసాంకర్యంబువ్రాయుచిత్తరువందె దృఢబంధకలన సత్కృతులయందె
చిరవక్రగతి వధూచికురవల్లరులందె కంపంబు కేతనాగ్రములయందె
తొట్రుకొంట గవాక్షధూపధూమములందె జాడ్యంబు కేళిహంసగతియందె
యధికమగు లేమి లేములయందెయతను, వృత్తివర్తనములయందెవెలయుఁగాని
లేదు ప్రహ్లాదుఁ డేలెడు మేదినీశ, లాంతరాళంబునందు నొక్కింతయైన. ౯

సీ. ఇభగండదానవాహినులు ఘోట్టాణాశ్వఖురపుటరజముచేఁ గ్రుక్కఁబాఱె
నామతీర్థపువేళ నారదముని తనపదములు మధువైరియెదుట నొడువ
శరలూనశత్రుశీర్షములు గన్గొని రాహువక్త్రంబు లని వివస్వంతుఁడులుకఁ
గీర్తిచంద్రుఁడు పరిస్ఫూర్తిమస్ఫూర్తియై భువనజీవంజీవములఁ బొదల్ప
వాసవపురి వితానవిన్యాసముగను, నేల పాదాంగుళీరవినీలముగను
నల్లబలియిక్కబొక్కసమిల్లుగాఁగ, వెలసెఁబ్రహ్లాదుఁడాహ్లాదకలితుఁడగుచు.

ఉ. ఖేచరవైరినందనునికీర్తి దిశావళిఁ బిక్కటిల్లఁగాఁ
జూచి చకోరరాజి నలుచుట్టులుఁ ద్రిమ్మరుఁ జంద్రికామతిన్
వాచవి నంచపిండు గఱవం దమకించు మృణాలవల్లరీ
వీచిక లంచు నిట్టిశుభవిభ్రమశోభితుఁ డెందుఁగల్గునే. ౧౧

క. [illegible]లహాతి నసుహృదభా[illegible]లు, పనసి మసురపతి వగుల్ప వెడలినముక్తా
ఘసృణరజోమండలిసొం, పెసఁగుం దత్కీర్తిమూర్తి హేలావహమై. ౧౨

క. మరుదశసభువన మేలెస్, హరిహయపుర మేలె ధరణిచయుంతయు నేలెం
దరతమభావజ్ఞుండై, హిరణ్యకశిపూద్భవుం డహీనప్రౌఢిన్. ౧౩

సీ. ఏవేళఁ జూచినా యింద్రాదిదేవతాలబ్ధోపదానలీలావిభూతి
యేప్రొద్దు చూచినా హితపురోహితముఖోదితతత్త్వవాక్యసంగతమనీష

---

* జాంచల్యమున.

యేతఱిఁజూచినా వాతంధయాధీశదత్తరత్నావళిదర్శనంబు
లేసమయము చూచినా సదాశివమిత్రగోచరగ్రంథార్థసూచనంబు
గాఁగ రాజ్యంబుఁబ్రోచె సాగరముఁ జేరు, నేఱులునుబోలె లోకసమిద్ధలక్ష్ము
లా ప్రభవనాంతరంబుననతిశయింపఁ,బ్రోదిఁబ్రహ్లాదుఁడాశ్రితాహ్లాదకరుఁడు.

సీ. ధర్మప్రజాప్తికై ధరణీతలేశ్వరార్పితకన్యకాశ్రేణిఁ బెండ్లియాడి
యవనీసురప్రీతికై న్యాయమార్గంబు జరుపుచు విత్తంబు సంగ్రహించి
యధికప్రాప్తికై యెదిర్చిన వైరి మండలాధీశుల మదమణంచి
దివిజసంతృప్తికై ధృతితోడ నశ్వమేధాధ్వరాదిక్రియ లాచరించి
యఖిలవిద్యావిశేషంబులభ్యసించి, డెంద మంతయు హరిభక్తియంద నిలిపి
గంధవద్వైరివంశనిర్గంధనముగ, ధాత్రిఁ బాలించె బలశత్రుశత్రునూతి.౧౫

సీ. హృదయంబు లక్ష్మీశపదపద్మములయంద వినుకులు హరికథల్ వినుటయంద
నయనంబులిందిరాప్రియదర్శనమునంద శిరము కేశవనమస్కృతులయంద
పదము లంబుజనాభభవనయాత్రలయంద శయములు విష్ణుపూజనమునంద
ఘ్రాణంబు శార్ఙ్గినిర్మాల్యగంధమునంద రసన కైటభరిపు ప్రణుతియంద
పాదుకొనఁగామినీపుత్త్రబాంధవాది,కలితసుఖములుమిథ్యగాఁదలఁచికొనుచు
వసుమతీచక్ర మేకోష్ణవారణముగ, లీలఁ బాలించె దైతేయపాలనుతుఁడు.

చ. హరిహయువిందు పావకున కర్మిలి భానుజు మేనినీడ ని
ర్జరరిపుమిత్రి యబ్ధిపతిప్రాణము వాయువు కాయ మాధనే
శ్వరుపరమాప్తుఁ డీశ్వరువంశబుగఁ జేయు కుశాగ్రబుద్ధియా
సురరిపుసూనుఁ డంచుఁ దలఁచున్ భువనత్రయ మమ్మహామహున్. ౧౭

క. చీఁకటియుఁ జంద్రికారస, మేకస్థానంబునంద యిరవొందుగతి
న్నాకౌకోరిపుకులము, న్నాకాలయకులము నొక్కనంటునమెలఁగున్. ౧౮

వ. అట్లుసాదరగుణమేదురుండై ప్రహ్లాదుండు గురుపూజనం బరిచర్యయు సుమన
స్కులకు మనస్తర్పణంబును గులంబునకు బలంబును సిరులకుం బరిపుష్టియు
వసుమతికిం బసిమియుఁ బాతాళంబునకుఁ బ్రీతియుం ద్రిదివంబునకు ముదం
బును దిక్పతులకుమక్కువయును నగ్నులకు హర్షనిమగ్నత్వంబును వైదాంతి
కులకుఁ బ్రమోదంబునుదార్కికులకుఁ దర్కంబునుబరమవైష్ణవులకునిరుప
మానందనిష్ఠాతుఁడగుటయు శ్రుతులకు నభిరతియుఁ బురాణంబులకునపరి
క్షీణభావంబును శాస్త్రంబులకుఁ బ్రశస్తియుఁ గావించుచు భూవలయ పాలన
ఖేలనలంపటుం డై సొంపుమీఱి నిజకీర్తిగంగాతరంగధారాప్రవాహంబున

రజనీచరచరిత్రదుర్దమకర్దమసంతతిక్షాళనంబాచరించుచుసింధునదీసవిధంబున వివిధమణిప్రభాశుభావహం బైప్రభావతి యనంబరఁగిన విశ్వకర్మనిర్మితం బగుపురంబుఁ గరంబు తిరం బగునెయ్యంబు తియ్యంబున నరయుచు నుండె నందలి సౌభాగ్యం బెట్టిదనిన. ౧౯

—: పురవర్ణనము :—

సీ. వేదండతతు లెల్లఁ జౌదంతికోదములు హరు లెల్ల నుచ్చైశ్రవాన్వయజము
లరదంబు లెల్ల దివ్యవిమాననిభములు భటు లెల్ల సింహడింభకసమాను
లంగన లెల్లఁ బుష్పాస్త్రునస్త్రంబులు విప్రు లెల్లరు వేదవిత్తనిధులు
క్షత్రియు లెల్లరు శరభశౌర్యాఢ్యులు కోమటు లెల్లరుఁ గోటిపతులు
శూద్రు లెల్లరు నిరవధిభద్రవశులుఁ దోఁట లన్నియు వేలుపుఁదోటలట్ల
దీర్ఘికలు దేవతాపురిదీర్ఘికాభి, రామములు దానవేంద్రుపురంబునందు. ౨౦

గీ. పద్మరాగాశ్మఘటితత మా పటుపునేల, నంటుమెఱసిన ప్రహ్లాదునగరు మెఱయు
నీలనిర్మిత మగుచు నుత్తాలగరుడ, వాహనారూఢుఁ డగునీలవర్ణుఁ బోలి. ౨౧

గీ. మేటితలుపుల మీాలనోన్మీలనములఁ, బ్రజలులోఁ డిండవెలిఁబర్వఁబరఁగుఁబురము
నిదురవోవుట లయమును నిదురలేమి, సృష్టియునుగాఁగవిలసిల్లుస్రష్టఁబోలి.

చ. తరళసుధాకరప్రభలు దార్కొనుమాత్రఁ గరంగి చంద్రకాం
తరచితసౌధముల్ గురియు తజ్జలధారలఁ బొంగుచూ పుని
ర్జరనది యప్సరోగణకుచద్వయనిర్దయమర్దనక్రియా
స్ఫురితతరంగభంగదశ వోవఁగఁ బున్నమరేలఁ గ్రాలుచున్. ౨౩

క. పురగోపురవరముకురో, దరములఁ దమనీడఁ జూచి దైవతముగ్ధో
త్కర మితరకాంత లంచు, న్మరిపెంబున సారెసారెముచ్చటలాడున్. ౨౪

గీ. గంధబంధురసింధురస్కంధవీథి, మీాఁదఁ దత్కరనిక్షిప్తమేదురోరు
పాంసువలయంబుచెన్నొందుఁబర్వతాగ్ర, తలసుఖాసీనమేఘసందర్భమనఁగ

క. హారులు సుదర్శనకరములు, పరిపంథిమదాపహములు బహువిధలక్ష్మీ
స్ఫురణాపరిణాహంబులు, పురితేజులు శార్ఙ్గపాణిఁబోలం జాలన్. ౨౫

గీ. విశ్వకర్మవినిర్మాణవేళఁ గూర్పు, నసురయానంబులకుఁబడియచ్చు లనఁగఁ
జారుచామీాకరాలేపసంప్రదాయ, కవచితము లైనరథములు గలవు పురిని.

క. భటులు రణరంగలీలా, నటు లుద్భటసింహనాదనారదఘోషో
త్కటులు మృగీమదచర్చో, త్కటు లప్పాటభేదనమునఁదనరుదురెపుడున్.

* [illegible]

గీ. యజ్ఞశత మొనర్చు నవనీసురేంద్రులు, జయశతంబు గలుగుక్షత్రియులును
నిధిశతంబు గూర్చి నెరయువైశ్యులు గాని, తక్కువారు లేరు తత్పురమున.

సీ, తమ్ములుఁ దారలుఁ దరుణకూర్మంబులు వరిపొట్టరలఁటులుఁగరిశి(రము)లుఁ
బిప్పలదళములు విప్పారుసుళ్ళును నాగడపలు గగనాంతరములుఁ
జలిచీమచాలును జక్కవపులుఁగులు ఫణిఫణంబులు బిసపాశములును
దగుపోఁకబోదులు దర్పణంబులుఁ బల్లవములు సంపెగమొగ్గవంగడములు
*బేడిసలు సింగిణులు విజృంభించుహిమకర, రార్ధములు శ్రీలు హరినీలవర్ధనములు
గూర్చి తాఁ జతురాస్యుఁడై కుసుమశరుఁడు, చేసెనో యనఁ బురవధూశ్రేణి మెలఁగు

సీ. హరికౌస్తుభంబైన నంగళ్ళఁ గొనవచ్చు ననిన రత్నచయంబు లడుగనేల
లేకి యేనియుఁ బద్మినీకులోద్భవయన్నఁ బడఁతులగరిమంబుఁ దడవనేల
కడపటి చెఱువైన గగనసింధుసమాన మనినఁ గేలిసరస్సు లరయనేల
కలివెకట్టియ యైన బలభేదితరువన్న నుపవనంబుల పెంపు లారయనేల
రుగ్మ లేనియుఁ గందర్పరూపులన్నఁ, బూరుషవిశేషముల సొంపుఁ బొగడనేల
బాహుబలమున దైతేయపాలుఁ డేలు, నిరుపమంబు ప్రభావతీపురమునందు.

సీ. ఆరకూటపిశంగ మగుజటాజూటిపై నెలపువ్వు తేఁటవెన్నెలలు గాయఁ
ధళుకుధళుక్కంచుఁ గలికినెమ్మొగమున ముచ్చ్వాచు మెఱుఁగులు పిచ్చలింప
దంతపుఁగమ్మల ధావళ్యమంజరి గండదర్పణములఁ గలయఁ బ్రాఁకఁ
బటికియూర్చిన హేమఘటయుగ్మమునుబోని పాలిండ్లమణిహారపంక్తులలియఁ
జక్రశూలాంబురుహగదాచాపబాణ, చర్మఖడ్గము లాత్మహస్తముల మెఱయ
వీఁకఁ దత్పురరక్ష గావించుచుండు, గమలపత్త్రాక్షునాజ్ఞచేఁ గాళరాత్రి.

వ. మఱియు నప్పురంబు కిరీటియుంబోలె సుభద్రాలంకృతబహువిధసౌధంబై
మాధవుండునుం బోలె విచిత్రపత్రనివహంబై దాశరథిసేనాసముదయంబు
నుం బోలె నమందమారుతకుమారవిహరణపరిచితంబై సమరయాత్రాస
ముత్సాహంబునుం బోలె నుద్యోతితోద్యానహృద్యంబై సుకవికవిత్వంబు
నుంబోలె బహువిధచిత్రవర్ణవర్ణితంబై గోకర్ణపతినివాసంబునుంబోలె ననం
తభోగికులభాగధేయంబై వెలయునందు. 33

—:ఋతువర్ణనము.:—

ఉ. సంతస మొందె నంతట వసంతము పుష్పమరందసింధువే
శంతయు భోగిలోకచయశాంతము సంతతపుష్పమల్లికా

* చేపలు.

కాంతము మాన్మథస్ఫురణకాంతము దిక్కటకావగాహిరు
గ్భ్రాంతము షట్పదస్ఫురదుపాంతము చెన్నగు నున్నతోన్నతిన్. ౩౪

సీ. కోయిల లిగురాకుఁ గొనలానిముదమూని కావించెబహుళకుహూకారఫణితి
బుష్పంధయములు సంఫుల్లమల్లీలతా ప్రసవగుచ్ఛంబుల బ్రమరివాతె
రాయుంచచంచద్విరాజితోద్యానమధ్యస్థలి దీర్ఘికఁ దనువు గడిపెఁ
జిలుకలు పండ్లు భుజించె నేఁడాదియు నవసిన కఱవుదైన్యము దొలంగ
మురిసె సహకారమాధవీతరళకుసుమ,పరిమళోదారసౌభాగ్యభాగ్యనిధులు
మలయగిరిజాయమానము ల్మారుతములు, విరహిణీస్మరపావకవీజనములు.

క. పొదలెఁ బ్రసూనపరాగము, లుదయార్కసమానరుచుల నుద్యానముల
న్మదనహరమూర్తితతులం, బొదివిన మన్మథవిభూతిపుంజము వోలెన్, ౩౫

గీ. మానినీమానవిత్తసమాజమెల్ల, మగుఁడు గిలుబాడిగ్రొచ్చు నిర్భరకఠోర
నఖరరాజియుఁబోలెఁ గానలఁ జెలంగెఁ, గింశుకంబులువిస్ఫురదంశుకములు ౩౬

గీ. మారనీరాజనాసంప్రసారచంద్ర,ఖండములు కారులచ్చియఖండమహిమఁ
బొలుపుగావించుపొక్కిళ్లువెలసెనుల్ల,సించుసురపొన్నలుద్యానసీమయందు ౩౭

గీ. అంతహేమంత మరుదెంచె నమరవైరి, మేనుయావతకుచయుగీమేళనమున
సంఘటింపంగఁ జాలినశైత్యగరిమ,కతనముల్లోకములును గొంకరలువోవ ౩౮

గీ. సకలకుసుమరహితజని యయ్యు హేమంత,వేళయొప్పె విటుల విటజనంబు
నొక్కమేను గాఁగ నొద్దికసేయుచు, మదనుదోఃప్రతాపమహిమ దనర. ౪౦

క. కుసుమపరాగము దిఙ్ముఖ,విసరంబులఁగలయఁ బర్వ*వేధించిహిమో
ల్లసనంబు మొదలు ద్రెంచిన,విసువుచు దేశాంతరంబు నెడలెడుకరణిన్. ౪౧

గీ.కలయనిండినమంచుమీఁగడలువోయి,వెలసెబ్రహ్మాండభాండంబుచలియచ్చికి
కప్పురము గ్రుమ్మరించినకరవటంబు, పరిమళముమాత్రచిక్కినపరిఢవమున. ౪౨

ఉ. మోమును మోము మోవియును మోవియుఁ జెక్కును జెక్కునల్లిబి
ల్లై మర యింతలేని విమలాంగములుం గరపాదమేళన
స్థేమము కల్గి రాగములఁ జేసిన విభ్రమమూర్తులో యనం
గాముకులుం గళావతులు గ్రమ్మి రమింతురు సీతుగందువన్. ౪౩

సీ. యువయుగ్మసంగమవ్యవహారవిఘ్నంబు చండాంశుకరవహ్నిసామిధేవి
సర్వసర్వంసహాచక్రసారగ్రాహి దీర్ఘయామస్ఫూర్తి నిర్ఘృణంబు.

---

* వేధించుటు తొల్ల.

మల్లికావల్లికామంజరీనిబిడాట్టహాసకారియుఁ బాటలానఖంబు
ద్రాక్షాగుళుచ్ఛోరుమాక్షికమధువనం బత్తీణఘర్మగర్వాతిశయము
వచ్చెగ్రీష్మంబుమంచులువిచ్చెమధువి, కాసమొక్కింతముణిఁగెఁగైలాసశిఖరి
విడిచిహిమగిరికై యేగెవిషమబాణ, సంహరుఁడుగ్రీష్మమత్యుగ్రరంహమగుడు

ఉ. నర్తితతాళవృంతపవనంబులఁ గొంత వధూకుచాంతర
స్ఫూర్తిమదింపుసమ్మిళితశోభనచందనచర్చఁ గొంత గా
ఢార్తిహరంబు లైనశిశిరానిలపోతవిభూతిఁ గొంత సం
వర్తశిఖావదుగ్రకరవాసరతాపము నాఁపఁగాఁ దగుఁ.    ౧౫

వ. అంత నవ్వేసంగి యంతరించిన తదనంతరంబ భూనభోంతరాళంబులుబోసు
కలంగంజేయుదంభోళిగంభీరధ్వానంబులువిజృంభించెఁబంచవన్నెయుచిలుక
పలుకం గరకమలంబునం బ్రథమదిక్కాంత సంతసంబునఁ బాటించెనో
యన నిరాఘాటప్రభాపాటవహిండితంబగునాఖండలధనుఃఖండంబు మెఁడు
కొన నొండొండ నిండారం బూనినముత్యాలపేసలు గగనలక్ష్మీకంఠభాగం
బుననుండి వ్రేలెడినో యనఁ గరకావారంబు తోరంబుగ మయూరకేకాబంది
వాక్యసందర్భనిర్భరానందంబై యొసంగిననవనవిసరంబునుంబోలెఁబయోధ
రచ్ఛేదంబులసాదప్రసాదంబులై చూపట్టెం బ్రమోదంబులొసఁగవిసవిస
విసపు చలికరువలియు ముసరుకొన నసమహహీరజోరాజియొండొండనీడా
డం దలచూపు ప్రథమోదబిందు సందోహంబును వాతెఱలు దెఱచుచాత
కంబు లద్భుతప్రీతినికేతంబులై కొనియాడు క్రీడాసల్లాపంబులునుం గ్రేళ్లు
మెలంగు తటిల్లతలయుల్లాసంబును నతూర్జితంబు లగుగర్జితంబులవిస్ఫూర్జ
నంబును బంధురాంధకారపరిణాహంబును నుదారాసారప్రచారంబును
నుడ్డీనకుల్యామహోల్లాసంబును నుత్సాహావివర్జితసముద్రంబును నుద్యోగ
హృద్యహాలికంబును నుపచితాతపవాసరత్పత్తృణాంకురసంకులంబునై వర్షాగ
మంబుమహోత్సవంబుననావిర్భవించెశరత్సమయవత్సనిపీతపయోధరపయః
పూరం బయ్యె నయ్యెడ.    ౧౬

సీ. వారాకరంబు దేవేరి యాకావేరి కల్లోలఘటలలో నల్లసిల్లి
ద్రవిళదేశాంగనాస్తనకుంభములమీఁది పసుపుపూఁతలతావి పాలుపట్టి
మధుపానకేళీనిమగ్నపుష్పంధయబాంధవపరిపాటిఁ బాధఃపల్లి
కీచకరంధ్రప్రకీర్ణమై ఘుమ్మంచు నభిరామనాదంబు నావటించి

నట్టువయొఁబోలె లతలకు నయము మీఱ
నటన మేలఁగించుచును జూడ విటుఁడువోలెఁ
గొమ్మలకు సౌఖ్య మొసఁగుచుఁగొమరుమీఱె
ఋతునమాగతమలయమారుతవిభూతి. ౪౭

సీ. మినమినమనుగందు మీను టెక్కెముతోడివువ్వారుఁ దేరిపై బాలువు మీఱి
రతిదేవి ఛారంబు రారాపుఁజనుదోయిపుత్త డిబటువుల నొత్తగిల్లి
ముక్తామయం బైనమోహనచాపంబు తేఁటిలేనారినుద్దీఁగఁ గూర్చి
సంచితమంత్ర ప్రపంచమా నిజబాణసంచిక పాదిలోన సంఘటించి
మెత్తనిగురుఁదపారంబు మించుకలువ, రేకుదట్టియు మొల్లపూజోకజోడు
మొగలి మొగ్గకటారంబుజిగిదొలంక, వెడలెమదనుండువిరహులవేఁటలాడ.

గీ. ఋతువులాఱుఁదనకునతులవిభూతితోఁ, దోడుచూపుటయును దొలుతవేల్పు
పట్టి బహువిహారపరిణతబుద్ధియై, సంచరించు వివిధసౌఖ్యలహరి. ౪౯

క. ఈరీతి మదనరాగక, ళారంజితహృదయుఁ డగుచు లలనాజననా
నారతిసౌఖ్యపరాయణుఁ, డై రక్షోరాజపుత్త్రుఁ డలరఁగ నంతన్. ౫౦

—: రాక్షసమంత్రులరహస్యాలోచనము :—

గీ. ఆహిరణ్యకశిపునాప్తమంత్రులు గొంద, ఱతనిపుత్త్రుఁగొలుచునాస విడిచి
నిజమనంబులందు గుజగుజవోవుచు, వంది సంచరింతు రిందునందు. ౫౧

వ. వా రెవ్వరంటేని. ౫౨

సీ. సూచీముఖుండును శూర్పకర్ణుండును వృశ్చికరోముండు వికటబలుఁడు
శంబరుండును దీర్ఘజంఘుండు బలియును గపిలాక్షధూమ్రాక్షకంకటులును
గాలకేయుండును గాలదంష్ట్రుండును వక్రదంతుండును వామనుండు
ఖరుఁడు ద్విమూర్ధుండుఁ గల్పకేతుండును దూషణుండును జర్మపేషణుండు
నాదిగాఁగల పూర్వులా నమరవిమతు, మంత్రులెల్లరుఁగూడిసన్మంత్రగోష్ఠి
నతిరహఃకృత్యమునకు యోగ్యతమమైన, సింధునదమునకరిగి యాసీనులగుచు

క. ఆమంత్రివరులు సంతత, ధీమంతుం డగుసరస్వతీసింధుసుతుఁ
వామనుఁ డనురక్కసుని న, వామనమతిఁ, బల్కి రుచితవాక్యముఖరులై.

క. అనఘా సర్వంబును నీ,కని విన్నది గాదె వేత్త కఱపఁగనేలా
మనకార్యఁ మింక నెట్లగు, వినిపింపఁగఁ బాడి నీకు విమలవివేకా. ౫౪

చ. హరి పగవాఁడు దేవమును లంతకమున్న విరోధు లిట్టిచో
హరి తనకూర్చునాయకుఁ డటంచు నిశాటకుమారుఁ డెప్పుడున్

సురలును దానుఁ గూడి మనచొప్పునఁ బోవక శౌర్యహీనుఁడై
యరులకుఁ గ్రిందివాఁడగుచు నాహవదోహళిగాఁ డొకింతయున్. ౫౬

సీ. సమరాభిముఖులైనయమరవీరులఁ గిట్టియనిమొనఁ దుత్తుము రాడవలదె
దర్పితదండయాత్రాభేరిభాంకారఝుంకారముల మిన్ను చటవవలదె
యుత్పలదళములయొప్పునఁ బైకొను నరిశిలీముఖముల నాఁపవలదె
తుంగమాతంగశతాంగతురంగాంగశకలకోటుల నేలఁ జమరవలదె
కలవె యొకనిఁ గొలిచి గర్వవిహీనుఁడై, యూడిగములు సేయుచున్నపతికి
ధూర్తవిజయలబ్ధి కీర్తిప్రతాపంబు, లసురసుతున కిట్టు లడఁగఁ దగునె. ౫౭

క. మన మితనికిఁ బగవారము, మనపగఱులు ప్రీతిపరులు మనవాక్యంబుల్
విననొల్లఁడు ప్రహ్లాదుఁడు, మన కార్యం బెట్లు నిలుచు మాన్యచరిత్రా. ౫౮

గీ. ఆహిరణ్యకశిపునందు నీ"మామిడీ, కిందిసోమ" రెట్లు బొంది యెత్తెఁ
బులికి మేఁకమఱక పుట్టినయట్లయ్యె, శిరసులెత్తి తిరుగ సిగ్గుగాదె. ౫౯

క. అనిమిషులితనికి సఖులై, యనుచుండిర యేని దివిజమర్దనకులముం
దునుమఁటయ పూర్వవైరము, మనముల నిడి పాముతోడిమచ్చికదగునే ౬౦

క. అందఱముఁ గూడి యీకసు, గందుం దునుమాడి యొక్కకఠినభుజబలో
గ్రుం దెచ్చి రాజుఁ జేసినఁ, బొందు నమందాఘనిచయములు ఘోరములై.

గీ. రాజపుత్త్రుఁ దునుమరాదు వేల్పులచేతఁ, బడఁగరాదు దురితపదవి చొరని
కార్య మొద్దిగలదు ధైర్యంబుతోనది, నీవు నిర్ణయించి నిర్వహింపు. ౬౧

మ. ఘనసంగ్రామపరుల్ హిరణ్యకశిపుత్ప్రావల్లభుం గొల్చి త
ర్జనముల్మీఱ సురేంద్రముఖ్యవిబుధవ్రాతంబు భీతిల్లఁ ద
ద్వనితాజాతముఁ బట్టితెచ్చు మనమాదైత్యారులం జేరి సి
గ్గున వర్తించుటకన్న మే ల్గిరిగుహాకోణీతటిన్. దాఁగుటల్. ౬౩

ఉ. పక్షికులేంద్రవాహనుని బల్విడిఁ దోలఁగరాదొ దేవతా
ధ్యక్షునివైభవంబులు ప్రతాపమునన్ హరియింపరాదొ త
త్పక్షమువారి నెల్ల శితబాణపరంపరఁ గూల్పరాదొ యీ
యక్షము రాక్షసేంద్రసుతు నాడెడిదేమి వివేకహీనునిన్. ౬౪

చ. మనము దొలంగినప్పుడె క్రమంబున దేవతలెల్ల దైత్యరా
ట్తనయుఁడు పీడటంచు నతిదారుణవృత్తిఁ గడంగి దూషణం
బున కభివక్తులై నిమిషమున్ ధర యేలఁగనిత్తురేల యీ
ఘనునకుఁ జెల్లునా యసురకంటకుసఖ్యము సౌఖ్యహేతువె. ౬౫

క. మానంబు విడచి యన్యో, న్మానికులం గొలువలేము మన తెఱఁ గెటులో
మానము గలవారికి సభి, మానమురక్షించుటయె సమస్తశుభంబుల్. ౬౬

వ. అని నిజపక్షంబు రక్షోవీరు లుదారార్థగౌరవగభీరంబుగాఁ బలికిన పలుకులు
విని మనంబున మెచ్చి వినయవినమితసుధాశేమనుం డగువామనుండువా
రల కిట్లనియె. ౬౭

ఉ. ధీరులు శౌర్యసంయుతులు దీర్ఘవచోరచనాచమత్క్రియా
పారగులైన మీహృదయపద్మము లెంతయు సంతసిల్ల ర
క్షోరమణోత్సవావహ మకుత్సిత మార్యనుతంబు నైసుధా
హారులయత్నము ల్గలుఁచునట్టి యుపాయ మొకండుగాఁ జెప్పెదన్. ౬౮

మ. చల మొప్పం బలిపంథినిర్జరతతి న్సాధించి వేధోవధూ
కలనిక్వాణవిపంచిక న్నిజయశోగాథాసహస్రంబు సం
ధిలఁగా నంశధురీణుఁడై ప్రతిభచే దీపించు దైత్యేశ్వరుం
డలఁపంగాఁ డగుఁగాక తత్సుతుని చేతల్లంత లూహింపఁగన్. ౬౯

క. ఏలికవృత్తు వధించిన, జాలిశీలకు నిహము గలదె పరముం గలదే
శీలించిన నొకకార్యము, మేలెంచుఁడు నయము లెఱిఁగి మీమీయుక్తిన్.

చ. పతియతిమూఢుఁడైన బహుపాపసమన్వితుఁడైన రోగసం
తతి వినిమగ్నుఁ డేనియును దాంతియు శాంతియుఁ గల్గకుండినన్
సతులకుఁ బాయరానిక్రియ శౌర్యము ధైర్యము లేకయున్న భూ
పతిఁ దమకంబున న్విడువఁ బంతమె సేవకులైనవారికిన్. ౭౦

చ. క్రమమునఁ గాని వక్రమగుకార్యము చక్కన గాదు గాథవి
క్రమము వివేకహీనుఁ డగురాజునకున్ హితకారణంబు గా
దనుమను నేఁడు దైనగతి సద్భుతశౌర్యసమేతులై యతి
క్రమము నొందినారు మన పౌరుషముల్ ఘటియింప వియ్యెడన్. ౭౧

క. సురపతియును నసురపతియును, నిరతంబును క్షీరనీరనిబిడహృదయులై
సరిపొత్తు మనికిచోటన్, సురపముం గొలుప వాత్మనూరత్వంబుల్. ౭౩

గీ. రాజులేనిబలము రాజ్యశత్రుండు, లేనిరాత్రి మగఁడు లేనిమగువ
పౌరుషంబులేని పతియును వృథగాదె, మీర లెఱుఁగరే సమిద్ధమతులు.

క. సరిపాలుఁడు తనబలములఁ, బురికొలుపకయున్న వానిపో టమరునె భూ
వరవిరహితసేనయు నం, బరరహితసనము నేకపర్యాయంబుల్. ౭౫

వ. ఏ నెఱింగించిన తెఱంగ మీయంతరంగంబులం దరంగితంబైనయది గదా గదాధరచరణసేవనచతురుం డగుప్రహ్లాదకుమారునకు నాహ్లాదంబు పుట్టునట్లు గొన్నియుపాయంబులు పన్ని సర్వంబును శుభోదర్కంబు సేయుదము వినుండనిన వెండియు వార లి ట్లనిరి. ౭౬

చ. కనలక దేవతావిభునికార్యవశస్థితియందు నిల్చుచు
*స్తనలను జేరనీఁడు లవమాత్రము నిర్జరశత్రుసూతి యే
యనువునఁ బుట్టెనో నిజకులాంబుధిశోషణబాడబాగ్నియై
తనమదిలోనఁ బెద్దలప్రతాప మెఱుంగఁ డెఱుంగఁ డేమియున్. ౭౭

క. అతఁడే కైవడి నస్మ, న్మతమున కొనగూడి దివిజమర్దనలీలో
ద్ధతిచూపు శ్రుతిసుఖంబుగ, హితసూక్తులఁ దెలుపవే యహీనవివేకా.

వ. అనిన వారల కతం డి ట్లనియె. ౭౯

క. ఏకార్యంబున నసుర, త్రాకాంతుఁడు తెలిసి మనవశంబునఁ దిరమౌ
నాకార్యము వినిపించెద, నాకర్ణింపంగవలయు నందఱు మీరల్. ౮౦

క. ఏకాలంబున నెవ్వని, కేకార్యము జరపవలయు హితవెఱిఁగి నరుం
డాకాలంబున నతనికి, నా కార్యము నలుప ఫలము నందఁగవచ్చున్. ౮౧

క. ఆరూఢయౌవనుండై, నారీజనసరసకేళి నర్మసఖుండై
యారతికోవిదుఁడు సం, చారము లొనరించుఁ గృతకశైలములందున్.

సీ. మాధవవల్లరీమండపాంతరముల మధువేళ విహరించు మదమువదల
గ్రీష్మాట్టహాససంకీర్ణపుష్పంధయధ్వానంబు వినుఁ దపవాసరముల
శైలకందరనటన్నీలకంఠోత్తాలవైఖరి వాటించు వర్షలందు
నుద్దండపుండరీకోత్పలచ్ఛన్నదీర్ఘికల శారదవేళఁ గ్రీడ్యమలఁగు
హిమశిశిరసముచితమైన యిచ్చనిచ్చ, నంగనాలింగనాహ్లాద మాత్మఁగోరు
నిపుడుప్రహ్లాదుఁడతనికినిందుముఖులఁ,గన్యకలఁదెచ్చియిచ్చిరాగమునొనర్చి

వ. నేర్పుమెఱసి కందర్పవిహారలంపటుం డగునిలింపారిం జేరి పర్యాయగతిం జాటవంబు మెఱసి బాంధవం బతిదృఢసంధానబంధురంబుగ నమరించి యమరులయంటు వాసి మనసంటున మెలంగునట్లు చేసిన సకలశోభనంబులుం గరతలస్ఫటికంబుల - - - కరణీయం బగు నతండు. ౮౪

క: కులమున రూపున గుణమున, బలమున సంబంధమునకుఁ†బాత్రుండగుమీ
తలఁపునకు నెక్కునేనియుఁ,దలఁచిన పనులెల్ల సఫలతాయుతము లగున్.

---

* మనములఁ † బాపుండగు.

క. అదిగావున నీయత్నము, పదరక మన మిపు డొనర్పఁ బ్రాప్తము లగు సం
పదయును శత్రులగెలుచుట, విదితమనోవాంఛితములు విశ్వోన్నతియున్.

గీ. కామమోహితునకుఁ గాంతాజనంబును, ధనవిహీనునకును గనకచయము
వ్యాధిమగ్నునకును వలనైనయౌషధం,బొసఁగుటయునిజార్థయోజకములు

క. సంతుష్టులైనధరణీ, కాంతులు సేవకులకోర్కెఁ గావింపుదు రా
వంతయు నింత యెఱుంగని, యతఃకరణంబు నిత్య రతిసులభగతిన్. ౮౮

వ. అని తామరసనంభవ శేముషీసముద్దాముం డగువామనాసురుండు పలికిన
నీతిప్రస్ఫీతం బగుసూక్తిజాతంబునకుఁ బ్రీతహృదయులై దైతేయు లాతనిం
దోడ్కొని నిజనివాసంబులకు మరల నేతెంచి కౌతుకాయత్తచిత్తులై చిత్రజ
పూములుకులుం బోని తమకులపాలికాసంభవ లగుసౌభాగ్యధన్యలంగన్య
కలం బెక్కండ్రఁ దెచ్చియారక్కసుల తేనితనూజునకుంగానుక సేయుటయు
నానందకందళితహృదయారవిందుండై హిరణ్యకశిపుప్రథమనందనుం డా
పృథులనితంబలంబరిణయంబై తరుణతరతరలసమీరకుమారతాండవితశిఖం
డకలతాతరుషండ మండితోద్యాన హృద్యపద్యాపరిసరంబులయందు మసృ
ణమసారమాణిక్యశకలమయకృత్రిమశైలకందరామందిరాంతరంబులయందును
నరవిందమకరందనిష్యంద బిందుతుందిలపయఃప్రవాహమనోహరంబు లగు
కేలికుల్యాకూలంబులయందును నిందుకాంతసందానితసోపానపరంపరావ్యా
వృతప్రాసాదవేదికలయందును మదనవేదవిద్యావ్యాఖ్యాన వైఖరీమాఖరీమ
హోపదేష్టలై త్రివిష్టపవిమతులకు నభీష్టంబు లొసంగి ప్రసాదదృష్టిమధు
రంబుగ వారివారి యావాసంబులకుం బోవం బనిచె నంత నొక్కనాఁడు.

చ. హరునిమనంబు తుత్తుమురులైచన నేసినదంట మిక్కిలి
న్విరహులపాలిమంట నెఱవీరుఁడు మారుఁడు తియ్యవింట సు
స్థిర మగునిర్జరారిసుతుచిత్తము గెంటఁ బ్రసూనసాయకో
త్కరమున నంట నేసెఁ గడకంటికిఁ గోపపుఁబంట పాటిలన్. ౯౦

క. మరునిశరపుంఖములఁగల, కరువలిచేఁ దూలి యసురకంటకుహృదయాం
తర మతిభంగురగతిఁ ద,త్తరుణీకుచశైలసీమఁ దలఁదూర్చెనొనున్. ౯౧

సీ. హరిరూపదర్శనాయత్తంబులగుకన్ను లతివలకుచములం దంటి నిలిచె
విష్ణుకీర్తనములు విని చొక్కువీనులు తరుణులగీతామృతముల నానెఁ
బురుషోత్తమునివేడ్కఁబొగడుచుండెడుజిహ్వాసముదాంగనాధరాస్వాదమెఱిఁగె
జలజాతుపదభక్తిఁ బులకించునెమ్మేను ప్రమదలపరిరంభణములఁ బొదలె

నిట్లు ప్రహ్లాదవిభునిసర్వేంద్రియములు, మాధవారాధనక్రియోద్బోధముడిగి
నిత్యయౌవనపూర్ణ లౌ దైత్యదత్త, కన్యకలయందె యాసక్తిఁగడలుకొనియె.

చ. కెరలు మదోదయంపుగిలిగింతలు వో నిడి బ్రహ్మచర్యని
ష్ఠురహృదయాంతరాళు లగుసూరిజనంబుల కైనఁ గామినీ
తరళకటాక్షవీక్షణసుధాకరచంద్రిక యింత సోఁకినం
గరఁగక యున్నె దైత్యకళికావిధుకాంతశిలాకలాపముల్. ౯౩

గీ. అంత నొక్కకందువందుఁ బ్రహ్లాదుండు, బాలికాశతానుకూలుఁడగుచు
వనవిహారకాంక్షఁ జన సముద్యుక్తుఁడై, మరునిజోడుకోడెమాడ్కిఁదనరి.

సీ. ఉదయార్కబింబంబునోరవచ్చునెరమెచ్చు *చిగురుఁజెంద్రికచాయచేలమమర
గంధానుమేయంబుగా మేన నలఁదిన చర్చరపాంకానుమక్తి (?) దోఁపఁ
గంకణకుండలగ్రైవేయముద్రికాహారప్రభల రోహణాద్రిఁ బోలి
యాయాయిఋతువు లుపాయనం బొసఁగిన కుసుమంబు లలకలఁ గుస్తరించి
మదనశతకోటిలావణ్య మెదురుకొన్న, నిద్దమగుమూర్తియద్దానసీడచూచి
కామినీమణిపరివారకలితుఁ డగుచుఁ, దనగృహోద్యానసీమకుఁజనఁదలంప.

శా. ఆదైత్యేంద్రకుమారుఁ గొల్చిరి మహోద్యద్రత్నహారావృతల్
పాదాబ్జక్వణదచ్ఛనూపురలు శంపాసంపదుద్వృత్తనుల్
మోదాపాదిసుగంధబంధురలు సంపూర్ణేందుబింబాననల్
యాదోలాంఛనమంత్రదేవతలు దైత్యాధీశకన్యామణుల్. ౯౪

వ. ఆప్రహ్లాదుం డాహ్లాదపరిపూరితహృదయుండై యమ్మదవతీశతంబుఁ గర్ణిరథా
రూఢంబు గావించి పూవుందోఁటకు హాటకవిమానారూఢుండై చనునవస
రంబున. ౯౫

సీ. శ్వేతాతపత్రాళి వెలఁదివెన్నెల గాసెఁ బార్వికశశిపరంపరలఁ బోలి
కలహించురాయంచగములనందడి చూపెఁ గామినీకరదత్తచామరములు
కంతుసేనాకలకలము నాకర్షించె నర్మగర్భోక్తివీణాస్వనములు
కర్పూరకస్తూరికాశంకుమదకుంకుమాదిసుగంధము లతిశయిల్లె
మసగదిత్తుల (?) నించి పల్లఋను జిమ్ము, సారపన్నీరనీరాతిశైత్య మెనఁగె
నసమయౌవనపరిపూర్ణుఁడసురరాజ, సుతుఁడువనకేళికరుదేరనతులమహిమ.

సీ. కొంద ఱాందోళికాసందోహముల నెక్కి కేళిఁ గొందఱు పల్లకీలనెక్కి
ప్రకటశిల్పము లైనశకటంబు లొకకొంద ఱెక్కి హయంబుల నెక్కికొంద

* గిఱుగు

జిభరాజముల నెక్కి హేమలేపములదూకొనుసర్వాబంబరా(?)ల్గొందఱెక్కి
భీమసత్త్వము లైనవామీశతంబులపైఁ గొందఱెక్కి నృపాలగణిక
లనమపిశితవిశేషంబు లాసవములుఁ, గుసుమఫలములుఁబట్టించుకొనియరిగిరి
రాజునిరుగడ రతిరాజుతేజులనఁగ, సరసవాక్కులనమృతవర్షములు గురియ.

క. దండెత్తు మరునిగతి నా, ఖండలరిపునందనుండు గనుపట్టె మహీ
మండలకుండల మగుతరు, షండనివేశమున సకలసౌఖ్యోన్నతుఁడై. ౧౦౦

క. పిడియేనికె మొత్తము తన, బడిరా నైరావణంబు బలభిద్వనిలో
నడరు క్రియఁ గనకకశిపుని, కొడు కుపవనవీథి నమరెఁ గొమ్మలుగొలువన్.

సీ. ఏడాకుపొన్నలు చోద్యమ్ముపుట్టెడుచోట సురపొన్న విరితేనెఁగురియుచోటఁ
జంద్రకాంతములునిచ్చలుఁగరంగెడుచోటఁగపురంపుటరఁగులుగలుగు చోట
దరుణవాసంతికల్ దళ్లుగట్టెడుచోటఁ జిలుకబోదలు ముద్దుగులుకుచోటఁ
జలిగాడ్పునిసువులుతేలలుసూపెడుచోటఁ గోయిలలిగురాకుఁగొఱుకుచోట
గర్వితస్మరచాపటంకార మఖిల, విరహిజనమోహనస్ఫూర్తి బెరయుచోట
విపులవిహారణపరతంత్ర వృత్తిహత్తి, విడిసెఁబ్రహ్లాదుఁడుద్యానవీథినడుమ.

చ. తొలకరి లేమెఱుంగు లనఁ దోయజగర్భుఁడు హేమపుత్రికా
వలుల సజీవభావమున వన్నియవెట్టె ననంగ నంగరే
ఖల విలసిల్లునంగనలు గబ్బున నిబ్బర మంది కొల్వఁగా
వలపుల*రాచవానిచెలువంబున రాజతనూజుఁ డుండఁగన్. ౧౦౩

క. తరుణులకు నుపవనశ్రీ, కరుణించి యొసంగురత్నకనకాభరణో
త్కర మనఁగ వారు వారికి, ధరియించిరి ప్రసవకల్పితము లగుతొడవుల్.

గీ. వనిత యొకతె కొమ్మ వంచి పూవులుగోయ, రాలెదనుజలోకపాలుమౌళి
గొన్ని యతఁడు కీర్తికుసుమముల్ శిరసున, నావహించి మించియలరెననఁగ.

ఉ. ఇంతలె కాని నాకుచము లింతకు నెక్కుడు లేవు కామినీ
సంతతిలోన లేఁత నని సంజ్ఞ సురారికిఁ జేయుకైవడిం
గంతుని బెట్టకోల యొకకన్నియ మారెడుపండ్లు పాణిప
ద్మాంతరసీమ నించె సరసాకృతిఁ గందుకకేళి సల్పుచున్. ౧౦౬

క. మరుతూపు విభునిచూపుం, గరమూలములందు నొకటఁ గదలక నిలువ
న్వివరు లరవిరబాగున నొక, విరిబోఁడి నఖాంచలముల వేమఱుఁ జిదిమెన్.

‡ రాచవారి

క. కరకందుకమున నొకసతి, సురవైరిన్ వైవఁబూనుసుఖ గతఁడు హృదం
తరమునఁ గని లీలాపం, కరుహముఁ ద్రోలఁగించి దానికన్నులుగప్పెన్. ౧౦౮

చ. అలికులనీలవేణి విను మాహాదరింటికిఁ బోకు నీకుఁ గా
వలసినఫేని యేమి కఱవా తరువాటమునందుఁ గ్రొవ్విరు
ల్పొలుచన నీదుమోవిఁ గబళింపఁగ *బొంచెను గండుఁదుమ్మెదల్
దలఁపవు ముగ్ధ వంచు నొకతామరసాక్షి యదల్చె నెచ్చెలిన్. ౧౦౯

క. విరిసినకుంతలబంధము, మురిసిననీవియును హస్తములఁబట్టి కృశో
దరియొక తెపనుపుఁబయ్యెదఁ, గరువలి జడియింపఁ గుంజగర్భము దూఱెన్.

తరల. పదను మీఱ రసాలపేశలపల్లవావళి ముక్కులం
జిదిమి కుత్తుకబంటి తద్రసనీధువుం గొని చొక్కున
క్రొ్ఁదమకోయిలగుంపు కన్నులఁ ‡గోరగించెదు కెంపు సొం
పొదవెఁ బాంథులమీఁదికోపపు టుబ్బటంచు సతుల్ నగన్. ౧౧౧

మత్తకోకిల. తోరమా విరితేనెసంద్రపుఁదొట్టునం బడి యీఁదుచు
న్నారుసింగిణిమ్రోఁతలో యన మాటిమాటికి మ్రోయుచుం
దూరనెక్కి పరాగపంక్తులఁ ద్రొక్కి సౌరభ మానుచు
న్వారిజాక్షులచూపుచాయల వాలెఁ దుమ్మెద లమ్మహిన్. ౧౧౨

సీ. పల్లవపరిణాహపాదారవిందయుఁ గర్పూరరంభోరుకాండయుగయు
సుమరేణుసైకతసముదగ్రజఘనయు నవనవపున్నాగనాభితలయు
భ్రమరడింభకరోమరాజిరాజితయును శ్రీఫలస్తనకుంభశీలితయును
వల్లీమతల్లికాప్రోల్లసద్బాహయుఁ గ్రముకకోమలకంబుకంఠయుతయు
మధురసాదరదళపుష్పమంజరీము, ఖయును మాయూరపింఛాగ్రకేశపాశ
శాలియునునై నవనరమాచపలనయన,మమతఁబ్రహ్లాదునాహ్లాదమగ్నుఁజేసె.

చ. అసురవరేణ్యుఁ గూడి హరిణాక్షులు వృక్షలతామతల్లికా
ప్రసవము లాహరింప ముఖపద్మము లించుకవాడుచూపెఁ జె
దుసికిలఁజొచ్చె ఘర్మభవతోయకణంబులు తొట్రుపాటునన్
వినవినగాక మందగతి విభ్రమము ల్వెలసిల్లె నత్తఱిన్. ౧౧౪

క. ఆకాశకృష్ణవక్షః, స్వీకృతకౌస్తుభమువోలె వెలుఁగులఱేఁడు
ద్రేకించెఁ బట్టపగ లతి, లోకములై కిరణపంక్తులు పిసాళింపన్. ౧౧౫

---

*బొంచిన ‡కోరకింపెడు.

వ. అంతఁ బ్రహ్లాదుండు ప్రచండమార్తాండకిరణమండలచండిమ సహింపనోపక రూపవతీసహాయుండై రాయంచమించుఁబోఁడులఁ గూడి సంచరించు రాజహంసంబునుంబోలె భాసిల్లి సలిలకేళికి నగ్గలించు నంతరంగంబు పొంగార నయ్యారామంబునం గలయం దిరుగం దత్పురోభాగంబునఁ బరమయోగియుంబోలెఁ బంకరహితస్వభావంబును రాకారాత్రియుంబోలెఁ జంద్రశీతలంబును భవసఖునివాసంబునుంబోలె మకరకచ్ఛపపద్మాదిసద్మంబును మహాగహనంబునుంబోలె నుద్దండపుండరీకంబును బుండరీకాక్షుపొక్కిలియుంబోలె సర్వతోముఖశోభితంబునునైన యొక్క సరోవరంబుఁ గని కనకకమలకళికాపరాగపరంపరాపరిచయసరససలిలసమీరంబుల శరీరంబులకుఁ బ్రీణనంబు గావించుచు మదకలకారండవక్రౌంచప్రముఖఘనరసవిహగవిసరమసృణరణనంబులు శ్రవణరంధ్రంబులకుంబరమానందంబునొందింపందత్కాసారసౌభాగ్యంబునకు మెచ్చుచు వచ్చి యచ్చటఁ బచ్చవిలుతువిడిదియుంబోని* గురివెందపొదరింట మృదులలతాంతశయ్యాతలంబున సుఖాసీనుండై మానవతీజనంబుల వారివిహారంబొనరించుటకు ననుజ్ఞ నొసంగుటయు.

క. జలకేళికి నుచితము లగు, వలిపంబులు గట్టి కనకవలయాదికభూ
షలు డించియు విలసిల్లిరి, లలనలు నీహారసమయలతలుంబోలెన్. ౧౧౮

గీ. కనకశృంగంబులును లక్కకరవటములు, నేత్రములు గందళీఫలనికరములును
మొదలుగాఁగలసాధనంబులు ధరించి, కొలనుఁజొచ్చిరి సంఫుల్లజలజముఖులు.

చ. కుచములకుంకుమ ల్చెదరఁ గుక్కినపూవులు పుక్కిలించుచుం
గచములు వీడ గండయుగకల్పితనూతనపత్రవల్లికా
రచనలు మిక్కిలిం గరఁగ రామలు కాంచనశృంగపూరితాం
బుచయము చల్లి రొండొరులఁ బూఁచి తనూతటిదాళి మీఁదటన్. ౧౧౯

గీ. చాలలోఁతైన తత్సరస్సలిలపూర, మంగనలనాభిబిలములయందు నణఁగె
నెంతగంభీరు లేనియునింతులకును, లోనుగాకున్నవారిని గాన నరిది. ౧౨౦

ఉ. చల్లిన మాఱు లేకెదురు చల్లెడువారలుఁ జల్లినన్ హస
ద్దల్లతలంబుగా నిజముఖంబులు ద్రిప్పెడువారు మూఁకపైఁ
జల్లుచు గెల్చుకొన్నసతిఁ జాగురె యంచు నుతించువారు నై
యల్లలనల్ సరోజలవిహారము సల్పిరి పొల్పుమీఱఁగన్. ౧౨౧

గీ. పడఁతి యొక్కతె కుత్తుకబంటినీట, నుండునవ్వేళఁ గనుఁగొనునువిదపిండు
భ్రమరమిథునసమాశ్రితపద్మమనుచుఁ, జపలదృక్తన్ముఖంబుఁ బ్రశంసచేసె.

* గురువింద.

వ. అట్టి సమయంబున. ౧౨౩

సీ. తరుణీదృగంజనద్రవలతాకీర్ణమై యొకచోట నీలిమ నొదవఁ జేసి
వామనేత్రీకుచద్వయకుంకుమాలేపక్లిప్తిచే నొకచోటఁ గెంపునెఱపి
వనితాజనాంగచందనరసాక్రాంతిచే ధావళ్య మొకచోట నావటించి
సుదతులపసుపుపయ్యెదలని గ్గొదవుట నొకచోట హరితాళవిక్రియఁగూర్చి
కొలనుబహువర్ణసాంకర్యకలితమయ్యె,గట్టుబయలయ్యెఁగలఁకలోఁదొట్టుకొ
నెట్టివారికినేనియునిందుముఖులఁ,గలసిమెలసినఁగలుగునే గౌరవంబు. (నియె

గీ. కామరూపుఁ డగుట గంధర్వమూర్తియ్యె,య్యసురరాజసూతి యచ్చరలకు
నీడువచ్చుదానవేశ్వరదత్తక, న్యకలఁగూడి క్రీడ లాడఁదొడఁగె. ౧౨౪

క. మరుఁడేయుతూపుగములకుఁ, దరుణీమణివీక్షణములు తావలొసఁగ ని
ర్జరవైరిసుతునిడెందము,గరఁగెన్శిఖితప్తజతుశకలపరిపాటిన్. ౧౨౬

సీ. దానవాధీశవేదండంబు కాంతావశావశుం డగుటఁ యాశ్చర్య మగునె
యసురమార్తాండుండు బిసరుహాలోచనాప్రభలకు లోనౌట యభినవంబె
రాక్షసాధ్యక్షునళక్షభానుఁడు కాంతలనుతారకలఁ గూడు టద్భుతంబె
క్రవ్యాదసింహంబు కలకంఠకంఠీగుహాలీనుఁడగుట మహాఘనంబె
యనఁగ జలకేళివిహరణం బాచరించె, సారకాసారనవవారిపూరవీచి
ఘటలఁగుటిలేందునిటలాసగంధగాత్ర,గంధకలితాంగుఁడై మరుత్కంపనుండు

గీ. కంజపత్రాక్షియోర్తులాక్షాకరండ, తాడనంబునఁ జెనకిన దైత్యభర్త(గ.
దానికుచమధ్యవీథిఁగెందమ్మినివిచె,ననవిలుతుఁ డేయుప్రథమబాణంబొయనఁ

ఉ. దానవరాజసూనుకరతామరసేరితవారిధారలన్
మానవతీశరీరనఖమండనముల్ పయిపూఁత లూడినం
గానఁగవచ్చెఁ బుల్కడుగఁగాఁ బ్రసవాస్త్రుక్రృపాణపట్టికా
స్థానములందుఁ దోఁచునునుజాయలకైవడిఁ జూడ నందమై. ౧౨౯

గీ తనదుఁ*లోఁదొడఁ దేఁటిముల్గాఁకెననుచు,మిట్టిపడునొక్కనునుజను†మిట్టలాఁడి
నొడకొడకుమనినాథుఁడూఱడించెఁ, జలువకౌఁగిటజిగియార‡సవదరించి.

ఉ. దానవభర్తరత్నములుతాఁచినబుజ్జటకొమ్మునీట న
మ్మానవతీజనంబుఁ బలుమాఱును జల్లుచుఁ గ్రేళ్ళుదాఁటె వ
ర్షానవమేఘమండలము చల్లనియుల్లసితాంబువృష్టిచేఁ
గాననభూములం దడుపఁగా నగువిభ్రమ ముద్భవింపఁగన్. ౧౩౦

* లోఁదడ † మిట్టలాని. ‡ సవధరించ్చి.

క. ఘలుఘల్లనఁ గరకంకణ,ములు మొరఁయగఁగాంతలొక్క మొనయైనేత్రం
బుల ఫలములఁ బూబంతుల, జలజంబులఁ గప్పి రసురశాసనతనయున్.

గీ. కామినీప్రేరితానేకగంధతోయ, ధౌతనిజదేహుఁడై యొప్పె దైత్యభర్త
వడియుపూఁదేనె కాలువఁగడుగఁబడిన, మేనుగనగల్గు మన్మథునేనుఁగనఁగ.

సీ. చక్రవాకస్తనాంచలఫేనహారంబు లదుకులువిచ్చి యిట్టట్టు చనఁగఁ
దరుణశైవాలకుంతలకలాప మొకింత పద్మాస్యమునఁ గొంత ప్రాఁకుదేఱ
సైకతజఘనచంచద్రాజహంససంపత్కాంచికలకలస్వనము లుడుగఁ
జపలకల్లోలభుజాబంధముద్రల జడభావ మెంతయుఁ గడలుకొనఁగ
లోఁగలఁగుట సంగమజ్ఞానిగాఁగ, శైత్యమును బారవశ్యంబు సంభవింప
దనుజకందర్పుఁ గూడినతరుణిపోలెఁ, గేళిదీర్ఘికయొప్పె నవ్వేళయందు.౧౩౮

—:సూర్యాస్తమయాదివర్ణనము.:—

వ. అరవిందంబులవిందు మందమందకిరణప్రసారుండై చరమశైలశిఖాసుఖా
సీనుం డగునంతఁ గాంతాసమన్వితుం డై దానవకాంతుండు సలిలకేళి
చాలించి మడువు వెడలి తత్తీరంబున నుచితశృంగారాంగీకారంబున నభిరామ
మూర్తి యయ్యె నయ్యావర్తనాభులును నలుదెఱంగుల నలంకృతలై చెలం
గుచుఁ బూజపెట్టిన వలరాజువాలురమ్ములుంబోలె భాసిల్లి రాసమయంబున.

గీ. క్రుంకుమెట్టదాఁకి గుజ్జంబు ప్రొగ్గిన, నొంటికంటి తేర నుండలేక
జిక్కువాఱె ననఁగ నర్కమండలము ప, శ్చిమపయోధిలోన శిరసుముంచె.

స్రగ్ధర. భానుండస్తాద్రి దాఁటం బవిరియుగొనుచుం బద్మసంఘంబులో భృం
గానీకం బార్తినొందెన్ హరిణకులము కచ్ఛాంతరక్షోణి నిల్చెన్
నానావృక్షాగ్రశాఖోన్నతగృహములలో నమ్మయూరాళి కన్నుం
గోనల్మోడ్చెం బ్రవాళాంకురరుచుల హరిత్కోణముల్ రాణమీఱెన్.

క. మసమసగఁబడియెఁ బడమర, నిసువుంజీఁకటులమూఁకనీడలు దోఁచెం
గుసుమంబెట్టినగతియా, కస మెంతయు సగుణకాంతిగర్భిత మయ్యెన్.౧౩౯

గీ సమయసింహంబు దివసగజంబువ్రచ్చ, దొరఁగునెత్తురుకరణిసాంధ్యరుచిదనరె
నందురాలినకుంభముక్తాంకురముల, తళుకు దళకొత్తె నూతనతారకములు.

సీ. ఇల దనయంతియ కలదొ లేదో యని కొలువవచ్చిన నభోవలయ మనఁగ
బలిబంధనమునాఁటి బలుమేసుహరి పీడఁదాచినఁ బోవక యేచె ననఁగ
నక్షులు గప్పి పదార్థజాలంబుల మాయంబు నేయు పెన్మాయ యనఁగ
సూర్యవిజ్ఞానంబు సొరుగఁ గాలముమీఁద గవిసిన మోహవికార మనఁగఁ

జేఁ బెత్తి కెరలు *గ్రీయూట తేటల చంద్రకాంతము ల్తాపప్రశాంతి చేసెఁ
జిమ్మచీఁకటిపేరిచీడ యంతయు వీడి బ్రహ్మాండభూజంబు పల్లవించె
నడరె నగవావచటులాట్టహాసవాన, వకరికరికాండకాండ కేవలసఖములు
దీప్రకాంతిప్రసారితదిఙ్ముఖములు, జలజరిపుసింహనఖముల †తళుతళుకులు.

ఉ. శీతలవాతపోతములచేతులు చూచుచుఁ గల్వలచ్చి కెం
తేతను పావహిల్లఁ దగుదీవెన లిచ్చుచుఁ బత్యగారముం
బూతముగాఁగఁ బాదతలము ల్వచరించుచు జ్యోతిరాగమ
ఖ్యాతునిలీల శీతకిరణాకృతి ప్రౌఢిమచూపె నేర్పునన్. ౧౫౦

వ. అప్పుడు కకుప్పాలం గుప్పలించుచుఁ దప్పుతారి రోలంబుల నణంగిన కాలాంధకారంబు దూరంబుగ వెడలించుచు నుడివోనిరతులం బతుల చేత ‡నదమదమైనమదవతీజనంబులకు ముదం బొదవించుచు నదీతటంబులఁ బుటపాకచటులం బగువియోగవేదనాజాతవేదంబున ఖేదంబునొందు విరహుల కతినిగ్రహకారి యగుచు నగుమొగంబులం జిగిదొలంకు జీవంజీవంబులకుఁ జేవదెచ్చుచుఁ బచ్చవిల్తునకు నిచ్చకంబును గమ్మతెమ్మెరకు సమ్మతియును గలువకుం జలువయును గైరవంబులకు గౌరవంబును నమృతంబునకు సుముఖత్వంబును సమకొల్పుచు వెలఁదివెన్నెల మిన్నునున్నెలయుం గప్పి కర్పూరపరాగపర్వతంబు లేకీభవించి యుద్రేకించె నన విజృంభించె నత్తఱి మత్తకాశినీచిత్తంబులు సీధురసాస్వాదాయత్తంబు లయ్యెఁ దత్తత్పదార్థపారంబులు ప్రబలప్రసారితంబు లయ్యె నయ్యాతుధానుండు మానవతీసహితుండై బహువిధచమత్కారప్రకాశం బగునొక్కవివిక్తప్రదేశంబునందు నాసీనుం డగుటయు. ౧౫౧

గీ. పాటలప్రసూనపల్లవభంగశీ, తలము లైనసీధుధార లాని
గ్రీష్మతాపజనితఖేదంబు వదలించు, సతులఁ జూచి విభుఁడు మతిఁ జెలంగె.

క. జలరుహాకర్ణిక మీఁదటఁ, దల మగుపూఁదేనె కరణి దరుణియొకతె వె
గ్గలమగు మధుపూరము కర, తలమనుచషకమునఁ బట్టి ధవు మెప్పించెన్

క. మును దా మానఁగ నొకచవి, వెనుక న్విభుఁ డానినాన వేఱొకచవి యా
వెనుక సఖులాని యిచ్చుట, వనితలకుం జెక్కుచవులు వారుణియొసఁగున్

ఉ. తొదలు మృదూక్తులు స్మరవిఘూర్ణితలోచనపంకజంబులుం
బదిలము లేని సిగ్గుమనుపట్టును దొట్రిలుచున్న యానము

---

*గియ్యాట. †ధళుధళుకులు. ‡నదమదమైన.

ల్పదమునఁ బ్రోదివెట్టు మదిమ్రబ్బును గుబ్బటిలంగఁ జంద్రమో
వదనలు పానకేళివిభవంబు లొనర్చిరి వారివారికిన్. ౧౫౫

సీ. ఇదె తేనెపెరచూడు మించుకచవి యంచు నధరబింబఫలంబు నాననిచ్చి
యిదె పుష్పకందుకం బెద నించుకొమ్మంచు నురుతరస్తనకుంభ మురముసేర్చి
యిదె మృణాలమతల్లి పొదువుకంధరనంచుఁ గరకాండములచేతఁ గళముఁ జుట్టి
యిదె కల్హారేకు నీవిందుచేఁ జెమటవోఁ జిమ్ముకొమ్మని కోరఁ జీరఁ జేసి
నాథుఁ బోనీక యాఁగి నానావికార, చాతురీధాతురీతిప్రసక్తవచన
రచనగల్పించి యొకకొంత మదప్రచురపాన, వికృతినో కాక మోహావేశముననొ.

గీ. చంద్రకాంతశకలచషకసంపూరిత, మధువుఁ గ్రోలఁగ్రోల విధుకరములఁ
బానపాత్రగరఁగుపరిపాటి మెఱుఁగక, వెలఁదియొక తెసారె వెదకఁదొడఁగె.

ఉ. నీలకనీనికావిజితనిర్జరనాయకరత్న యొక్కతె హం
సాలసయాన సీధురస మానుచుఁ దత్ప్రతిబింబితాత్మప
ద్మాలఘుకాంతివాసనకునై పచరించిన కల్హారేకులం
చాలిక నవ్వఁగా వెఱఁజియాడఁదొడంగె నఖాగ్రధారలన్. ౧౫౭

సీ. పవనంబునకు నైనఁ బాయఁదట్టఁగరాని పయ్యెదకప్పులు బయలుపడియె
నధరపల్లవకాంతు లక్షిపద్మములందు వేడ్కనో యొక్కింత విశ్రమించె
మాటాడనేరని మార్గంబు విడనూకి ప్రౌఢిమ తనుదానె గాఢమయ్యెఁ
బరమయోగికినైన భావింపఁగారాని యానందసంపద యల్లుకొనియె(నిమేఁ
మఱపుఘనమయ్యెఁ జేష్టల తెఱఁగువికృతి, గనియెఁ దొలుతటికోపమెక్కడికొ చ
గాపిశాయనమదమత్తకరివరేణ్య, యానలకు నాథకీలితధ్యానలకును. ౧౫౮

వ. వెండియు నమ్మధుపానచేష్టాప్రకటనంబు కుకవికవిత్వంబునుంబోలె వికట
పదబంధవాక్యవైకల్యంబై యవివేకివితరణంబునుం బోలెఁ బాత్రాపాత్ర
వివేకదూరంబై సామజాలానభూమియుం బోలె బహుప్రకారమదచమ
త్కారసరసంబై మందానిలుచందంబున నానావిధపరిమళసంక్రమణరమణీ
యంబును గంధర్వలోక ప్రకారంబున బంధుర గాంధర్వసంధాన గంధిలం
బును నుపవనంబునుంబోలె నుపవసంతసఖశిలీముఖముఖరితంబును నయ్యె
నయ్యెడ నయ్యాతుధానసూనుండు ప్రసూనవరంవరా పరికల్పితంబు ను
మురువకమందారపల్లవకాండకిసలయవిపవవిరచితశయ్యాతలంబును గర్పూ
రదర్పసారకాశ్మీరవిస్మేరసౌరభగర్భితంబును నైనశయ్యాతలంబునధిష్ఠించి.

సీ. పంచతంత్రంబులభావంబు లుబ్బించి యాలింగనంబుల నంటనలమి
సంస్కారముల షోడశస్థానములఁగల్గు కళ లొయ్యనొయ్యనె కరఁగఁజేసి
రాగంబు లెచ్చఁగి సంయోగసీత్కారోచ్చరతులఁగూడక తుల్యరతులఁగూడి
చక్రాదినుకముఖ్యచతురబంధంబులపాండిత్య మంతయుఁ బరిఢవించి
భావికృష్ణుండు గోపాలపద్మముఖుల, రాసకేళికిఁ దార్చునుల్లాన మెసఁగ
నొక్కఁడయ్యును బెక్కండ్రయువతిమణులఁ, బరవశలఁజేసినంతనవతీచెవిభుఁడు.

వ. అట్టిసమయంబున. ౧౬౨

గీ. సతులతోఁగూడిరతిపరిశ్రాంతుఁడైన, దైత్యసుతు సేదదేర్పంగఁదలఁచెనొక్క
నవలతాన్తలతాంతగంధములుగొనుచుఁ,బాలిచెఁ బ్రాభాతికానిలపోతకములు

గీ. ఆసవాస్వాదనిర్భరం బైనసురత, సౌఖ్యమధినాథుచేయఁ దేచ్ఛముగఁగాంచి
వేగఁ గరువలి వీవన వీచుచుండ, నందె నిద్రామహానందమతిశయించు. ౧౬౩

సీ. ఆకాశలక్ష్మినాసాగ్రముక్తాఫలద్యోతంబుచూపెఁ బ్రభాతతార
యొండకాలమునాఁటియేటినీరునుబోలె డొంకివెన్నెలయు నిక్షేంకులింకెఁ
జలికందువఁ జరించువెలిదామరయుఁబోలె మధువైరిడాకన్ను మైలవడియె
జెక్కులువచ్చి తామెక్కడికేగెనో చుక్కలగమి విచ్చెఁ జూడఁజూడ
జలజకాసారతటభూజకలితనిజకు, లాయకూలంబులందుఁ గోలాహలంబు
చేసెఁబులుఁగులుజక్కవచింతవాసెఁ,దలఁగెఁగందర్పుఁడానిశాంతంబునందు

ఉ. తూరుపు తెల్లనయ్యె హిమతుందిలమారుతలూనవృంతమై
జాఱెఁ దరుప్రసూనతతి *జారజవారము తట్టువారెఁ గ్రొం
కారముచేసెఁ గుక్కుటనికాయము కల్వలు గన్నుమూసె నం
భోరుహ ముల్లసిల్లె నలిపోతము గీతముచేసె నల్గడన్. ౧౬౪

గీ. సమయఖనికుండు ప్రాగ్దిశాశైలతటము, త్రవ్వ నుద్భవమైనకెందమ్మికెంపు
వట్రువయుఁబోలెఁజేఁకటికుట్రమన్నెఁ, ముాఁకవిప్పాచునుదయించెఁగాఁకవెల్గు

క. త్రిజగజ్జనసేవితుఁ డం,బుజబాంధవుఁ డుదయమైన భూసురముఖ్యుల్
భజియించిరి పాతకములఁ,ద్యజియించిరి దివ్యనవ్యతేజోధికులై. ౧౬౫

వ. ఇట్లు సూర్యోదయం బైనయనంతరంబ యాధైర్యధుర్యుండు భార్యాశతంబులుఁ గృశోదరీసహస్రసేవితం బగుదాని నుచితప్రకారంబున నగరికిఁ బనిచి
ననిచిననిష్ఠాగరిష్ఠత్వంబున గ్రహకులశ్రేష్ఠు నారాధించి పురప్రవేశం బాచ
రించి విరించిసత్యలోకంబును వైకుంఠుండు వైకుంఠంబును ద్రిలోచనుండు

* జాలజకారము.

కైలాసంబును బాలించుకై వడి జావడింపక నిజరాజ్యపరిపాలనం బూజ్యుండై యుండె నయ్యవసరంబున నొక్కనాఁడు సూచీముఖ శూర్పకర్ణ వృశ్చిక రోమ వికటశంబర దీర్ఘజిహ్వా మహిపాదు లగుమానుషాదుల యాదేశం బునఁ గావ్యోపదిష్టనయప్రయోగనిపుణుం డగువామనుండు తనకావించు కపటోపాయంబునకు నవ్వేళ యనుకూలం బగుట యెఱింగి సింగంపుగద్దియం బ్రొద్దుజరపుచున్న యన్నారాయణప్రియుం గూర్చి యి ట్లనియె.

—:వామనుం డనుదానవుండు కొలువునకు వచ్చుట.:—

చ. అవినయదూర సర్వభువనాధిప ధీనిధు లెల్ల మెచ్చని
య్యవనితలంబు నీకరతలామలకంబుగఁ జేసి మించి శా
త్రవులను మిత్రుల న్సమపదంబున నిల్పితి విట్టినేరు పా
దివియు రసాతలస్థలము దిద్దెడువారల కైనఁ గల్గునే. ౧౭౦

సీ. వృత్రాసురారాతి మిత్రత్వమొనరింప ధనభర్త పర్ణమబాంధవుఁడు గాఁగఁ
బానీయపతి సుహృద్భావంబు జరపంగ సఖుఁడై కృతాంతుండు సంతసిల్ల
మునులెల్లఁ జుట్టరికమున మించి తిరుగంగ నెనరువాఁడై భానుఁడనుమతింప
వశుఁడై గురుండు సర్వంబుఁ బరీక్షింపఁ జంద్రుండు ప్రాణమై సవదరిల్ల
దివిజులకునెల్ల మొదలై నదివిజుఁడనఁగ, నద్గుణంబులయందునాచారమహిమ
బ్రస్తుతింపంగఁదొల్లింటి ప్రభువులట్లు,సాకితివి కీర్తి దానవచక్రవర్తి. ౧౭౧

మ. బలసౌభాగ్యవివేకవైభవములం బ్రఖ్యాతదానంబులం
గులవిద్యాగుణరూపశౌర్యమహిమల్ గోత్రావనజ్ఞానని
శ్చలత న్నిత్యదయావిశేషముల నాచారప్రభావోన్నతిం
గలరే నీకెన మూఁడులోకముల లోకఖ్యాతతేజోనిధీ. ౧౭౨

ఉ. మొన్నఁటిపిన్నపాపఁడ వమోఘపరాక్రమసన్నుతుండవై
మున్నిటివీరవర్యులకు*ముల్లొకయించుక చూపుచున్న మీ
యున్నతి చూచి నాహృదయ ముబ్బెడు బాంధవమిత్రవర్గముల్
నన్నుతిసేయ సద్గుణవిశాలుఁడ వైతివి మే లనందగున్. ౧౭౩

గీ. నీవు చుట్టమ వైన మనీషివర్య, చుట్ట మనరాదు రాజవై పట్టమేల
గుప్తకార్యంబుగలదువాక్రుత్తునొకటి, వినఁగవలతేని వినుము వివేకనిపుణ.

క. కార్యాకార్యంబులు దగ, నార్యులతోఁ దలఁపునేయునట్టిమహీశుల్
వీర్యసమన్వితులయ్యును, శౌర్యమునం గెలువలేరు నమదాహితులన్. ౧౭౪

* ముల్లోనరించుక.

ఉ. పెద్దతికంబునుం బ్రియము పెంపు వహింపఁగ రాజ్యమేలు మీ
పెద్దలు భక్తితోడ మముఁ జేరఁ గని పిల్చి సమస్తకార్యముల్
తద్దయు నేము చెప్పినవిధంబున నాచరణంబు చేసి యా
గద్దఱులైనశాత్రవుల కండలు చెండి రుపాయచాతురిన్. ౧౭౬

క. అదిగావున మామాటలు, హృదయంబున కింపుచేసెనేనియు భక్తిం
బొదలుచుఁ దద్వృత్తాంతము, ముదలించెదఁ దేటతెల్లముగ సుగుణనిధీ. ౧౭౭

క. లోకాలోకనగేంద్ర, వ్యాకీర్ణప్రథితగుణలతానీక మహా
భీకరశాత్రవమదద, ర్వీకరవినతాతనూజ విభవబిడౌజా. ౧౭౮

శా. ఉల్లోకామలకోమలేతరకళానుష్ణచ్ఛవిక్షీర*వాః
కల్లోలస్ఫుట పుండరీకదివిషత్కల్లోలినీమల్లికా
వల్లీపల్లవఖడ్గఖండనశరద్వ్యార్వాహసందోహసం
పల్లాలిత్యమిళద్యశోధవళిమభ్రాజద్దశాశాంతరా. ౧౭౯

మాలిని. శతధృతికులదీపా సత్యభాషాకలాపా
చతురనయధురీణా శౌర్యబాణారిబాణా
వితరణరవిపుత్రా విద్వదుద్యానచైత్రా
ప్రతిభటమదశిక్షా బంధురక్షాంతిదక్షా. ౧౮౦

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాదసహజసారస్వత చంద్రనామాంకభారద్వాజసగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమార రాష్ట్రఘంటావధానపరమేశ్వరహరిభట్టారకప్రణీతం బైన శ్రీనరసింహపురాణోక్తంబునందు నుత్తరభాగంబునందుఁ బ్రహ్లాదగుణవర్ణనంబును ఋతుసమాగమంబును సతండు దైత్యకన్యకలం బరిగ్రహించుటయును వనవిహారంబును బురప్రవేశంబును ననంబరఁగు ద్వితీయాశ్వాసము.

---

*వాక్కల్లోల స్ఫుట.

శ్రీరస్తు.

# నారసింహపురాణము.

## ⇥ ఉత్తరభాగము ⇤

### తృతీయాశ్వాసము.

---

క. శ్రీమందిర ధృతిమందర, భూమక్షేమాభిరామ పుణ్యతరమతీ
ధూమధ్వజభీమద్యుతి,ధామస్ఫుటహేతి రంగదండాధిపతీ. ౧

వ. ఆకర్ణింపు మట్లు శౌనకాదులకు రోమహర్షణుం డిట్లనియెఁ దనసూక్తంబులకు
ననురక్తుం డగుప్రహ్లాదుం గూర్చి వామనుండు. ౨

—: వామనుండు ప్రహ్లాదునకు నీతిం దెల్పుట. :—

క. జలమునఁ బుట్టిన జలజము, జలము విసర్జించినపుడె సమయువిధమునం
గులబలము విడిచి భూపతి, మలినుండగుఁ దేజ ముడుగు మఱుఁగుఱ జరగున్

క. నీనెనరువార మిందఱ, మీనియతిని నిన్ను విడువనెఱుఁగక శోకం
బేనియు ఫలమూలజలము, లేనియుఁగొని నవయుచున్కి నీవెఱుఁగవొకో.

క. ఇదె బుద్ధిమంతుఁ డయ్యెడి, నిదె శాత్రవవిజయమునకు నేగెడి నీతం
డిదె మమ్ముఁబ్రోచు నిజమని, యెదురెదురే చూచిచూచి యిటుగావలసెన్.

క. కరనఖరలూనమగు విరి, పరికింపఁగ నెండిపోవుపరువడి మూల
స్థిరబలము లేనిభూపతి,పరిభవముం బొందుఁగాని ప్రబలఁడు మీఁదన్.

క. దాక్షిణ్యంబున మముఁ దము, రక్షించుచు శత్రుపక్షరక్షివిగా కీ
పక్షీణాక్షుద్రభుజా, శాక్షేయక్షతరిపుఁడవు గమ్ము కుమారా. ౭

క. తరతరమునాఁటి హితుల, న్నరపతి విడనాడి యురక నమ్మి యితరులం
బరివారముగా నేలిన, విరవిరగా కేల గాంచు విజయశ్రీలన్. ౮

క. తనవారి మీఱి చేసిన, పని ఫలితముగాదు వరటిపద నివిరిన భూ
మిని గర్షకుండు విత్తర, కిన దానం గనునె ఫలము కీర్తివిశాలా. ౯

క. తెగటార్పవలయుఁ బగఱుల, తెగలకుఱికి నిప్పు దూదితిట్టలఁ బోలెం
బగవారి క్రింద నణఁగిన, మగవాఁడు న్నగువయును సమాను లథీశా. ౧౦

వ. విమలమనస్కులై కపటవృత్తి మెఱుంగనివారితోడ స
త్యము నతిశౌచముం గలిగి ధర్మమెఱింగినవారితోడ ను
త్తము లగువారితోడ సతతంబును మైత్రి యొనర్చు టొప్పుం జి
త్తము లోకరీతియైనవిమతప్రకరంబులం గూడు టొప్పునే. ౧౧

క. ప్రాణానిలముల కన్నన్, మానమె యధికంబు గాఁగ మదిఁ దలఁపని య
జ్ఞానికిఁ గీర్తులు గలవే, దానవకులనాథ మెత్తఁదన మిది తగునే. ౧౨

క. దనుజులకును ననిమిషులకు, నెనయవు డెందములు వైరహేతిమదర్పల్
మొనలెత్తియుండుఁ బాముల, కునుమూషకములకుఁగలదెకూటమియొందున్

చ. ఘనతరదోర్బలోద్ధతి జగత్త్రితయంబును సంహరింప నో
పిన మముఁ జూచి దేవతలు భీతి నణంగిరి గాక మేము నీ
పనులకు రోసి పోయి తగుపట్లన యుండిలి మేని యొంటిగాఁ
డని నిను నేమి సేయుదురొ యారయుమా నయమార్గచాతురిన్. ౧౪

గీ. అన్నశేషమున్న నాఁకలి చెడిపోవు, రోగశేషమున్న రూపు దఱుఁగు
శత్రుశేషమున్న ధాత్రికి ముప్పగు, సిరులు విరియు ఋణము శేషమున్న.

క. అదిగావున శాత్రవుల, న్మొదలంటం దునుమలేని మూఢాత్ములకుం
గదనజయము చేకూరునె, పొదలునె సత్కీర్తిలతలు పూఁగొమ్మలతోన్.

సీ. సంగ్రామముఖమహోత్సాహదోహలియైన విబుధాధినాథుని వెన్ను చఱచి
మంజుఘోష తిలోత్తమయు నాదిగాఁగల సింధురయానలఁ జెఱలువట్టి
నందనవాటికానందప్రదము లైనయమరశాఖుల మొదలంట నఱికి
ముల్లోకములు గిట్టి ముమ్మొట్టి గొని శత్రు వనుపేరు కలలోననైనఁ గనని
దితివధూగర్భశుక్తిమాక్తిఫలంబు, కనకకశిపుండు తండ్రిగాఁ గలుగు నీవు
విమతమర్దనశాలివై వెలయు దేని, పరిమళము బంగరువునకు దొరకినట్లు.

క. ముదలించి చంపనోపక, మదనగురుఁడు నీదుగురుని మానిసిమొకమై
విదళించె నట్టికుహనా, విదుని న్భజియించె దీవు వే ల్పనుబుద్ధిన్ ౧౮

మ. కనకాక్షు న్వధియించెఁ బోత్రితనుఁడై కంబంబులోఁబుట్టి శా
తనఖాగ్రంబుల వ్రచ్చె నీజనకునిన్ దండించెఁ బెక్కండ్ర న
ద్దనుజశ్రేష్ఠుల నిష్ఠురాననరుచు ల్దర్పింప నీముందటన్
జనకద్వేషి భజించు టేలు గలఁడే సప్రాణుఁడై యుండియున్. ౧౯

గీ. బలముఁ గులముఁ జలంబును గలఁడయైన, సకలసౌభాగ్యసంపత్ప్రశస్తుఁడైన
బూనుకొనితండి పగయూఁగలేనివాఁడు, మీసములతోడియాఁడుదమిహిర తేజ

సీ. కరతలామలకసంకాశంబు లయ్యె నీ కఖిలవిద్యారహస్యంబు లెల్ల
భావసంభవుఁడును నీవు నేమవుదురో కాని లావణ్య మనూనతరము
గోష్పదాకృతి యయ్యెఁ గులిశాయుధునివిభవంబు నీయైశ్వర్యవారిధికిని
ముక్తాతపత్రమై మూఁడులోకములకు నీకీర్తిచంద్రిక నీడ యొసఁగెఁ
జతురకవికల్పశాఖి నీవితరణంబు, నీమహత్త్వంబు వర్ణింప నేరఁ డజుఁడు
నకట నీకేల పగవారి నాశ్రయించి, రాజ్య మొనరింప దీన గౌరవముగలదె.
సీ. ముదివేల్పుఁ గదిసి నెమ్మొగములు వగులంగఁ జెంపవెట్టఁగలేమె సింహశౌర్య
కంసారి నిద్రించుకడలి*వండలివండు చేసి చల్లఁగలేమె వాసవారి
పిడికిళ్ల నుష్ణాంశుఁ బొడిపొడి గావించి మేఁ జల్లుకొనఁగ లేమే బలాఢ్య
యనలజిహ్వాలు పల్లవావలిక్రియఁ దున్మి†తూఁటాడలేమె బంధురవిహార
నీయుపేక్షన యేమెల్ల నివ్వుఱుమీఁదఁ, గవిసియుండిననిప్పులగతి విహీన
బాహుశౌర్యులమైయుండి ప్రతిఘటించి, పలికితిమి దేవ విసివి నీపాదమాన.
సీ. బలిమిదప్పక మూలబలములఁ బోషించి జలగిరిస్థలదుర్గచయ మమర్చి
వనదుర్గములు గొన్ని వశములు గావించి చతురంగబలముల సంతరించి
చారచక్షువులచే శత్రుభూపాల వైభవమంత్ర తంత్ర సంపదలు దెలిసి
సామదానాదికసమయంబు లరయుచు గుప్తకార్యజ్ఞానకుశలుఁ డగుచు
మించి సర్వాంగరక్ష గావించి నిశిత, నీతిదర్శనమున ధరణీవిభుండు
పరభుజాశౌర్యపాథోధిబాడబాగ్ని, వోలె నింకింపవలవదె భువనవంద్య.
ఉ. శాతకరాసిచే విమతసంహరణం బొనరింపఁజాలు నే
జాతిమనుష్యుఁ డైన బలసంభృతశౌర్యవివేకయుక్తుఁ డా
నాతఁడె సర్వలోకవిభుఁ డాతఁడె పర్వతపక్ష‡శాసనుం
డాతఁడె చంద్రఖండధరుఁ డాతఁడె పంకజనాభుఁ డెంచఁగన్. ౨౮
సీ. ఆదినుండియును నీయఖిలంబు జంగమస్థావరరూపమై తనరుచుండు
నందు జంగమములై యండజస్వేదోద్భవజరాయుజంబులవరుస నెనఁగు
స్థావరంబులు మహీధరపాదపాదులేతద్వయాన్యము లేదు తర్కశయ్య
నారెంటిలోన ముఖ్యములు జంగమములు వానిలో మనుజులు మానధన్యు
లానరులకన్న దేవత లధికతరులు, వేలుపులకన్న నసురులు వెగ్గలంబు
తత్కులంబునఁబుట్టియుఁదగునెయిట్లు, దానవాధీశతనయయీతడమఁదనేము.

*బండలివండు. †తూటడలేమె. ‡శాతనుండు.

క. తనువెత్తినందునకు రిపుఁ, జనముల భంజింపవలయు సద్భోగంబుల్
గొనవలయు బంధుపోషణ, మొనరింపఁగవలయుఁజయమునొందఁగవలయున్
క. సంతుష్టిలేని విప్రుఁడుఁ, సంతుష్టుం డైనవిభుఁడుఁ జదియుదు రెందుఁ
సంతుష్టిలేక యునికియ, శాంతినిధీ రాజునకును సంపద నొసఁగున్. ౨౭
క. అడఁగినవారల శాత్రవు, లడఁతురు ఛల మగ్గలింప నడఁగక పరులం
గడకంటఁ జూచుధీరుల, *కడఁగొలుపవు శత్రునికరగర్వస్ఫూర్తుల్. ౨౮
క. అమరులయమరత్వము నీ, దుమనంబున నెన్నవలదు ధూర్జటినిభవి
క్రమ వారినెల్లఁ బదహతిఁ, జమరుదు మే యమరతాప్రశస్తి యడంగన్. ౨౯
క. ఘనకీర్తికారణంబుగ, మునుమగు ధర్మార్థకామముల కాశ్రయముల్
దనుజేంద్ర దానవాధిప, తనువులకు న్సాటి గావు తక్కినతనువుల్. ౩౦
క. పంచత్వము నొందకమును, సంచితములు నేయవలయు సకలార్థంబుల్
పంచత్వము నొందినతుద, నించుక గొఱ యగునె నిర్జరేశ్వరుఁ డైనన్. ౩౧
వ. అనిపలికి వామనుం డామహాత్మునితోడం దనతోడిదనుజవీరులఁ జూపి యి
ట్లనియె. ౩౨
సీ. పోదివి ముష్టాముష్టిఁ బోర నింద్రునినైన గెలువఁజాలిన కాలకేయుఁ డితఁ
డానవబిందుమర్యాద నంబుధు లేడుఁ ద్రావనోపిన కాలదంష్ట్రుఁ డితఁడు
తాళంపుఁజిప్పలలీలఁ జంద్రార్కులఁ గదియింపఁ గల శూర్పకర్ణుఁ డితఁడు
కులనగంబుల నైన గులగులగాఁ గేలిబిరుసు వాటించు శంబరుఁ డితండు
దక్షుఁ డాహవమునకు ధూమ్రాక్షుఁ డితఁడు, కాంచనాహార్యధైర్యుఁ డీకంకటుండు
భూమిచక్రంబు నొక్కటఁ బూనిపట్టి, పేమణము నేయనోపునీదశాపణుండు.
క. ఖరుఁ డనుదానవుఁ డితఁ డతి, ఖరకర తేజుండు మున్ను గగనచరుల ని
ష్ఠురుల సుకేతుకుమారుల, నరికట్టెం దూపువాన నంటఁగఁ బట్టెన్. ౩౪
ఉ. అక్షయసత్త్వశాలి కపిలాక్షుఁ డింతం డొకనాఁడు పుండరీ
కాక్షునివాహనం బగు ఖగాధిపుఁ డంబరవీథి నేగఁగాఁ
బక్షములూఁచి ముక్కుఁ గఁబట్టి ప్రయాసము సేయఁగాంచి యీ
రాక్షసులెల్ల మాన్చిరి భరంబుగ నీతనివిక్రమోద్ధతిన్. ౩౫
సీ. కల్పకేతుఁ డితఁడు కల్పాగ్నిసమమూర్తి, దీర్ఘజంఘుఁ డితఁ డుదీర్ణబలుఁడు
వక్రదంతుఁ డితఁడు శక్రాదులకు నైన, గెలువరాదు సమరతలమునందు.

*కడగొలుపడు.

క. నియ్యానతి గలిగినచో, నియ్యాన సమస్తదేవనివహము నెల్లం
గయ్యంబునఁ బరిమార్చెద, రియ్యసురులు నీవు వీరినేలుట తగదే. ౩౭

క. ఆగాధశౌర్యసంయుతు, లై రణమున భయములేక హాలహలాశిన్
శౌరి నజునైన గెలుతురు, వీరలు నీమూలబలము వీరవరేణ్యా. ౩౮

క. అట్టట వేలుపుగమిఁ జే, పట్టకుమీ ప్రాఁతవారి పట్టుదుగకు నీ
యట్టి మహాత్మున కేటికిఁ, దట్టువడ స్వీరకర్తధర్మ మడంపన్. ౩౯

—: వామనుఁడు ప్రహ్లాదునకు హంసునికథ చెప్పుట. :—

వ. ఏతదర్థంబై యొక్కయితిహాసంబు గల దాకర్ణింపు మని వామనుం డారాత్మ
సాధ్యత్ముతో ననియె మున్ను సుమాలివంశకు శేశయుహంసుం డగు హం
సుండను దానవోత్తంసుండు వెలయు నబ్బలియుండు. ౪౦

క. తలమాసూడిన మొదలున్, జలరాసులనీఁదు సప్తశైలములూఁచున్
జలజలఁ జుక్కలరాలుచు, నిలరాచు న్భుజగకులము నేఁచు న్వేఁచున్. ౪౧

క. సురలోకమువారల నీ, నరలోకంబునకుఁ దెచ్చు నరసురలోకే
శ్వరుల భుజగేంద్రలోకాం,తరమునఁగారించు దోర్మదము పూరించున్. ౪౨

సీ. ఆతపత్రచ్ఛాయ నరుదేరనొల్లఁడు నందన*వనినీడయుండె కాని
యొఱగుంముడాఁ† మీఁదనొఱగంగ నొల్లఁడు రంభపాలిండ్లయూరలనె కాని
పార్థివం బగుభుక్తి పాటింపఁగా నొల్లఁ డలఘుసుధాసుధారలనె కాని
గజరథాశ్వముల నెక్కఁగ నొల్లఁ డమరర్షితతికృతబ్రహ్మరథంబె కాని
సత్యలోకంబుఁ బాలించు శంభులోక, మేలు శ్రీవిష్ణులోకంబు లాలనంబు
సేయుఁబాతాళసురపదక్షితితలముల,‡నుంబళికినిచ్చుఁదనుఁగొల్చియున్న ప్రజకు

క. యోగబలంబున నతఁడీ,లాగున నానానిలింపలాఘవకరుఁడై
యాగములు సేసె సిరులుప, యోగించె నవీనశక్తి నొనరెం దనరెన్. ౪౪

ఉత్సాహ. హరునిఁ గొల్వఁ డజు భజింపఁ డంబుజాక్షు సేవకుం
జొరఁడు హోమవిధికి రాఁడు సూర్యుఁ బేరుకొనఁడు సు
స్థిరచతుర్ద్వయాంగయుక్తదివ్యయోగసిద్ధివి
స్ఫురితుఁడై నిశాటరాజు పొడవువడసెఁ గీర్తులన్. ౪౫

క. జలములు నగ్నులు నింధన, ములుఁ దక్రక్షీరదధి*సమూహమునం దే
నెలుఁ దండులములు మొదలుగఁ, గలిగించు నతండు యోగగౌరవసిద్ధిన్. ౪౬

---

*వనసీడ‡ ఒరగుమాఢా. †యుంబళి †సమూహమునం

ఉ. దానవనాథుపంపున నుదగ్ర*బలాఢ్యులు వెగ్గలంబుగా
మానిసిదిండిమూఁకలు సమస్తజగంబుల నాక్రమించి పై
మానికులన్ బలారిభవమాధవధాతలు మున్నుగాఁగ నె
చ్చో నిలుపోపనీక వెసఁ జోఁపిరి తేనియయీఁగలుంబలెన్. ౪౭

క. బొక్కలు చొఱఁబాఱిరి తము, నిక్కవలకుఁ బాపి దానవేశ్వరయోధుల్
కక్కసపెట్టిన గాలియు, †బొక్కుచు శేషాదులైనభుజగాధీశుల్. ౪౮

క. ఉర్వీవలయం బంతయు, నిర్వీరంబయ్యెఁ బ్రజలు నెళవుల కెరవై
పర్వతములఁ బాథోధుల,‡చేర్వల వసియించి రధికచింతాపరతన్. ౪౯

ఉ. లోకములెల్ల నిట్లు లతిలోకపరాక్రమవిభ్రమ†క్రమో
త్సేకధురీణుఁడై యసుర చేకొని యేలుచునుండ గాఢశో
కాకులచిత్తులై యమరు లందఱు దుగ్ధపయోధి యుత్తర
తీరకటకంబునందుఁ గడు సందడిగా గమిగూడి వాడుచున్. ౫౦

సీ. నిశ్వాసధారలు నిగుడించువారలు శిథిలమానసములఁ జివుకువారుఁ
దలయూఁచితలయూఁచి తగ్గిమ్రగ్గెడువారు ముఖకాంతులఱి ముచ్చముణుఁగు
నంతఃపురక్లేశ మరసి ఘూర్ణిలువారు శిశుదైన్యమునకునై చిముడువారు
మాటలాడఁగఁబోయి మాటతోఁపనివారు మతిలేక చేటిది మఱచువారు
బాపురే దైవమాయనిపనువువారు, నిదిమహోత్పాతమనిహుంసునెన్నువారు
నగుచు దైవతమునిసిద్ధయక్షసాధ్య,వసులుబెగడంగఁజూచి శ్రీవరుఁడుపలికె.

శా. ఓహో మీ రొకయింతసేపు నిలుఁడే నూహించి లోకత్రయ
గ్రాహిన్ దేవవిరోధిఁ ద్రుంచునయముం గావించెదన్ మీకు నే
లా హైన్యంబు వహింప యోగవిభవోల్లాసంబుచే వాని కీ
మాహాత్మ్యం బొనగూడెఁ గాక యితరు ల్మాటే మదుగ్రాసికిన్. ౫౧

క. మాయాబలమున రాక్షస, నాయకుని జయించి శంభునలినాసనమరు
న్నాయకముఖ్యులు మెచ్చఁగఁ, జేయుదుభద్రంబు సిరులుచేకుఱ మనకున్.

వ. ఆ రాక్షసుండు త్రిలోకాధ్యక్షుండై యునికి మానవమానంబున లక్షహాయ
నంబు లయ్యెఁ దదీయం బగుపుణ్యఫలం బగు నింతియ యుక్తర్కశనయ
తర్కనిపుణుండనై సర్వంబును శుభోదర్కంబు చేసెద మీరు మీవలసపట్టు
లకుం జనుం డని పచ్చపట్టుబట్టగట్టు దేవర వియచ్చరుల నుపలాలించి విమ

*బలాగ్నులు. †బుక్కుచు ‡.... ర్వలవశియించ్చి. † క్రమోచ్ఛేక.

ధరవిధివిబుధరమణులం బిలిచికొని సురగురుసమేతంబుగా నంతర్ధానంబున నవధరించి యొక్క యిక్కువ నధిష్ఠించి. ౫౪

క. భావించి కల్పతరువుల, రావిం చిట్లనియె హంసరక్షోహంసం
బావసుధాస్థలి నున్నాఁ డీవేళ జగంబులెల్ల నేలి యలసుఁడై. ౫౫

గీ. ప్రతిదినాభ్యాసనైశిత్యపటిమ నెసఁగు, యోగవిద్యయువిడనాడి భోగపరత
నున్నదై తేయుమాయచే నోర్చుపనికి, నిదియెయభిసంధి వింటిరె వృక్షపతులు

వ. మీరు మీయేనుదెఱంగులవారునుం గూడి కుతలంబున కరిగి యదృశ్యాకారంబున దానవవీరునంతరంగంబు నధిష్ఠించి యతనికి నశ్రాంతవిశ్రాణనపరాయణత్వంబు నుద్బోధింపఁ జేయుండు పొం డనిన నా*విదురువెల్లిపొదలు గదాధరుపనుపు ననుసంధించుటకునై వసుంధరకు నవతరించి దివిజారిహృదయప్రవేశంబు సేయుటయు. ౫౭

గీ. సివము పట్టినకైవడి దివిజవిమత, పరివృఢునిబుద్ధి పెటిల్లెఁ బ్రౌఢగాఢ
✓ వితరణస్ఫూర్తి కామినీవిభ్రమములఁ, గాముకునిబుద్ధి రాగంబు గ్రమ్ములీల.

సీ. బలిమి విద్వజ్జనంబుల సమారాధించి గుప్తదానములుగాఁ గొన్ని సేయు
నాచార్యగురుమిత్రయాచకావళికెల్లఁ దుదలేకతోరహాతుగ నొసంగుఁ
బేదలసాదలఁ బిలిపించి వారికోర్కికి నలుమడుఁగుగాఁ గేలికిచ్చు
యోగసిద్ధులమంచు నొకకొన్నిబూటకంబులు పన్నువారి కేప్రొద్దురాల్చు
వందిమాగధకవినటావళులనెల్లఁ, గనకవృష్టులఁ దడిపించుఁ గామినులకు
నభిమతార్థప్రదానంబు లాచరించు, వాసవారాతి వితరణోల్లాసి యగుచు.

గీ. అడుగువారు లేని యట్టి దినంబున, సురవిరోధినోరు చొరదు కూడు
వ్యసనవంతుఁ డైనవానికిఁగలుగునే, ధీరతయును నయవిచారతయును. ౬౦ ✓

క. అనుదినముఁ గరవ్రటమునం, జన మించుక తివియఁదివియ సంకీర్ణంబై
చనుగతి దానవుసిరి పలు, చన యయ్యె నసంఖ్యదానసంభావనలన్. ౬౧

సీ. వైకుంఠపురలబ్ధవైదూర్యరాసులు వైధాత్రపట్టణవజ్రమణులు
నీలకంఠావాసనీలమాణిక్యంబు లమరేంద్రువీటి ముత్యాలసరులు
గరుడకిన్నరయక్షగంధర్వనగరాబ్జరాగదళంబులు నాగనగర
మరకతంబులు మహీవరజయసంప్రాప్తగోమేధికంబులుఁ గుందనంపు
గట్టుసందలి పుష్యరాగములు జలధి, విద్రుమద్రుమఖండము ల్వెచ్చపెట్టి
పచ్చపైకంబు లేకుండెఁ బాకవిమత, విమతుఁడాలోచనములేని వెడఁగునీగి.

*(విదర)విదురువెల్లిపొద-విదురు-(రాల్చు)ఇచ్చు,వెల్లి=తెల్లని,పొద-కల్పకము.

గీ. గరుడగంధర్వకిన్నరసురకుమార, వర్గములు *మేళగాఱు కై వడి నిజాను
కూలవృత్తిఁ జరింపఁ జకోరనయన, లసురకులనాథుపట్టనంబవుడుసొచ్చి.
వ. విహారించుసమయంబున. ౨౪

సీ. ఉన్నయట్లన యుండి యూరక మధుమాస మఖిలాభిరామమై యవతరించె
వలయయానములతో మలయానిలంబులుత్రొక్కనిచోటులుద్రొక్కఁదొణఁగె
వలరాజు నెలరాజుఁ జెలికాఱుతనమున నిఖలమోహనలీల నెళవుకొనిరి
మరలఁ బ్రాయమువచ్చెఁ దరులతావితతికి మగువలకోపంపుమరులు మానె
గోఁకెహరిణినిహరిణంబుకొమ్ముచిమ్మి,చంచువునుజంచువునుగూర్చెనంచజోడు
తాపసులబ్రహ్మచర్యంబు తావుదలరె,నద్భుతోదయమగుమాధవాగమమున.

వ. అంత నొక్కకందువం బురందరప్రేషిత లగుయోష లశేషసంరంభసము
జ్జృంభితలై మురజంబులపై వైచిన బిరుదచామరంబులునుబూదండలునుట్టిన
దండియలునుబురోవీథిమెరయుమలహరులుంగలిగి వెలిహజారంబుననిండు
కొలువై యుండినదానవమండలేశ్వరుం గని యతనికనుసన్న నుచితస్థానం
బుల నాసీనలై దేవా యీవచ్చినవార మెల్ల మును నల్లనేరేడుమ్రాని
క్రింద నీడలం గ్రీడించువారలము గంధర్వులకును మాకును సంబంధగం
ధంబు గల దలఘుతరప్రచారం బగునీకీర్తిసౌరభంబు నాఘ్రాణించి శీఘ్ర
వేగంబున ద్విరేఫంబులం బోలె నేతెంచితిమి మమ్ముం గరుణించి మాయా
టపాటలు పాటింపు మని వీణియలు తాటించి. ౨౬

క. †అపాతమధురగీతక, లాపంబున శ్రుతులు దనిపి లాస్యవిలాస
శ్రీపరిపాకమునఁ ద్రిలో, కీపతిడెందంబుఁ గరఁచి కేళీపరలై. ౨౭

క. నగవులఁ జూపుల మాటలఁ, దగవులఁ గందర్పశాస్త్రదర్శనముల నా
జగదేకత్యాగికి వా, రగణితపరమానురాగ మమరించుటయున్. ౨౮

గీ. నగరులోన రొక్కనాణెంబు లేకుంట, యెఱిఁగి హంసదైత్యుఁ డిచ్చెవారి
కన్న దనియ హారకటకకేయూరకి, రీటపదకవలయకోటు లెల్ల. ౨౯

ఉ. ఇచ్చిన మెచ్చి పల్కి రసురేశ్వర యేటికి మాకు నీగి మా
వచ్చుట నిన్నుఁ గొల్చుటకు వచ్చుట యిచ్చక మింత లేదు మా
ముచ్చట దీరఁ గొన్నిదినముల్ భవదంఘ్రులు సేవచేసి నీ
నచ్చిన నాగవాసములనంటున నుండెద మన్న నాతఁడున్. ౩౦

---

*మేళగారు. †ఆపాదమధుర.

క. ఆవేళమునతో నిట్టను, భామామణులార యీగిపని యెంత సుముం
గావించి కొలువ వచ్చితి, రే మంచిది యయ్యె నిలువుఁ డిచ్చోననుచున్.

వ. వారలకుఁ బూర్త్యావశిష్టంబు లైన యష్టాపదవిశేషంబులు పరామర్శించి పేరుపేరివరుస మేలువెచ్చంబునకు నిచ్చి వియచ్చరనగరోపమంబు లగు విడుదు లొసంగిన నాకపటనటీనటఘుట లాపుటభేదనంబున నిలిచి యప్పట ప్పటికి నప్పిళితాళికి నుల్లాసంబు దెచ్చు పౌరపౌచ్చెపుటిచ్చకంబుల మెచ్చు వడయుచుఁ దోడిమ విడిచినయుర్వారుఫలంబునుంబోలె సర్వసేవకసమూ హంబునందును నిర్వాంఛితుం గావించి సేవించి రయ్యవసరంబున. ౨౨

క. మదనుని యీఆవబాణము, మదిరాకన్యకకు మేలుమానిసి యై యీ
మొదలిటివేలుపుదార సద,మదముగుఁ దుదలేనిరతుల మాపున్రేపున్. ౨౩

క. రాగాంధుఁ ద్యక్తబాంధవు, భోగాంబుధిమగ్ను నన్రపుని విడిచి నిజో
ద్యోగంబు లుడిగి వెలవెల,నై గడిసీములకుఁ జనిరి యాప్తులు హితులున్.

వ. పరివారంబునుం బరిహృతజీవితం బగుటఁ బలుదెఱంగుల నంతరంగంబులం బొక్కుచు దిక్కటకంబు లధిష్ఠించె నిట్లు. ౨౪

సీ. చివికి రూపఱిపోయె నవరత్నమయశతాంగములు వానల నెండగాలిఁదూలి
గజహయంబులు గడ్డిగాణంబు లెఱుఁగక నాఁడునాఁటికిఁ దాంటిపోఁ డిముడిగె
బంగారుప్రతిమల ప్రతివచ్చు ననవచ్చు నుడిగెంపుఁగొమ్మలు బడుగు లైరి
దండనాయకులు మిత్రములు నీతిజ్ఞులు గురువులు దిటదప్పి కొంచెపడిరి
మధుమదాయత్తుఁడై మేనుమఱచిమదిర,నంటువాయఁగనీక పుష్పాస్త్రవిశిఖ
శిఖలజంతికతోలులై నచిత్తమగల,హంసుఁడెరగొఁసియుండునయ్యవసరమున.

క. తనరాజ్య మెల్ల నీక్రియ, నను వేదుట యూడిగములయందలిజనము
ల్వినిపింప విని నిశాటుఁడు, తనమదిలోఁ దలఁచె వజ్రధరుఁ దలఁచుటయున్.

సీ. ఆకుపచ్చనిచాయ నవఘళింపెడు వేయుహాయములఁ బూనినయరదమెక్కి
ధూమావృతానలద్యోత మై స్ఫీత మై ఝుంపతో నశనిధ్వజంబు గ్రాల
హరిచందనాలిప్త మగుప్రకోష్ఠము గల పిడికిటఁ బట్టినభిదుర మమర
హారకిరీటకేయూరతులాకోటికంకణాదులకాంతి కడలుద్రొక్క
నలఁచివైచినహరిచందనంపువలపు,ప్రబలినలుదిక్కులందునుగుబులుకొనఁగ
దివ్యమాల్యాంబరాదృతిభవ్యమూర్తి, మహితగంబున కేతెంచెమఘవుఁడపుడు

క. ఏతెంచి తగినవిధమున, దైతేయాధీశుఁ గాంచి తత్పదములపై
భూతలము మ్రోవమ్రొక్కిన, నాతండ త్యాదరమున హా వలదనుచున్.

వ. ప్రత్యుత్థానం బొనరించి యాదిత్యపతిం గౌఁగిలించుకొని యాతిథ్యంబొసంగి తథ్యంబులు హితంబులు నైన వాక్యంబులు గొన్ని వక్కాణించి పిశిత భుక్కుల శ్రేష్ఠుం డిట్లనియె. ౯౦

శా. అన్నా యన్నలుఁ దమ్ము లైనమిము మున్నాక్షేపము ల్పల్కి నే నిన్నాళ్లేలితి మూఁడులోకములు మిమ్మేప్రొద్దుఁ గారించితిన్ వెన్నుం డుగ్రుఁడు నల్వయు న్ననుచుబల్వీళ్లాఁగితిన్ లోకర క్షోన్నత్యంబున కోప భోగములయం దాసక్తిఁ గొంటిం గడున్. ౯౧

గీ. ప్రాజ్ఞుఁడవు నీవు నయకళాప్రౌఢమతివి,యాబృహస్పతినీకూర్చునాశ్రితుండు తాలిగలవాఁడ వోపుదు ధరణిభుజగ,సదననాకంబులొక్కట నవదరింపు.

క. ఏకాతపవారణ మగు, లోకత్రయ మేలు మసురలోకమును మరు ల్లోకము సరిగాఁ జూడుము, నాకాప్తుఁడ వగుచు నుండు నాకాధీశా. ౯౩

గీ. అలినఁ గపటనాటకారంభనిపుణుండు, నేఁడు చిక్కె *మత్తిఁకాఁడు నాకు ననుచు వజ్రి దలఁచి హస్తాబ్జముకుళన, శాలి యగుచు దనుజపాలుఁ బలుకు.

మ. తపముల్ సేయుచు ప్రస్సిక్రస్సి విపినాంతర్వాసులై పద్మజ త్రిపురధ్వంసులచే వరంబు గొని దైతేయాఁచేఁ జచ్చిన ట్టిపలాదుల్ నినుఁ బోలఁగాఁ గలరేఁ కంటి న్వారిచందంబు నీ యపరిక్షీణపురాతపఃఫలము ల్త్రైశ్వర్య మిచ్చెం దగన్. ౯౫

గీ. ఒకని తెరువు ననక యొకని నొప్పింపక, సకలలోకములును సాధ్యపఱిచి యేలుచున్న నీదులీలావిభూతికిఁ, దలఁకి రచ్యుతాదు లలఘుచరిత. ౯౬

క. ఏనుఁగుపల్లం బేడిక, పైనుసిచిన తెఱఁగు గాదె భవదురుబాహా స్థాని సుఖమున్న రాజ్య, శ్రీనాపై నిలుపుటెల్ల జితశత్రుబలా. ౯౭

వ. అటులేని యు భవదీయచరణస్మరణంబునఁ గృతకృత్యుండనై దేవరయాన తిచ్చినప్రకారంబున నవికారవిచారుండనై సచరాచరం బగు నీజగత్త్రయం బుం బాలించెద †గ్రేడించి చనిన దనుజకుమారవర్గంబు నిసర్గస్నేహంబున రప్పించి తత్తజ్జీవితంబు లిప్పించెద మీర లిచ్ఛానురూపంబు లగువిభవకలా పంబుల నాపోవుచు నెడనెడ మదీయం బగునడవడికి వెడఁగుఁదనంబు గలి గిన నుడిగించుచు సుఖం బుండుం డని యాఖండలుం డతనిచిటికెనఁ ‡వ్రేలి కీలితమణికలాకాళకలం బగు ముద్దుటుంగరం బొసంగిన నంగీకరించి రాత్రించ

*మత్తిగాడు. †గేలించి. ‡వ్రేలంగీలితమణి.

రపంచాననునభ్యంతరంబునకుం బోవ విన్నవించి తదీయంబగు పంచానన పీఠంబున వసియించి. ౯౮

క. ఉరగుల నురగాలయమున, ధరణి నరశ్రేణి దివిఁ ద్రిదశవర్గము దోం
తరగ యథాపూర్వస్థితి, హరిహయుఁడునుచుటయు బ్రహ్మకద్భుతమయ్యెన్.

క. శూలధరుఁడేలెఁ గైలాసశైలదుర్గ, మబ్జసంభవుఁడుండె సత్యస్థలమునఁ (ను
గూర్మివైకుంఠుఁడమరెవైకుంఠమునను, దానవకృతాంతరాయములణఁగుటయు

క. యాగపురోడాశము లను, రాగంబుల నారగించి ప్రబలబలభుజా
భోగములు సూచుకొనుచు, న్వేగన్నులవేల్పుఁబోదివె విబుధశ్రేణుల్.

క. దేవవిరహితము లగుదే, వావసథస్థలము లెల్ల నహరహ మమరా
ర్చావిభవపూరితములై, భూవలయంబున కొసంగె భూరిసుఖంబుల్.

క. వాసవుకతమున విగత, త్రాసములై ముజ్జగములుఁ బ్రమదము నొందెం
గాసరసమమతి య్యగురా, కాసులగమికాఁడు మదవికారార్జితుఁడై. ౧౦౩

క. మదిరయు మదిరాదేవియు, మదనాహవతంత్రవిధికి మర్మముఁ దెలుపం
బదియైదువత్సరములా, త్రిదశారియుభోగకాంతుఁ దెమలక *యుండెన్.

సీ. అష్టావశిష్టంబు లానవా లొకకొన్ని చక్కెరపానకా లొక్కకొన్ని
పచ్చితేనెలుగాఱుఫలములొక్కకొన్ని కొన్ని దివ్యామోదకుసుమసరము
లేణమదంబును నిందుఖండంబులుఁ గలపినపూఁతపింగాండ్లు గొన్ని
యుఃహావ్వననూఁదిననుడువీథిఁదాఁకుదివ్యాంబరంబులుగొన్ని యనుముహూర్త
మును బరంపరగాఁబంపుననిమిషేంద్రుఁ,డూడిగపుఁగత్తియలచేత మేడలోనఁ
గ్రీడలాడుచునున్న యక్షీణమదన, రాగరసమత్తమతికి నారాతిసునకు.

గీ. హారములును జతుర్విధాహారభాండ, నికరములుఁబచ్చికస్తూరినికరములును
ననుచు లోనికి రాజయోగ్యంబులైన, వానిఁ దెం దేవగాఁగ దైవతవిభుండు.

గీ. విభుఁడు చెప్పినవానిలో వృత్రవైరి,దానవులకునె కడు నెగ్గుఁదలఁచుఁ గాని
నాకమునకును దక్కిన లోకములకు, నాదృతానందసౌందర్య మొందఁజేయు.

గీ. వేఁటలాడించుదుర్ద్యూతవిధులుదెలుపుఁ,గామశాస్త్రరహస్యసంగతులుగఱపుఁ
గానినీతికిఁ జొరనీఁడు దానవేంద్రుఁ,గూల్పఁబొంచి వసించిన కులిశపాణి.

వ. అంతఁ గొంతకాలంబు చన్నపిమ్మట మరుత్కాంతుం డేకాంతంబునకుశాం
బరి నాకర్షించి మహామాయా నీవు మాయనుమతంబున నంతిపురంబునకుం
జనిమదిరాకన్యకనయ్యన్యాయవర్తికడం బ్రవర్తింపనీకతొలంగిదూరంబు †సనఁ

*యుండ్డనూ. †సని.

దన వెంబడిం జనుదెంచిన యాక్రించుడెందంబుఁ బ్రవేశించు మనినొడివిన నప్పుడంతియు వేల్పుమెఱియని వీడుకొని క్రీడాభవనంబు సొచ్చి వియచ్చర పతి తన్నుం బనిచినపని సఫలంబు గావించుటయు. ౧౦౯

ఉ. నోరును నోరుఁ గీల్కొనఁ దనూలతయుం దను*వల్లిబిల్లియై
కూరిచినట్లు లుండఁ దలగోక యెఱుంగక పుష్పబాణుపె
న్బోరున సీధుపానమున బుద్ధివిదూరత నిద్రవోవు ర
క్షోరమణుం ద్యజించి జరగున్మదిరాంగన సంగదూరయై. ౧౧౦

గీ. ధనము రాజ్యంబుఁ దనకొఱకు నెత్యజించి, మాఱునేఁత లెఱుంగక మార్తురకును బ్రియము చెప్పి చరించునాప్రియుని బాసె, మదిర పాతకముల కెల్లఁ గుదురు చెలువ

క. దానవుఁడు మేలుకని మది, రానీరజవదన గానరామి కులికి నా
నానిలయాంతరములకుం, దానె యరిగి వెదకు హృదయతాపముతోడన్.

క. వచ్చినచోటికిఁ గ్రమ్మఱి, వచ్చుం బూఁదోట సూచ్చి వచ్చుఁ బ్రియముతో
నెచ్చెలులనడుగునడుగుల, మచ్చమరయు నొఱలుఁ దెరలు మలఁగుంగలఁగున్.

వ. ఇవ్విధంబున నవ్విబుధారి వధూవియోగ ధూమధ్వజదందహ్యమానమాన సుండై యానిశాసమయంబున నసమనయనకఠోరకంఠకుహరఘటితహాలా హాలఘుటికాచటులం బగుకటికిచీఁకటిని నిశాచరుం డగుటను నిర్భయుం డగుటను నెఱి దప్పక గుప్పునం బ్రాకారలంఘనం బాచరించి చరాచర విలోచనభయద జ్వాలాకరాళం బగుకరవాలంబు దక్షిణకరంబునం జళిపించుచు విలపించుచు నుత్తరాభిముఖుండై తత్తనూసౌరభంబు పులుగునొడువఁ గడువడి నడువం జొచ్చె నిచ్చట, ౧౧౪

క. మానవతి దలఁగి పోకయు, దానవుఁ డట చనినవిధముఁ దా నెఱిఁగి మహా
సేనలతో వెన్నాడె బ,లానలజలధరము ప్రహసితాననుఁ డగుచున్. ౧౧౫

మ. చరణాంభోరుహయావకాంకములు భూషాస్రస్తమాణిక్యముల్
తరులగ్నాంశుకఖండముల్ పథిలుఠద్ధమ్మిల్లమాల్యంబులున్
సరసాంగచ్యుతగంధకర్దమ మలోలస్వేదసౌరభ్యముల్
తరుణీరత్నము చన్నత్రోవఁ దెలిపెన్ దైత్యాన్వయస్వామికిన్. ౧౧౬

క. †విఘటికలోపల సురపుర, విఘటనలంపటుఁడు గాంచె విమలతరసుధా
లఘుజల మధరీకృతపం, కఘనము మానససరశ్శిఖాశేఖరమున్. ౧౧౭

సీ. వినవచ్చె దవ్వుల వెక్కి వెక్కి యొనర్చు పరిదేవనధ్వని పాటపాట
నావిలాపములోన హా దైవమా యను విధ్యుపాలంభనవిధము దోఁచె

---

*వల్లిబిల్లి †విఘటిక.

నాదూఱుమాటలయంతరాంతరములఁ బొడకట్టి హంసుఁ దా విడిచిరాక
తత్తదుక్తులఁ విఱుందన హంసుఁ డీఁక నేమియూనొకోయనుమృషాహ్లాదభాష
లెసఁగనెంతయునాలించియసురభర్త, కంటిఁగలకంఠిననుచునుత్కంఠ మెఱయ
నుట్టిపడట్టు చెట్టుననుండి దిగిన, కరణి నయ్యింతియగ్రభాగమున నిలిచి.

క. వెఱవకు మిఁక నే వచ్చితిఁ, దెఱవా నెఱవాఁడిసూది దెగిపాఱని యీ
కఱకుంజీఁకటి వచ్చిన, కఱటివి నిను దూఱ మాకుఁ గలవే ఫలముల్.

ఉ. రమ్మని చెట్ట వట్టుకొని రాజముఖిన్ గురివెందతీఁగ మొ
త్తమ్ములయింటిలోపలికిఁ దారిచి కూరుచుమాటలాడి నె
య్యమ్మునఁ గౌఁగిలించుటయు నాసుదతీతిలకంబు పల్కె ఖే
దమ్మునఁ దల్లడిల్లెడువిధంబు ప్రవృద్ధము చేయుచుం బతిన్. ౧౨౦

మ. వినవయ్యా దనుజాధినాథ త్రిజగద్వీరా నినుం గూడి నా
యనుజవ్రాతముఁ దల్లిఁ దండ్రిని వయస్యాకోటులం బాసి కం
తునిశాతాశుగతప్తచిత్త నగుచుం దొట్రిల్లు చెల్లన్ ఫలిం
చె ననుం జంపఁ గడంగినాఁ డఁట సునాసీరుండు క్రూరోద్ధతిన్. ౧౨౧

వ. తత్ప్రేషిత యగునొక్కరోష నిజభూషావిశేషమరీచిగండూషితాజాండ
మండలంబుగ మనక్రీడించుమేడకు వచ్చి మీరు విచ్చలవిడి నిద్రించువేళ
ననుం గనలి చూచుచు నోమచ్చెకంటి నీ విచ్చట నునికి వియచ్చరపతియి
చ్ఛకు వైరస్యకారి దూరంబు చనుము చనకున్న నిన్నుం దునుకలు సేసి "నీ
కతంబున నపాకృతరాజ్యభారుం డగుదానవవీరు నుదారోత్సవంబులఁ ద్రిజగ
త్సామ్రాజ్యపూజ్యుం జేయు"నిదినిక్కంబ యని చక్కం జాగిపోవుటయుఁ
గపటనాటకసూత్రధారుం డగుజంభారిసంరంభంబునకుం గలంగితిం గాక
నీకిచ్చినప్రాణంబు నొండుకడం జొనుపుదునే వినుము. ౧౨౨

క. సురనాథుతోడ వలవని, విరసత మన కేల నీడు విమలతరహృదం
తరమందిరదీపికనై, పొరయింతు నపారసౌఖ్యములు ముఖ్యగతిన్. ౧౨౩

వ. నీవు ప్రాణాయామపరుండ వగుము పవనపరంపరాప్రవాహసోపానంబులు
మెట్టి నీడెందంపుం గందువకుం జని యనిమిషపతికిం గన వశంబు గాక
యశోకానందంబు నొందెద ననుటయు నాకుటిలకుంతలసట లెఱుంగక
నిశాటపతి తద్వచనప్రకారం బాచరించుటయు. ౧౨౪

---

"...* ఈచోట నేదో కొంతలోపించియుండును.

క. మదిరాకన్యక హంసుని, హృదయంబున నిలిచె సురమహీధరగుహాలో
మదభుజగయువతి క్రమ్మరు, విధమున లుబ్ధప్రసక్త విత్తములీలన్. ౧౨౪

క. హృదయము చొచ్చిన మదిరా, మదచేష్టలచేత మేను మఱచి ప్రబోధా
భ్యుదయరవిగ్రుంక హంసుఁడు, నిదురయుఁ బోఁజొచ్చె నిట్టనిల్గుచునచటన్.

క. కొండంత మేను బూడిద, పండుగ నిలఁ బొరలిపొరలి ప్రబలనిజభుజా
దండము తలగడగా నా, ఖండలరాజ్యాపహర్త కడు నిద్రించున్. ౧౨౬

క. నిద్రాసమయంబున నా, యుద్రిక్తస్వాంతుఁ డిచ్చునూర్పులవడి సా
ముద్రజలంబులు ఘూర్ణిలు, నద్రులు గంపించు ధరణి యట్టిట్టు వడున్. ౧౨౭

క. మును వెన్నాడినసురపతి, యును నచటికి వచ్చి వానియునికిఁ గని మనం
బున నలరియు బెగడెఁ దడు, గ్ర నిబిడనిశ్వాసపాతకంపితబలుఁడై. ౧౨౮

గీ. వజ్ర వేసెఁ దనదువజ్రంబు దైత్యేంద్రు, మేనుగొండఁదునిమి మెఱయుఁదలఁచి
యదియు దానవేంద్రుఁడొదవించునిశ్వాస, మారుతాభిహతులమ్రానుపడియె.

క. ఆచంద మెఱిఁగి ఫాలవి, లోచనజలజాతపత్రలోచనివాణీ
లోచనచకోరచంద్రులు, వాచాలము లైన దివిజవర్గంబులతోన్. ౧౩౦

వ. అచ్చటికి వచ్చి మచ్చరంబున నవ్వియచ్చరపరిపంథిపై శూలచక్రదండం
బులు ప్రయోగించిన నవి యవిరళవేగంబున నయోగ్యాగవిద్యావిదుం
డాఁకి కాఁక యుడిగి శిరీషప్రసవమృదులప్రసారంబు లగుట యుఁ ద్రిజగం
బులు విన్ననయ్యె యోగానలతప్తంబు నుత్తప్తసువర్ణవర్ణంబు నగునతని
యంగంబున ఖంగుఖంగు మనునినదంబుల కాని సప్తధాతువులుం బాఁతు
కలంగుట కానంబడదయ్యె నయ్యెడ. ౧౩౨

క. లోకత్రయవిజ్ఞానక, ళాకుశలుం డైనయాదిలక్ష్మీపతి తీ
వ్రాకారు వాయువుం గని, క్రేకంటం జేరఁ బిలిచి కృపవెట్టుటయున్. ౧౩౩

వ. అతండు సాష్టాంగనమస్కృతిచతురుం డై పుండరీకాక్షునకి ట్లనియె. ౧౩౪

గీ. దేవ పనిగొమ్ము నాకు నీసేవకునకు, నేఁడు ఫలియించెఁ దపములు నీరజాక్షు
యెద్ది పనిచినఁ గావింతు నెదురులేని, క్రీడనంబున విహరింతుఁ గీర్తిఁ గాంతు.

చ. అన హరి వల్కె నోపవన యంతటివాఁడవ నీవు యోగసి
ద్ధి నితని మేను నొవ్వదు మదీయసుదర్శనతీక్ష్ణధారచే
మనసిజవైరిశూలమును మాటుమణంగె నిరించిదండము
న్వనట మునింగెఁ జేవ్వడియె వాసవువజ్రము కంటివే కదా. ౧౩౬

వ. ఉపాయంబునం గాని యపాయకరం బగునీసురారిశరీరంబుచిరుంగడు మెఱుం
గు మెఱచి యడంగు తెఱుంగున నీ వితనియంతర్గంగంబు సొచ్చి మర్మంబులు

గ్రొచ్చి సంధులు బంధించి పలుకులు వాకట్టి బలంబు వోఁదట్టి *ద్వితీయ భంగిం జేయు మనిన నతండు నట్లచేసె ననురేశ్వరుండును ననువిదూరుం డయ్యెఁ గావునఁ బగవారిం గలసి వర్తించుతుచ్ఛవర్తనుం డపకీర్తి రాకకు నైశ్వ ర్యంబు పోకకు నెదురుకొని యుండుం గావున. ౧౩౭

గీ. †హంసునంతవాని కత్తెఱం గైనచో, నితరదనుజకోటి నెన్న నేల
మీఁదు దెలిసి వేల్పు మేలాటములు మాని, నిలుపవయ్య కీర్తి నిలుపవయ్య.

గీ. తండ్రిఁ జంపినపగవాని దానవేంద్ర, నమ్మకుము తక్కురాజుల నమ్మరాదు
కృత్య మంతయు మాయందగేలుకొనఁగఁ, జేయునీకు నభీష్టంబు సేయువాఁడ.

:—— ప్రహ్లాదుఁడు దేవతలపై విరోధించుట. ——:

క. అని పలికినఁ బ్రహ్లాదుఁడు, తనమది దేవతల మీఁదితలఁ పుడిగి సుధా
శనవిమతమతము గైకొని, పెనిచె విరోధంబు సాధుబృందము మీఁదన్.

సీ. నిప్పచ్చరం బయ్యె నిర్జరేశానక్తి పావకుచేపట్టు పట్టు వదలె
శమనంబుఁగనియెఁదచ్ఛమను మీఁదితలంపుకోణపుపక్షంబు గుంటువడియెఁ
బాశపాణిప్రీతి పలుచన యై తోఁచె గాలిపై నెయ్యంబు ‡తీలు వడియె
ధనదానురాగంబు దవ్వులఁ దలచూపె శంకరప్రణయంబు క్రుంకువడియెఁ
దాపసుల మీఁదితగులంబుతఱిఁగ వైష్ణ, వాగమంబులతరితీపు బాగుదప్పెఁ
గుటిలదానవనిర్దిష్టకుత్సితప్ర, చారపారగుఁ డైనదేవారి కపుడు. ౧౪౧

క. కరుణార్ద్రవీక్షణుం డై, హిరణ్యకశిపుప్రసూతి యేకాంతమునం
బరమాప్తు లై నరాక్షస, పరివృఢులం బలికె వినయపరిచితఫణితిన్. ౧౪౨

క. పెద్దతికంబున మును మా, పెద్దలకును వేల్పుకులము పెద్దలకు మహో
దృద్ధాంతి శాంతికర మగు, నిద్దపునీపలుకు మాననీయము గాదే. ౧౪౩

సీ. సంవర్తసమయభీషణవజ్రవజ్రాభఘోష మై పటుహాయహేష మగుచు
సప్తానిలవ్యంధసంధిబంధవిభేదవేగ మై నిర్భరోద్వేగ మగుచు
ఫాలలోచనఫాలఫలకకీలివిశాలతేజ మై శౌర్యనిర్వ్యాజ మగుచు
శమనకటాక్షవీక్షణపాతసన్నాహఘోర మై యాయుధోదార మగుచు
నాదుమూలబలంబు నానాదిగంత, రాళముల వేసపాటి యుత్తాల మైన
నేమి సేయంగ నోపుదు రెంతవారు, నాదివామననిభ వామనాభిధాన.

గీ. నిప్పుమీఁది నివుఱుకప్పెల్ల నొయ్య నే,పార నూఁది యూఁది ప్రజ్వలితము
చేయు హాని యునఁగఁ జిక్కులన్నియుఁ ||బాపి, నామనంబు దేర్చితో మహాత్మ.

---

*ద్వితీయ్యభృంగ్గిం. †హంసుఁడంతవాని. ‡తీలిపడియె. ||బాశి.

క. *ఎఱుఁగనికాలంబున నే, నెఱుఁగక దుర్బుద్ధి నైతి నెఱిఁగినతఱి మీ
ఱెఱుకపడఁ దెల్పినప్పుడ, మఱి యెఱుఁగకయునికి గలదె మాన్యవిచారా.

క. గెలిచెద భూమీవలయము, గెలిచెద బలిసద్మతలము గెలిచెద దివియున్
గెలు పనఁగ నెంత యుద్య, ద్బలు లగుమీప్రాపు గన్న బలవంతులకున్.

—: ప్రహ్లాదుఁడు శ్రీవిష్ణువుపై దాడివెడలుట. :—

క. ఆయుధములు కంకటములు, నాయిత్తముచేసి దండయాత్రకు మీమీ
దాయాదులఁ గూరిచికొని, వేయరుగుఁడు సకలదిశల వెంబడి మీరల్ ౧౪౯

సీ. అని రాక్షసకుమారుఁ డర్వాగుణంబులు విడిచి దుర్జనబుద్ధి వివశుఁ డగుచుఁ
దామసవిక్రియాస్థగితచేతస్కుఁడై యాఁగాము లెఱుఁగక యవఘళించి
త్రిజగత్కుటుంబియై దీపించుగోపాలదేవునిపై వైరదృష్టి నిలిపి
తనతండ్రిఁ బట్టి చంపినపగ యీఁగుదు నీఁగకుండిన నన్ను నీఁగ యనరె
యనుచు శ్రీహరితనువులై యతిశయిల్లు, విప్రులకు ధేనువులకును వేదములకుఁ
బుణ్యతీర్థంబులకు నెగుల్పొడమఁ జేసె, జన్యజనకంబు లేకలక్షణము లరయ.

వ. ఇట్లాహ్లాదభరితాంతఃకరణుండై ప్రహ్లాదుండు వామనుపలుకులయెడ సాద
రుం డగుచుఁ దత్సహితంబుగ నమరాహితులం దమతమయిండ్లకుం బోవం
బనిచి యనుదినప్రవర్ధమానస్వార్థానిర్ధాతప్రణయహృదయుండై †యయ్యుద
యుండు జగత్త్రయగిళనోత్సాహంబున నుత్సేకంబు గైకొని యుండి యుండి
యొక్కనాఁడు. ౧౫౦

సీ. తొడిమలూడిన జరద్ద్రుమపుష్పములు వోలెఁ జదలఁ దారలు జలజలన రాలఁ
గ్రొత్తమెత్తిన యార్ద్రకుడ్యరేఖలువోలెఁ జేఁటెత్తి దిక్కుల బీఁట లెగయ
సమ్మెట నడిచిన సంతప్తలోహపిండమువోలె మిణుఁగుఱు లుమియఁ దరణి
ధరణి పల్లాఱుఁ గుమ్మరిసారెయును బోలె గిరగిర నుడుగక తిరువుగొనఁగ
గిరులు గోలాటమాడ నయ్యురగలోక, మురక వ్రేళ్లకుఁ బెకలంగఁగఱకుటసుర
సమరసంరంభియై భేరిచఱవఁ జేయు, నందుఁగ్రందయ్యెభాంకారకందళములు.

సీ. అశ్వరక్షకులార హయరత్నముల నెల్లఁ బల్లనకట్టుఁడీ పాటవమున
మావంతులార సంభ్రాళించి ఘనపతాకంబు లెత్తుఁడు మత్తకరులమీఁద
సారథులార శస్త్రధ్వజంబులతోడ మెలవుఁడీ రథము లచ్చలము మిగుల
భటులార కదలుఁడీచటులకార్ముకలతాజ్యాఘోషములు నభఃస్థలముక్రింగఁ
ద్రిభువనాభీలభుజశక్తివిభవ మెసఁగ, దండయాత్రాభిముఖుఁడయ్యెదనుజభర్త
యనుచు ఘోషించి†రిభమునందధివసించి, రాజపురుషులుఘంటికారావ మెసఁగ.

---

*యెఱిగినకాలంబున. †నెయ్యెదయుండై. *రిభవమంద్దధివశించ్చి

సీ. వింధ్యశైలమునందు వెడలునేనుంగులు నివియు నేమవునొకో యెన్నిచూడ
శాలిహోత్రునియందు జనియించునశ్వంబు లివియు నేమవునొకో యెన్నిచూడ
మరుదీశవిశ్వకర్తకుఁ బుట్టునరదంబు లివియు నే మవునొకో. యెన్నిచూడ
*స్రష్టప్రాథమికమహాసృష్టినుద్భవమొందు నివియు నేమవునొకో యెన్నిచూడ
ననఁగనిభములుఁ దురగంబు లరదములును, గాల్బలంబులు వెడలెనొక్కటఁ గఠోర
భుజబలాటోపమున దైత్యపుత్త్రుఁ డఖిల, దిగ్విజయయాత్ర సేయంగఁ దివురునపుడు

సీ. విభునిఁ బాయఁగలేక వెనువెంటదంటలై యరుగ నుద్యోగించునట్టివారు
పైచేలఁ గొంగేలఁ బట్టి పోవఁగనీక ప్రాణనాథుల నొడంబఱుచువారు
గద్గదస్వరములఁ గన్నీరు వెడలంగఁ బతులఁ బోఁజన దని పనువువారుఁ
మోహంబుసిగ్గునుముడివడఁ బ్రియులయొద్దనెనిల్చి తలవాల్చుకొనెడువారుఁ
గూర్మిభర్తల దీవించి కుంకుమాంక, తలు శిరంబులపైఁ గీలుకొలుపువారు
నగుచుఁ దత్పురవీరనాయకులసతులు, విరహసంతాపతప్తలై వెల్లనైరి. ౧౫౪

చ. ఎడపక పార్శ్వభాగముల హెగ్గడికత్తెలు వేత్రహస్తలై
నుడియఁగనీక పౌరగతిఁ జోఁపుచు నర్మవచోవిలాసముల్
†నడుపుడుఁ గప్పసందులు దొలంగ జనావళిఁ బ్రేమఁ జూచుచు
న్వెడలిరి రాజభోగినులు వేడుకతో శిబికాధిరూఢలై. ౧౫౫

గ. అలయికఁ బోలెఁ బూర్వవిటహస్తము లూఁతగఁ బట్టి కేటలా
బులుపులమాటలుం జిలుకబోదల నేలుకలస్వరంబులుం
దలకొను లేఁతజంకెనల దట్టపుఁజూపుల నేపు చూపుచున్
వలపులు చల్లుచుం బురమువారసతుల్ చనఁ జొచ్చి రచ్చటన్. ౧౫౬

వ. మఱియుఁ జర్మకారలోహకారస్వర్ణకారయంత్రకారకులును భిషక్పురోహిత
జ్యోతిషికామాత్యవర్గంబులు ను గవిభటపాఠకపటలంబు ను ధాన్యవస్త్ర
హిరణ్యరత్నముక్తాప్రవాళగుడతైలాజ్యతండులముద్గచణకహింగుమరీచ్యాది
పదార్థసార్థక్రయవిక్రయాది వ్యవహారప్రాజ్ఞులైన వణిగ్జనంబులును మొద
లుగాఁ గలపౌరలోకంబు నిరాకులప్రమదంబునఁ జనుచుండ రప్పు డప్పురి
శాసనులు సమరసన్నాహసమన్వితులై. ౧౫౭

మ. మదిరాపానమదాంధనేత్రములతో మత్తద్విపారూఢుఁడై
విదితానేకపసంయుతుం డగుచు విద్విడ్భూపతుల్ భీతి నొం

---

*ఈచరణములోఁ గాల్బలముపేరు కనఁబడదు. †నడుపుచు

ద దివిజ దేవగణంబు లెల్ల వణఁకన్ ధారాధరాకారుఁ డై
కదలె న్వృశ్చికరోముఁ డుగ్రవిచరత్తీవ్యాఘ్రయూథంబుతోన్. ౧౫౮

ఉ. భూరిబలప్రతాపములఁ బొంపిరివోవుచు శూలహస్తుఁడై
హారిసువర్ణవర్ణము శతాంగమున స్వాలసిల్లి గాఢసం
చారఘనాఘనధ్వనులచందముఁ జూపెడు బృంహితంబు లిం
పారుమతంగసంభవసహస్రము గొల్వఁ జనె న్బలీంద్రుఁడున్. ౧౫౯

ఉ. అక్షయధైర్యసంపదయు నద్భుతశౌర్యము నింపుమీఱఁగా
రాక్షసకోటి గొల్వ మదరాగము మోమున నిండ నాసహ
స్రాక్షసరోరుహాక్షనిటలాక్షుల గెల్చిన మేటిజోదు ధూ
మ్రాక్షుఁడు పోరికి న్వెడలె నద్రినిభద్విపవాహనంబుతోఁ. ౧౬౦

క. కౌక్షేయపాణియై కపిలాక్షుఁడు చనఁదొడఁగె క్షోణి యల్లాడంగా
నక్షతబలమున నార్వే,లక్షౌణము లైనహయము లాగుబ్బుకొనన్. ౧౬౧

ఉ. కంకటముల్ ధరించి శరకాండధనుర్ధరులై కిరీటులై
కంకటకాలకేయు లవికారరణోత్సవమత్సరోగ్రులై
యంకముఁ గోరి యేగిరి భయంకరశంఖరవంబు దివ్యకూ
లంకషఁ గ్రీడలాడునబలాజనముం దలఁకొందఁ జేయఁగన్. ౧౬౨

సీ. దిగ్గజంబులఁ బట్టి తివియంగఁ బోనూకఁ జాలినమదసామజములతోడఁ
బవమానవేగంబు నవమానముగఁ జూచి పరఁగు నాజానేయహరులతోడఁ
గేతనానిలసమాకృష్టతారకములౌ రమణీయరత్నరథములతోడ
నఖిలాండకోటుల నఱచేతికిని దెచ్చు చటులరాక్షసవీరభటులతోడ (దఁ
విమలముక్తామయాతపత్రములతోడఁ, గమియఁబొదివినవింజామరములతో
గ్రాలదంష్ట్రుండు రథమెక్కి కదలె దిగ్వి, జయమనీషావిశేషవిశాలుఁడగుచు.

ఉ. శంబరదీర్ఘజిహ్వులు విశంకటకంకటగర్భితాంగులై
కంబుమృదంగగోవదనకాహళకాంస్యరవంబు లేకమై
యంబుధినీటు దాఁటుగొన నాజికి నేగిరి రాజమార్గమ
ధ్యంబు తురంగచంక్రమణధారలఁ జూర్ణముగాఁగఁ జేయుచున్. ౧౬౪

క. వికటబలశూర్పకర్ణులు, ప్రకటబలోపేతు లగుచు భద్రేభశతా
ధికషట్సహస్రములతో, వికసితవదనాబ్జు లగుచు వెడలిరి యనికిన్. ౧౬౫

వ. ఇవ్విధంబుననధికబలపరాక్రమవిధేయులగు యాతుధానవీరు లుదారాకారు
లై చతుర్విధశృంగారభంగీతరంగితనిజాంతరంగు లై సంగరరంగంబునకు వెడల

నంగలించు రాక్షసపుంగవు నాగమనంబుఁ గోరుచు హజారంబుకడం బవ్వు
జుఁ దీర్చిరంత. ౧౬౬

సీ. వరరత్నకుండలద్వయరత్నదీధితి గండస్థలంబులఁ గప్పుకొనఁగ
నంగుళీయకకిరీటాంగదహారాది భూషణంబులతోడఁ బొలుపుమీఱి
పింజించికట్టిన కెంజాయవలిపంబు మొలనూలికాంతులముసుఁగుఁ దివియఁ
గర్పూరకుంకుమాగరుదర్పసారాంకమృగనాభిపంకంబు మేఁ దలిర్ప
బిరుదులందియ వలకాలమొరయుచుండ, నలిననయనలునీరాజనంబులొసఁగ
దిగ్విజయయాత్రపైనముద్రేకమొదవఁ, బ్రోదిఁబ్రహ్లాదుఁడాహ్లాదపూర్ణుఁడయ్యె

సీ. కంకణక్రేంకారసంకులంబుగఁ జేరి రమణులు వింజామరములు వీవ
బంగారుగుదియలు పట్టి పొంగారుచుఁ గంచుకివ్రాతంబు *గజిబిజింప
మురజభేరీశంఖనిరుపమధ్వానంబు పాథోధిఘోషంబుఁ బరిహసింప
సంగీతవిద్యావిశారదగాయకస్తుతులు పార్శ్వములందుఁ దోడుసూపఁ
జిత్రపల్యంకికాసమాసీనుఁ డగుచు, ధవళముక్తాతపత్రశతంబుతోడ
రాజబింబాస్య లాచారలాజలొలుక, సురవిరోధిసుతుం డంతిపురము వెడలె.

వ. ఇట్లు ప్రహ్లాదుండు నిజపురంబు వెలువడి నలుదెఱంగుల దళంబులు బెడంగు
మెఱయఁ జనునప్పుడు ధూమ్రాక్షకపిలాక్షాది రక్షోమంత్రులు తమతమ
సేనాతంత్రంబులతోడఁ గూడి యుద్ధానవచూడామణిం బురస్కరించుకొని
తిరస్కృతదిగంతదంతిదంతనైశిత్యం బగు భుజబలంబున జిగిమీఱి యొక
యోజనమాత్రం బరిగి రంత నమరాంతకుండు హేమనగర ప్రాంతమునఁ
బుష్పసరోవరతీరంబున నఖిలబలంబులును విడియ నేమించి యొక్కసుర
పున్నాగమూలంబున విశాలం బగు రత్నకంబళంబునం దాసీనుం డై యున్న
సమయంబున. ౧౬౭

సీ. క్రయసమాగతజనప్రియవస్తువిస్తీర్ణవిశిఖాశతంబులు విశదపఱిచి
హేమకూటంబుతో నెక్కసక్కెంబాడుపటమండపంబు లావటముచేసి
గజఘటకోటి నొక్కట నీరుద్రావించి కట్టుఁగంబంబుల మట్టుపఱిచి
పసిఁడిపక్కెరలతోఁ బల్యాణములు డించి శ్రమముమానిచితురంగములఁగట్టి
రథవినిక్షిప్తవివిధశస్త్రములు దెచ్చి, కదియ నొక్కొకతావునఁ బదిలపఱిచి
రఖిలసైనికు లధిపతి యానఁ నంగ, సేన విడియించి రింగితజ్ఞాను లగుచు.

*గజభజింప.

గీ. అసురనందను దోఃప్రతాపాగ్నిశిఖల, వెట్ట కోర్వఁగఁ జాలక* తొట్టగిలుచు
నపరవారిధిజలమగ్నుఁ డయ్యె ననఁగ, నస్తమించె దివాకరుం డంతలోన.

క. హరిణాక్షీనయనద్యుతి, హరిమణిదళదుత్పలప్రియంభావుకభా
స్వరనైల్యగుణము లన్నియుఁ, బరువడి సుగమార్గమహిమఁ బాటింపంగన్

క. మూసినయద్దంబులక్రియ, గాసిల్లెన్ హరిదిభేంద్రకటభాగంబుల్
వాసి వదలి నలువయు సం, త్రాసంబున బుద్ధి గలఁగి తహతహనొందెన్.

క. మొక మడిచినఁ గానఁగలే, కొకవస్తువు నిట్టి దనఁగ నోడిరి లోకుల్
శకలితహరిహయమణికో, రకములలో నణఁగి రనఁగ రాత్రిటివేళన్.

సీ. హేషారవంబులు నెఱుఁగంగఁ దగుఁ గాని తురగరూపంబులు తోఁపవయ్యె
విపులఘీంకారము ధ్వనితో లంగుటె కాని తెలియంగ రావయ్యెఁ గలభఘటలు
చక్రనేమీరవ† ప్రక్రమంబునె కాని తిలకింపరా దయ్యెఁ ‡దేరిపిండు
స్వరమున భటుని పేరరయుమాత్రమె కాని దర్శనస్పర్శనస్థైర్య ముడిగె

దృష్టిగోచర మెల్ల నదృష్టమయ్యె, మిన్ను మన్నును గోవెలవన్నె యయ్యెఁ
గరవటమునిండ నించినకజ్జలంబు, కరణిఁ జీఁకటి బ్రహ్మాండఘటము నిండె.

క. ఆపంబినతిమిరంబు ప్ర, తాపంబున సకలభువనదర్శన మాఁగన్
దీపస్తంభము లెత్తిరి, యాపటమండపములందు నసురేంద్రభటుల్. ౧౭౫

సీ. కరచపేటంబుల గాఢాంధకారసింధురకుంభములు వ్రచ్చి విరియఁ జేసి
తారకామిషమునఁ దన్మౌక్తికంబులు పలుదిక్కులందునఁ బాఱఁజల్లి
కాఱు తద్దేహరక్తముచాయ నవసాంధ్యరాగవిలాసంబుఁ బ్రోగుచేసి
తద్వధదోషంబు తగిలెనో యనమేన మృగచిహ్నగరిమంబుఁ దగులుకొలిపి
నిగిడెఁ గర్పూరపూరపన్నీరనీర, హారనీహారహారిచంద్రాతపములు
వసుమతీచక్రమఖిలంబు వాడుఁ దేర్పఁ, గైరవప్రియబింబప్రకాశమహిమ.

క. ఈకరణిఁ జంద్రికాపరి, పాకము లోకముల కెల్లఁ బరమానందో
త్సేకంబు సేయ దానవ, లోకాధీశ్వరుఁడు మిత్రులును దా నలరెన్.

వ. ఆసమయంబున సూచీముఖశూర్పకర్ణవికటధూమ్రాక్షకపిలాక్షులు మొదలై
కదలక యేప్రొద్దుం దన్నుం గొలిచి యున్న యన్నిర్జరారులం గనుంగొని
ప్రహ్లాదుం డిట్లనియె.

ఉ. ముందటికార్య మెద్ది మనముం జతురంగబలాన్వితంబుగా
నిందుల కేగుదెంచితి ముదీర్ణులు మీరలు కర్ణధారులై



*తొట్రగిలుచు. †ప్రక్రమంబ్బయె. ‡తేరుమిండు.

సందడి గాకయుండ రిపుసైన్యపయోనిధిలంఘనక్రియా
మందతఁ జూపఁగావలయు మానుషభీషణభావణోద్ధతిన్. ౧౮౦

గీ. ఎటకు నడువవలయు నిది మీరు తలపోసి, సర్వసమ్మతముగఁ జర్చచేసి
నిర్ణయింపవలయు నీతిశాస్త్రవివేక, శౌర్యనిధులు సఫలకార్యవిదులు.

వ. అని యిట్లు ప్రహ్లాదుండు పలికిన మహాహ్లాదంబునుం బొందిబృందారకవిరోధులతని నభినందించి దేవా నరేశ్వరుం డగువాఁడు హస్త్యశ్వరథపదాతి ప్రముఖ సకలసేనాసమన్వితంబుగా స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలంబు లను సప్తాంగంబులుం గలిగి సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబు లనం బరఁగు షట్ప్రయోగంబులఁ గుశలుం డై సామదానభేదదండంబు లను నుపాయంబులుం దత్ప్రయోగసమయంబు నెఱింగి చతుర్విధదుర్గావనభర్గుండై నిజరాజ్యంబు నిష్కంటకంబుగం బాలించి మేలెంచునది యాకర్ణింపు మనుటయు నా త్రిలోకవినుతుండు వారలవాక్యంబులంగీకరించి సంగరోద్యోగవినిర్నిద్రహృదయుండై వారలఁ బోవం బనిచి తాను యథోచితప్రకారంబున నా రాత్రి గడపె నప్పుడు. ౧౮౨

మ. రజనీపన్నగదష్టమూర్ఛితజగద్రక్షార్థమై పూని పం
కజమిత్రుం డను తుండికుండు దశదిగ్భాగాంతరానోకహ
ద్విజకోలాహలమంత్రము ల్నుడువుచు న్వేగంబ మంత్రింప ని
ల్చె జలేశాంతరపూర్వభూధరమహాశృంగాగ్రపీఠంబునన్. ౧౮౩

—: ప్రహ్లాదుఁ డంగరాజుపై దాడివెడలుట. :—

సీ. అట్లు సూర్యోదయం బైనఁ బ్రహ్లాదుండు జయభేరి వేయించి చండవృత్తిఁ
దురగేభరథపదాతులతోడ దైతేయభటసమూహము మహోత్కటముగాఁగ
విజయుఁడై సర్వదిగ్విజయంబు సేయంగఁ బూని మహేంద్రదిగ్భూమిపాల
పురములకై దాడివోవ నుద్యోగించి కదలి యాత్రేయనగంబునందు (లోన
విడిసి మఱునాఁడు శత్రుభూవిభులు వడఁక, నంగదేశాభిముఖుఁడయ్యె నంత
నంగభూపతి గజతురంగాదిసైన్య, సంయుతంబుగ నేతెంచె శౌర్యగరిమ.

క. కరితురగరథభటాహ్వయ, పరివృతుఁడై బాహుయుగము పక్షయుగముగా
శరచంచునిహతిఁ జించెన్, శరభము క్రియ నంగవిభుఁడు శత్రుబలంబున్.

క. అంతం బోవక మఱియును, బంతంబున దైత్యబలముఁ బవనాస్త్రహతిన్
గంతులు వేయించె మహీ, కాంతుఁడు విలయానిలంబు కనకాద్రి బలెన్.

గీ. అంగభూపతి యిట్లు నిజాంగబలము, చెంగఁ దోలిన దానవపుంగవుండు
రోషభీషణమూర్తియై శోష మొందఁ, జేసెనాగ్నేయశరమున శత్రుబలము.

చ. అరిబలమర్దనుండు దనుజాధిపపుంగవుఁ డంగదేశభూ
వరబలము న్నిజాశుగదివాకరపంక్తుల నింతలింత లై
ధరఁ దొరుఁగంగ నేయుటయు దైత్యమహోద్ధతి కోర్వలేక య
న్నరపతి వాజి నాతనిధనంబులు చిక్క నిశాటభర్తకున్. ౧౮౭

క. *అంగాధీశవిమర్దన, శృంగారపువింతసొబగు చెలు వమరంగా
నంగాలంకృతిబలుఁ డై, చుం గదలెన్ దైత్య రాజసుతుఁ డుద్ధతుఁ డై. ౧౮౮

వ. ఇట్లంగరాజభంగప్రదుం డగుదానవపుంగవుం డచ్చోటు గదలి వియచ్చర
వాహినీసమీపంబునకుం జని బలాశ్వ ద్రోణాశ్వ ధూమధ్వజ చంద్రధ్వజ
సుభద్ర భద్రప్రముఖు లైనసముద్రతీరనివాసు లగు నానాధనభూధవులం
జయించి తదర్పితబహుపదార్థపరిబృంహితహృదయానురాగుం డై యానా
గరకోత్తముండు వియత్తరంగిణీసముత్తరణంబు చేసి పారియాత్రగోత్రనవిధం
బున వివిధబలంబులును విడియించి యడరునప్పుడు. ౧౮౯

ఉ. సైనికు లెల్ల నాసవరసంబులు గ్రోలి మదాంధచిత్తులై
సానుమదగ్రభాగములఁ జందనశీతలచంద్రకాంతవే
దీనివహంబులందు వడదేఱి పథిశ్రమ ముజ్జగించి నా
నానుపమాన సౌఖ్యవిభవాతిశయంబునఁ బొల్చి రచ్చటన్. ౧౯౦

గీ. భానుఁ డంత నస్తపర్వతంబున కేగెఁ, దమము ముదిరెఁదారకములు మింటఁ
దెలివిమెఱసి నెఱసె జలజారి ప్రాక్శైల, శృంగమెక్కి కళలఁ జెంగలించె.

—: ప్రహ్లాదునికడకు దేవరాతుఁడు వచ్చుట. :—

గీ. అట్టివేళయందు నచటికి భువనైక, పూతుఁ డాదృతార్థజాతుఁ డఘవి
ఘాతుఁ డైనదేవరాతుండు చనుదెంచె, శుక్రశిష్యుఁ డుక్తిశక్రగురుఁడు. ౧౯౧

వ. ఇట్లేగుదెంచి యానీవారముష్టింపచుండు త్రివిష్టపపరిపూర్ణప్రభావపటల జటి
లుండై నిశాటపతిం గదియ నతం డతనిఁ బ్రత్యుత్థానప్రణామప్రార్థనా
ప్రముఖసపర్యాచర్యలం బరితుష్టహృదయుం గావించి యుచితాసనంబున
సమాసీనుం జేసి ఘటితకరకమలుం డై విమలవచోవిలసనంబు లొలయ
ని ట్లనియె. ౧౯౨

---

* వంగాధీశ.

ఉ. భూరితపోవిశేషమున బుద్ధివివేకమునందు శంభుభ
ట్టారకుఁ బోలు మీరలు జడత్వపయోనిధి నైన నాపయిం
గూరిమి గల్గి వచ్చితిరి కొంకక యానతి యిందు దేహమున్
దారములున్ ధనంబులు మొదల్నను వేఁడిన వేగ నిచ్చెదన్. ౧౯౬

క. భావించి యేను జేయం, గావలసిన దెద్ది యనుడుఁ గలకల నగి య
శ్లోకవిదవరుఁ డిట్లనియె య, శోవిజితసుధామయూఖు సురరిపుసూనున్.

క. నీ వంతవాఁడ వగుదువు, దేవాంతకవరకుమార దీర్ఘాయువ వై
యీవిశ్వ మేలు వేడం, గావచ్చినవాఁడఁ గాను గాంభీర్యనిధీ. ౧౯౭

వ. అవక్రనీతిక్రమచక్రవర్తి యగు శుక్రాచార్యుండు నీకడకును బనిచినఁ బని
విన్నవాఁడ నతనివాక్యప్రకారంబు వక్కాణించెద వినుము. ౧౯౮

సీ. మీతండ్రిఁ దీండ్రగా మించంగ వలదె యామేటి కీటములైన మేదినీజ
నములఁ గారించెనే నముచిమర్దనముఖ్యదిక్పాలకులము మర్దించెఁ గాక
చీమలపై దాఁటునే మహాసింహంబు కలకుశేనుఁగులపై నుఱుకుఁ గాక
ధనము లర్పించి నిన్ గని మని కొలిచెద రన్న మర్త్యులమీఁద నాగ్రహింప
కాహవోత్సాహశక్తి నీ కగ్గలంబు, గలిగి యున్నదియేని నాకంబుమీఁద
నడువు సాళ్వంబుకొక్కర నడఁచినట్లు, వాసవుని గెల్చి విక్రమోల్లాసి వగుము.

వ. దుర్వారం బగుదూర్వాసుశాపంబు కారణంబుగ నిర్వాణలక్ష్మీ పూర్వ
గీర్వాణాయత్తంబు గాఁ గలిగి యున్నయది యిట్టియభిసంధి ననుసంధించి
యాసింధుశయనపూర్వజు గర్వంబు సర్వంబును విడిపించి త్రైలోక్యసామ్రాజ్య
సౌభాగ్యంబు ననుభవింపు మని దేవరాతుండు శుక్రవాక్యప్రకారంబుగా
నానతిచ్చుటయు వల్లె యని యసురవల్లభుం డమరవల్లభుపైఁ జనుపనికి
నుల్లంబు పల్లవింప ధరాపల్లవికసమర్పితనానావిధపదార్థపరిపూర్ణభాండాగా
రుండై నిజరాజ్యధానికి విజయంబు చేసి. ౨౦౦

క. భూరిభుజాబలమున ర, క్షోరాజ్యం బేలుచుండె శూరశిఖామం
దారదనుజకులతిలక దనుజకు, మారుఁడు మాటెందు లేనిమగఁటిమి నిగుడన్

క. బాహాబలాఢ్యతపాయా, రోహ ... ... ... ... ... ... ...
వాహానసీమంతిన్యవ, గూహనలీలానితాంత కుశలజయంతా. ౨౦౧

ఉ. హావళిచిన్నరోభశధరాధిపశేఖర సైన్యపాల నా
నావిధ ... ... ... ...లానతే

జోవనజాప్త ధర్మగుణశోభిత శిష్టజనానురాగ భా
షావరధీవిశేష మదశాత్రవమర్దన దానకుర్దనా. ౨౦౩

ఉత్సాహ. - - - - - - - - -

పత్త్రిరాజవాహనాంఘ్రిపద్మసద్మమానసా
పాత్త్రదాన సావధాన పద్మినీహితద్యుతీ
వృత్త్రదానవారిసూను విక్రమక్రియోన్నతా. ౨౦౪

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధ వరప్రసాదసహజసారస్వత చంద్రనామాంక భారద్వాజసగోత్ర పవిత్ర రామవిద్వన్మణికుమా రాష్ట్రఘంటావధానపరమేశ్వర హరిభట్టారకప్రణీతం బైన శ్రీనరసింహపురాణోక్తం బగు నుత్తరభాగంబునందుఁ బ్రహ్లాదగుణవర్ణనంబును నతనికి దైత్యులు దుర్నయం బుపదేశించుటయు - - - - - - వామనుండను దానవుండు సుమాలివంశకు శేశయహంసుండగు హంసునివృత్తాంతంబుం దెలుపుటయును బ్రహ్లాదుని దిగ్విజయంబును - - - - చ్చటికివచ్చి దేవరాతుండు ప్రహ్లాదునితో దూర్వాసుశాపవృత్తాంతంబుఁ జెప్పుటయు ననంబరఁగు తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# నారసింహపురాణము.

## ⇝ ఉత్తరభాగము ⇜

### చతుర్థాశ్వాసము.

---

క. శ్రీమహితరామమాద్య, గ్రామణీరాంబురాశిరాకాచంద్రా
సామాద్యుపాయనయవి, ద్యామతినిస్తంద్ర రంగయప్రభుచంద్రా. ౧

వ. ఆకర్ణింపుమా శౌనకాదిమహర్షులకు రోమహర్షణుం డిట్లనియె దేవరాతప్రణీతం బగునీతివాక్యజాతం బంగీకరించి పంచజనపతిసంహారణపరాఙ్ముఖుం డై శతమఖప్రముఖనిఖిలబర్హిర్ముఖవిదారణదారుణరణోత్కంఠుం డై దనుజకంతీరవుండు సుఖం బుండునవసరంబున. ౨

—: వర్షాకాలవర్ణనము. :—

సీ. ప్రోగువైచినపద్మరాగఖండంబులగతి నింద్రగోపసంఘములు దనరె
గరుడపచ్చలడాలుఁ గన్నుఁగీఁటఁగఁజాలు లేఁతపచ్చిక పిసాళించి మించె
నీశానదిగ్వాయులేశంబు లోకళొన్ని భంజళిగతుల విభ్రమము చూపెఁ
బ్రథమోదబిందుసపర్కంబు పుడమిమైఁ బొక్కులాఁపఁగఁ దైలపూర మయ్యె
గగనగోపాలకృష్ణశిఖాపరీత, పింఛవలయంబు వోలె దీపించె నింద్ర
చాపవల్లీమతల్లి వర్షాశిలాక, లాపములు రాలె మొగులుమొల్లములనుండి.

స్వాగతవృత్తము. వారిదఘోషము వారిరుహాక్షీ, వారమునల్కనివారణసేయన్
సాగరసోదయసంభ్రమలీలా, స్మేరముఖు ల్విలసిల్లి రథీశుల్. ౩

సీ. ధళుధళుక్కన నింగిఁ దాటించెఁ బలుమాఱు లలితవిద్యున్నటీలాన్యకేళి
ఘుమఘుమ నుఱిమె దిక్కులు పిక్కటిల్లంగ భూధరస్థలుల నంభోధరములు
జలజలఁ దలలెత్తి చా లేరుపడియె విదూరభూస్థలుల వైడూర్యశిలలు
నకనక లిచ్చుమానసఖేదదశ డించి పురివిచ్చి యాడె నయ్యురగభోజి
పాంథమోహనమంత్రదీపములువోలెఁ, గడిమిపూఁజేగులురవయ్యెగహనవీథి
గాఢవర్షాగమారంభగర్వరేఖ, యవనితాపనివారణం బాచరింప. ౪

మ. [illegible] బలుమాఱుఁ జందురుఁడు దిక్కు ల్గాంచమై తోఁచెఁ గ
వ్వడినామంబులు వల్కి రెల్లసుజనుల్ వజ్రధ్వని న్వెచ్చి పె
క్కడుమల్ గాంచిరి పాంథు లంధనిభ మయ్యెం జంతుసంచార మే
పడరెన్ జాతికిఁ బ్రీతి వాన జడిపింపం బోధముల్ చూపఁగన్. ౫

స్రగ్ధర. మొరయన్మండూకపంక్తుల్ మునురెసఁగనహంబుల్ *తమిస్రాసమత్వా
దరణంబుం బొంద సింధూత్కరము జలనిధిం దార్కొనన్ జాజిపూచ
ప్పరము లోకోఘకుల్ నుతింపం బరిపరిగతులం †బర్వపున్గ్రాజపూవుల్
దొరఁగింపం బుష్పాదుల్ బంధుర మగుచు నిలం దోఁచె వర్షర్తు వందున్.

సీ. పెనుఁబాము వ్రేలఁగట్టినరీతిఁ గురిసెఁగుంభద్రోణమగువృష్టిఁ బలుమొగుళ్ళు
చను జారసంకేతమునకుఁ బాంసులరేయిఁ జనుకు పంక మఱుముచీఁకటనక
ఫుక్కుటిబంటియౌపాలపువెల్లికినోర్చి మెలఁగఁజొచ్చిరిహాలికులు ప్రియమున
నాతపాకాంతులై నడవిలోపల గూడువడి మూఁకలై యుండెబలుమృగములు
నట్టివర్షాగమంబున నసురభర్త, విజయయాత్రాసమారంభవృత్తి వదలి
నంకుమదమార్గమదలిప్త చతురయువతి,కుచపరీరంభశాలియైకుతుక మొండె

క. పాపాంధకార షణఁచి ప్ర, దీపించు ప్రబోధచంద్రు తెలివియ పోలెం
జూపట్టె జలదసమయ, వ్యాపదఁ గడకొత్తి శారదాగమ మంతన్. ౫

సీ. తెలుమొగల్ చిలుకముక్కులఁబోలె‡భంగభంగములయ్యెమువ్వన్నెగనపవిల్లు
తాండవక్రీడ ముక్తాళళి సోగకాసియ యూడ్చె శిఖి వనశ్రేణియందుఁ
గ్రేంకారశబ్దంబు లంకురించె మరాళజాతికిఁ గమలకాసారవారి
నస్తచ్ఛదళిగసౌరభంబై పర్వె గజకపోలముల వెక్కసపుమదము
పుట్టఁ §గోరాడె నాఁబోతు పొట్టకట్టు, లవిసెసస్యంబునకు నింకెనసలు నిసుక
వెరిఁగె నేఱుల ధౌతముకురసమాన,కాంతిఁదిలకించెఁబూర్ణరాకావిధుండు.

క. ఏలాలవంగతకోక్ర, ¶లాలీజాతీఫలప్రియంభావుకగం
ధాలీఢశిశిరమారుత, బాలక్రీడలు చెలంగెఁ బర్వతభూమిన్. (లెల్లఁ

గీ. వేఁడిమియుమాంద్యమును లేక వెలుఁగుతేఁడు,పసిగలోఁగొనుధరఁగల్గురసము
క్రూరుఁడునుశాంతుడునుగాకకువలయేశుఁ,డవనిజనములచేఁ గప్పమందినట్లు.

## —: ప్రహ్లాదుఁడు స్వర్గముపై దాడివెడలుట. :—

గీ. అంకురించె మహోత్సాహ మవనిపతుల
డెందముల శత్రువిజయంబు నొందుకొఱకుఁ
బ్రజ్వలించుఁ గృశానుపైఁ బ్రబలు నిబిడ
కీలయును బోలె నోజోవిశాల మగుచు. ౧౩

*తమిస్రాసమ †వర్షాపుంగ్రాజ (పరువముగల గ్రాఁజచెట్టు.) ‡ఖండఖండము.
§గోడాడె. ¶లాలితజాతీఫల.

శా. ఆకాలంబున నొక్కనాఁడు చతురంగాభీలకోలాహలో
త్సేకం బంబుధిఘోషముంబోదువ నిస్త్రింశోగ్రరోషాగ్నియై
నాకౌకఃపతిమీఁద దాడి వెడలె న్నానాసురాధీశసే
నాకోటుల్ భజియింప నమ్మనుజభుఙ్నాథుం డసాధూద్ధతిన్. ౧౮

సీ. ఢణఢణంఢణమ్రోయు తమ్మటధ్వానంబు ప్రయ్యాలుగామిన్ను వ్రచ్చివైచె
నినమండలము గప్పె నినుమంతయును గానరాకుండ సేనాపరాగరాజి
కనుమోడు పొదవించె ననిమిషాంగనలకు శాతాస్త్రచయచాకచక్యగరిమ
భరముతాళఁగలేక ప్రథమకచ్ఛపరాజు వికలుఁడై యొక్కింత వెన్నునంచె
మ్రొగ్గెదిగ్గజములు శైలములు చలించె, రాలెఁ దారలు జలరాశి దీలుపడియె
దనుజనాయకదండయాత్రామహోగ్ర, వీరరసవిభ్రమస్ఫూర్తిగారుకొనఁగ.

క. ఆదేవవిభునిపైఁ బ్రహ్లాదుఁడు చనుపూన్కి వలవ దని పల్కెడుమ
ర్యాద ఘనఘటల్గఁ దోఁచె, న్భేదురనాదములు దిక్సమితి చెవుడుపడఁగ. ౧౯

క. నభ మెల్ల నిండి రక్షో, విభుసైన్యము కామరూపవిభ్రమమున న
క్షుభితగతి వచ్చుపూనికి, సభయుంగావింగెఁ బాకశాసను నంతన్. ౧౭

చ. కొలువున నుండి దేవపతి కూర్చుదిశాపతులు న్మరుద్గణం
బులు వసురుద్రకోటులుఁ బ్రబుద్ధులువృద్ధులు నైనవారు పీ
నుల నిడి మేలుమే లన పినూతనసూక్తుల దేవతాగురుం
బలుకు గభీర*కంఠరవభ్రాంతసీరదగర్జనంబుగన్. ౧౮

మ. హరినామస్మరణంబు శ్రీహరిపదధ్యానానుసంధానమున్
హరిదాస్యంబు హరి న్భజించుటలు నిత్యాచారము ల్గాఁగ భూ
సురసంప్రీణనము న్సురావనము నత్యుత్కర్షతం జేయు లో
ల్యరజోగర్వవిముక్తబుద్ధి యగుఁ బ్రహ్లాదుం డశేషోన్నతిన్. ౧౯

ఉత్సాహ. అతనిధర్మ మిన్నినాళ్ళు నసురభయవిదూరతో
న్నతి వహించి విభవభోగనయసమున్నతిం జగ
త్త్రితయము మదయు మొందె నిపుడు దివిజవిమతదుష్టవా
గ్వ్రతతి నతఁడు సత్త్వగుణము విడిచి యడిచిపాటుతోన్. ౨౦

క. హరిమీఁద మనలమీఁదం, బరుషత వాటించెనఁట యపారబలముతో
నరుదెంచుచున్నవాఁ డఁట, కరణీయం బెద్దియో యకల్మషచరితా. ౨౧

---

*కందరవభ్రాంత.

గీ. నక్కఁ రేనుబండ్లు నమలంగనొల్లని, వ్రతముపట్టి పిదపి బతము చెడిన
నీతి నిక్కమయ్యె దైతేయనాతిహృ, చ్ఛాంతి విడిచి దౌష్ట్యవంతుఁడగుట.

క. నావిని చిత్రశిఖండిజుఁ, డావజ్రాయుధునిఁ బల్కె నమరాధిప ర
క్షోవరులకు నైజము దౌష్ట్యావేశము శాంతిగుణము లాగంతుకముల్. ౨౩

చ. హరికృప గల్గియున్న నిను నాయసురేశ్వరుఁ డేమి సేయు సం
గరము జయాజయంబులకుఁ గారణ మాకేఁడు నిన్ను నోర్చిన
న్సురపురిఁ గొన్నినాళ్ళు నిలుచుం గదనంబున వాని నీవు ని
ష్ఠురగతి నోర్చితేని జయశోభనము ల్నినుఁ జేరు నారయన్. ౨౪

గీ. ముట్టఁబడినపనికి నట్టిట్టు చనఁబోల, దసురఁ దాఁకి పోడుపు మనము మిగిలి
చంపఁబూంచియున్న జంతువుపట్టునఁ, దడయవలవదాత్మ జడియవలదు. ౨౫

క. గర్వించి యశోవాప్య, త్యుర్వీ యని దివిజబలమహోగ్రాకృతి వై
గీర్వాణవిమతజలనిధి, పర్వతమై నిలువవయ్య పాకధ్వంసీ. ౨౬

సీ. వినుతేంధనముల వేలిమి వేల్పఁగాఁ జాలు ననవద్యతేజుఁ డీయనలుఁ డుండ
నిటలాక్షుమదినైనఁ బెటిలి పోవఁగఁ జేయు కఠినప్రచారుఁ డీకాలుఁ డుండఁ
దనవారిఁ దమివాసి యనిమిషావళిఁగూడి వర్తించు నీకోణభర్త యుండ
సప్తసాగరరాజు సకలధర్మస్వరూపం బైన యీపాశపాణి యుండ
గంధవహుఁ డుండ నియ్యలకాధినాథుఁ, డుండ ఖండేందుధరుఁ డుండ నురక నీకు
జంచలింపంగ నేల నిశాచరాత్మ, జాతమాత్రంబునకు వజ్రసాధనుండ. ౨౭

క. హరి గల్గఁడు నీకు నిన్నోక, దరిఁ జేరుచుఁ గాని పెట్టిదపుఖేదములం
బొరయంగనీఁడు రక్షః, పరివృఢుఁ డన నెంత నీకుఁ బరబలభేదీ. ౨౮

క. తనతండ్రి నంతవానిం, దునుమాడిన విష్ణుశక్తి తోరమనక య
మ్మనుజాశనుఁ డచ్యుతుపైఁ, గనలుట పులిమీఁద లేడి గవయుట గాదే. ౨౯

గీ. అరులఁ జంపవల్లయు నరులచేఁ దాసైనఁ, జావవలయుఁ గాక శౌర్యఘనుల
కహితు లెదురునప్పు డట్టిట్టు చనరాదు, చనిర యేనిగీర్తి పొనుఁగువడదె. ౩౦

చ. ఘనులు ప్రియోక్తులాడిన వికాసముఁ గాంతురు గాని దుర్జనుల్
చెనఁటులునైన రక్కసులచిత్తము మెత్తనగాదు పోరికి
న్మన కిది వేళ గాదనిన మానరు గావున వైరివీరమ
ర్దన మొనరింపు దుర్దమవిధానదురావహశౌర్యశాలివై. ౩౧

వ. సామదానభేదంబులొనరించుతఱిఁ దప్పఁగ్రుంకినయది నిరాతంకహృదయుం
డవై దండంబున విమతఖండం బొనరింపు మని యనిమిషపతికి బృహస్పతి
నీతిమార్గం బుపదేశించుసమయంబున. ౩౨

గీ. చారు లరుగుదెంచి జంభారిఁ బొడఁగాంచి, ఘర్మసలిలబిందుకలితమూర్తు
లగుచు సంభ్రమోక్తు లడరంగ నిట్లని, రదరుగుండెతోడ బెదరిబెదరి. ౩౩

సీ. పొడకట్టె భూరజఃపుంజంబు మాంజిష్ఠపటవితానముగ నంబరమునకును
గదిసె నాజానేయకంఠఘోణసంభూత మరిలోచ్ఛలితవీచివనమువోలె
గంధాంధబంధుర సింధురంబు లకాలజలదోదయముఁ జేసె సకలదిశలు
గగనగంగాపయఃకాండ మంతయుఁ గ్రోలె నందితస్యందనోన్నతపతాక
లాయుధప్రభ లర్కాంశులట్లువెలిఁగెఁ, భేరిభాంకార మబ్ధిగభీర మయ్యె
వచ్చెఁ బ్రహ్లాదుఁ డాదిత్యవంశవర్య, శాత్రవంబుననో మైత్రి జరపుటకునొ.

వ. అనిన నదరిపడి త్రిదశపతియుం గొలువు విరిసి కలయ నెఱసిన కోపంపుం
గెంపుపెంపున సొంపారిసహస్రలోచనంబులు గలుగునిజశరీరంబు చెందమ్మి
కొలనిచందమ్మున నందంబుగఁ గుటిలతరభ్రుకుటిఘటనంబు నిటలంబున
నటింపఁ గటము లదరం బుటములు గొనునిట్టూర్పులు కందర్పహరకంఠ
సర్పంబుఁ దలఁపింప నలందిన హరిచందనంబుం దెరలించి ముంచుకొను
నులివేఁడిచెమటలు చొటచొట వడియ నిలు వెడలి హజారంబున కెడ
గలుగ నిలిచి నిలింపులం బిలిచి పలలాశనసంహారంబునకుస[1]రంభంబుగం
బయనంబు గం డని తానును భండనోచితశృంగారం బనంగీకారాంగీకార
కలితంబు గైకొన్నవాఁడై వాఁడియు వేఁడియుం గలకులిశంబు జళిపించు
చుం గలధౌతకుధరతులితవపురుత్సేధంబును నగాధదానపాథఃపరంపరా
పారిప్లవభ్రమరసముదయంబును నుదితనిజనినదవిదళితబ్రహ్మాండకటాహం
బును హాటకఘంటికాఘణాత్కారఘోరవేగంబును నితాంతచతుర్దంత
కాంతిసంతానకల్పితాకాలచంద్రోదయంబు నుం జారుతరావదాత చమర
వాలవల్లీవేల్లిత గల్లస్థలంబు ను జిత్రకంబళ కలనాభిరామోర్ధ్వకాయంబు
నగునైరావణంబు నెక్కి రక్కసులమూఁకదిక్కుల కలకలం బాలించుచు
నుండె నంతం దండోపతండంబులై యమరవీరులు సమరోత్సాహసంభ్రమ
భ్రమితహృదయంబుగం బదను మీఱిన కరవాలంబులు శూలంబులు ఖేటం
బులుం గిరీటంబులు వారవాణంబులు బాణంబులుఁ జాపంబులుం బ్రాసక

[1] సంరంభంబ్బుగంబ్బయనంబ్బుగాండ్రని.

లాపంబులు దీపింపఁ గోపాటోపంబున నంబరంబుఘూర్ణిల్లం బెట్టు వలుకుచు నరదంబులు ద్విరదంబులు హయంబులుం బదాతిచయంబులు నయుత నియుత లక్ష దశలక్షకోట్యర్బుదన్యర్బుదప్రముఖంబు లగుసంఖ్యావిశేషం బుల నుల్లంఘించి *క్రేళ్లుమెలంగం గసిమసంగి సింగంబులు గిరిగుహాంగ ణంబులనుండి వెడలువడువున స్వర్గంబు వినిర్గమింపం దొడంగి రప్పు డుత్పా తంబు లనేకంబులు గనుపట్టె నట్టు లయినను నెట్టివియని గట్టిమనంబుతో నదిలిపట్టి చూపట్టె జయంతుం బురరక్షణంబునకు నియమించి చనుదెంచు సమయంబున. ౩౫

—: ఇంద్రుండు ప్రహ్లాదునిపై యుద్ధమునకు వచ్చుట. :—

క. కనలుననో నైజగుణం, బుననో తనువందు నుష్ణము ఘనంబుగ న
య్యనలుం డేడికతత్తఁ, గాని దాఁటించుచు బలాంతకుని గని మ్రొక్కెన్.

ఉ. వగరపుతేజినెక్కి యిరువంకలఁ గింకరకోటి బింకమ్ముల్
నగవులు నట్టహాసములు నల్లనిమేనుల నుబ్బుగబ్బునై
మొగివిడ కేగుదేర దివిముట్టిన పట్టిన పోటుముట్టుతోఁ
బొగరున నేగుదెంచె రవిపుత్త్రుఁడు గోత్రవిరోధి డాయఁగన్. ౩౭

గీ. ఆత్మతుల్యమూర్తి యగు రక్కసుని నెక్కి, ఘోరభంగి వాఁడికోల లెసఁగ
వివిధభూషణాస్త్రవిద్యోతితాంగుఁ డై, దానవుండు వేల్పుతేనిఁ గదిసె.

శా. యాదోభేదము లెన్నియేని గొలువ న్వ్యాలోలపాశప్రభా
ప్రాదుర్భావము కల్పవహ్ని నుమమన్ భాసిల్ల నక్రోవవా
హ్యాదీర్ఘక్రమణప్లుతంబుల మనం బానందముం బొంద మాం
సాదధ్వంసనకాంక్షమై నడచెఁ బాశాంకుం డశంకోద్ధతిన్. ౩౯

క. గంధవహుండు †సుధాంధో, బంధురు నలరించెఁ జిత్రపర్యాయగతిఁ
గంధాంధహారిణసైంధవ, ముం ధేయని పఱపి సైన్యముఖతిలకం బై. ౪౦

గీ. గరుడగంధర్వకిన్నరగణము సిద్ధ
సాధ్యరక్షోబలంబు లసంఖ్యములుగ
హయము దాఁటించుచును గదాభయదబాహుఁ
డగుచు విత్తేశుఁ డనికి నై యంగవించె. ౪౧

క. ఈశానుఁ డేగుదెంచె శి, ఖాశీతమయూఖరేఖఁ గళ లుబ్బఁగ బా
హాశూలప్రభ ప్రబల వృ, షేశవిశంకటవిహారహేలావశుఁ డై. ౪౨

* క్రేళ్లుమెలంగ్గ. †సుధాంధ్ధో బంధ్ధూనలరించ్చె.

క. వసురుద్రాదిత్యులు తీ, వ్ర సమీరక్షుభితవిలయవారిధు లన ను
ల్లసితోగ్ర వీరరసకే, లిసహితగతి వచ్చి రఖిలలేఖోన్నతు లై. ౯౩

క. వీరాలాపంబులు ఘీం, కారంబులు హేషితములుఁ గలయ బెరయుటన్
ధీరంబు లయ్యెఁ దూర్య, స్ఫారారావములు త్రిదశబలములలోనన్. ౯౪

క. పొగలేనిమంట లొక్కట, బుగులుకొనియె నాయుధములఁ బున్నమ రేలన్
జిగిదేఱు లేఁతవెన్నెల, మొగడలక్రియ సఖిలసుభటముఖరుచు లలరెన్.

క. నలువదినాలుగుయోజన, ములవెడలుపు నిడుపుఁ గలిగి భువనభయద మై
వెలిఁగె న్శకటవ్యూహం, కలన మరుద్బలము కంఠగర్జలు చెలఁగన్. ౯౬

వ. అందు నవగ్రహంబులు దక్షిణచక్రంబును విశ్వేదేవతలువామచక్రంబును సిద్ధసాధ్యసమూహంబులునొగలును నశేషమంత్రంబులును సమస్తాభిచారికక్రియాకలాపంబులును సకలయోగవిద్యారహస్యంబులును నాభిఫలకంబును ధర్మం బిరుసుఁగా నిర్మథితనిఖిలవిమతహృదయంబై యమ్మహావ్యూహంబుత్సాహసాహసికత్వంబుల నొత్తిఱించె నత్తఱినుత్తాలరోషానలజ్వాలాఖిలంబై ప్రహ్లాదవాహినియు సూచీముఖశూర్పకర్ణ శంబరదీర్ఘజంఘకాలకేయకాలదంష్ట్ర దంతవక్త్రవృశ్చికరోమధూమ్రాక్ష కపిలాక్షవామనప్రముఖాఖిలశతమఖవిరోధియూథమేదురంబై దురంబునకు నంగవించె ని ట్లుభయసైన్యంబులుఁ దారసించు నవసరంబున వాసవుం డాసురబలంబును నిజమాయాబలంబునం జేసి ధూసరధరారజోవిసరప్రసరణంబగుసమీరణంబుఁబుట్టించుటయు నమ్మాయగాలి యుద్వేలం బై తద్వైరాధిని నొత్తరించుకొని యుత్తరదిక్కునకుం బోవ నూకుటయు సోఁకోర్చి లోకత్రయగీతకీర్తి యగు దానవచక్రవర్తి శాంబరీచక్రిశతంబులఁ బుట్టించుటయు నాబుసకొట్టుందెట్టువలు వి ట్టలమి యుక్కపటుపవనంబు నపహరించె నప్పుడు. ౯౭

క. కలయుంగ *బెరసె నిరువాఁ, గలఘుతరాయుధవిఘట్టనానలకణముల్
జలజల రాలఁగఁ గోలా, హలహాలాహలవిదారితాఖిలదిశ మై. (సేయు

గీ. కరులుఁ గరులు హరులుహరులునురథులును,రథులుభటులుభటులురణము
నుద్దవిడి నహింప†కూటాడబ్రహ్మాండ, మండలంబు తొంటిమట్టుఁ గడచె.

క. తెగిమొడుతలలును దెగి ధర, జిగినగవులతోడ రాలి చెన్నగుతలలున్
సగము తెగుతలలుఁ గలిగెం, బొగరుననని సేయు రెండుమూఁకలయందున్.

*బెరశనిరువాదలఘుతర. †కూటాడె.

గీ. మీఁదిమూఁకుళ్ళు దెఱచిన మెఱుఁగు లురక
*దొంగలించెడురత్నపంక్తులును బోలెఁ
గఠినహేతుల నుపరిభాగములు †ద్రెవ్వ
కాఱెఁ గరికుంభముక్తాకోత్కరము గరము. ౫౧

క. ముంగాలుగోరిసె లసిహతు, లం గెడపిన మ్రొగ్గ నురుబలము గలిగియు ను
త్తుంగతురంగశరీరము, లంగద వజ్రాభిహతనగాగ్రము లనఁగన్. ౫౨

క. ఘోరానిలవిఘటితరం, భారణ్యము వోలె సాయకాసారముచేఁ
దేరుగమి చిక్కుజీర్రై, వైరూప్యము నొంది తొంటివన్నియదఱెఁగెన్. ౫౩

గీ. కదిసి కత్తుల కింతింతకండ లగుచు,నంటుకొనిపోవునుభయసైన్యములభటుల
కాయమీఁదాయదనిపోరఁగానఁబడమి,నచ్చెరువునేసెదివిఁజూచునచ్చరలకు

ఉ. తాలతమాలనీలవసుధారజ మాకస మాక్రమించి పా
తాళము వేళ్లఁచేఁ బొదివి దట్టఁదనంబున బిట్టు పర్వఁ ద
న్మూలముఁ ద్రెంచె శాతశరముద్గరచక్రగదాత్రిశూలభి
న్నాలఘుయోధయూథవపురస్రపయోధివధూనహస్రముల్. ౫౪

ఉ. పోకుము పోకు మోరి యనఁ బో నిదె వచ్చితిరా యటంచు వై
రాకులచిత్తవృత్తి నుభయధ్వజినీభటకోటి వోర న
య్యాకస మెంత గల్గు నది యంతయు నిండెఁ గబంధమాలికల్
కోకిలవర్ణ మయ్యె నసికుంతరజఃపిహితాఖిలాండమున్. ౫౬

ఉ. వాహనహీను లయ్యు వసివాడక మిన్నులు మూడకు ద్భటో
త్సాహసమగ్రచిత్తముల ధైర్యము శౌర్యము నావహిల్ల బా
హాహవదోహలిత్వముగ నచ్చెరుపాటొనరించి రమ్మహా
వ్యూహయుగోగ్రవీరులు వయోబలపౌరుషగాఢమూర్తులై. ౫౭

క. త్రాసునఁ దూఁచినకైవడి, వాసవసేనయును నసురవరుసేనయు న
త్రాసగతి హెచ్చుకుందులు, వాసిన సమరేఖ రణము పాటించుతఱిన్. ౫౮

క. కరిఁ గొలిపి కులిశధారలు, గరళంబుల నుమియు దివిజగణములతోడన్
హరిహయుఁడు చుట్టుకొనియెం,బరిపంథిబలంబు విజయపటహములులియన్

సీ. కరవాలదండభీకరవేల్లనంబుల గళనాళములుఁ బిట్టు నులిచి త్రెంచి
చక్రిచక్రోపమస్ఫూర్యంబు లగుపాదహతులఁ గందనగాయ లట్లురాచి

*దొంగలింపెడు. †ద్రవ్వ

శూలిశూలాగ్రనిష్ఠురదంతముఖములఁ బొడవుగా నందంద పొడిచి యెత్తి
యడ్డతాఁకుల నేనుఁగైనహాయంబైన రథమైన మృదులచూర్ణముగ మెదిపి
తిరిగెనైరావణముమహాసురబలంబుఁ,జొరుగుఁజేయుచుఁగ్రొత్తనెత్తురులు మెదడుఁ
గండలునుగొండలై నిండియుండదివిజ,మండలాధీశుడెందంబునిండముదము•

క. తెరలిననిజసైన్యంబుల, మరలిచికొని యసురభటసమాజము వొదివె
న్సురబలము నాసురోద్ధతి, ధరణీతల మదరఁ ద్రిదశధామము చెదరన్.౭౧

సీ. సూచీముఖుండును శూర్పకర్ణుండును శంబరుండును సురేశ్వరునితోడఁ
గాలకేయుండును గాలదంష్ట్రుండును వక్రదంతుఁడు గంధవహునితోడఁ
గల్పకేతుండును గంకటాహ్వాయుఁడును వామనుండును సమవర్తితోడ
వృశ్చికరోముండు వికటసత్త్వుండును గపిలాక్షుఁడును జలాధిపునితోడ
ఖరుఁడుబలియునుగుహ్యాకేశ్వరునితోడ,దీర్ఘజంఘుద్విమూర్ధులాదితిజుతోడఁ
దవిలిధూమ్రాక్షుద్మాపణుల్ శివునితోడ,నఖిలరాక్షససైన్యంబులగ్నితోడ.

వ. ఘోరాకారంబులం బోరం దొడంగి రప్పు డాసూచీముఖశూర్పకర్ణశంబ
రులు శంబధరుం బొదివి పొది విప్పక వెనుకదివ్వక వేసరక విసువక వెలియం
బొఱక విపాటాసారంబు తోరంబుగ జోరనఁ గురిసి తత్కరిశిరంబు శిలీ
ముఖవిద్ధంబు సేయుటయుఁ గ్రుద్ధంబై యాసిద్ధసింధురంబు శూర్పకర్ణునువర్ణ
స్యందనంబు నమంద వేగంబునం గడనొగలు వట్టి బిట్టు వీచి వైచుటయు
నన్నిశాచరుండు పిశాచబలప్రయత్నంబున రథాంతరసంపాదనలంపటుండై
నిలింపులగుంపులకుఁజిక్కి వేఱొక్కచిక్కిఁజిక్కువఱుచుచుండె సూచీముఖుం
డేచినఁ బ్రాచీదిగీశ్వరుండు *భాస్కరకరధారాధాళధళ్యతస్కరంబు లగు
శరంబులు శరధరమాలికావిభూషణం బగుభీషణకార్ముకంబునం గీలు
కొలిపి కరి నంటఁగొలిపి యతం డేయుసాయకంబులు పాయం దట్టుచుఁ
బతాకావిదళనం బొనరించుటయు నమ్మదవదసురవిసరపతి సురపతికిం గాలా
యసనారాచంబున ఫాలతలంబునం గీలాలధార వొడమించి యార్చినం
జేర్చినకోపంబునం జాపం బెత్తి యాదేవోత్తముండు†చిత్తజల్లుపగిదిఁ గ్రొత్త
లగుపుత్తడిపింజియలతూపులు పింజపింజయుఁ గొనం బఱపుటయు నయ్యురఁ
వడికిం జాలక మెరవడి వీడనాడి యాసూచిముక్కరక్కసుం డూడనింబాడె
శంబరుం డంబరంబునం బన్ని శాంబరీసహస్రంబులం బొడమించుటయు

* భాస్కరకధారాధారధర్యతస్కర (భాస్కరకరధారాధోరంధర్యతస్కస)
†చిత్తదల్లు.

వేల్పుటొడయం డనల్పక్రోధంబున నయ్యాతుధాను గంధర్వాస్త్రప్రయో
గంబున నంధునిం గావించి శంఖంబు పూరించె నంత. ౬౩

ఉ. ముక్కిడిమూఁక లన్ని పయి మించిన మించినకోపరేఖ నా
పొక్కు వెలుంగు కాఱడవిఁ బోలె నరాళకరాళహేతి నై
రక్కసిమూఁకఁ జక్కడిచి రక్తమయంబుగఁ జేసె నేల న
ల్దిక్కులఁ బాఱఁజొచ్చె నతిదీనము లై హతశేషసైన్యముల్. ౬౪

వ. కల్పకేతుకంకటవామనులు వైవస్వతుంబొదివియనశ్వరపౌరుషంబునం బెనం
గం గన లధికం బై జముండు భండనంబు ప్రచండభంగికంబుగం గావించె
నయ్యిరువెఱంగునుం గ్రేడింపక క్రీడాకందుకఖేలనప్రాయంబుగం గాయ
పతిత సుభటశిరఃస్తోమజంబుల ధరణీతలంబుంగప్పుచు నుప్పొంగె నయ్యెడ.

గీ. దీర్ఘజిహ్వాద్విమూర్ధ్ను లాదితితనూజు, నేసి రేసిన రేసిన హృదయ మదర
నదరిపడి వార లెక్కి నమదగజంబు, నశ్వరత్నంబుఁ గొనుమాడె నసురభర్త.

క. వా రంతఁబోక ఘోరా, కారంబుల నతని రెండుకడల నిలిచి దు
ర్వారతరవారినిఁ గరా, చూరిని నొప్పింప నతఁడు సొరిగెం బెలుచన్. ౬౭

క. కోణపుఁడు మూర్ఛ దెలిసి కృ, పాణహతి న్వారి విపులబాహామధ్య
క్షోణులు వ్రేసిన ధరణీ, రేణువునం బ్రుంగు డైరి త్రిదశవిరోధుల్. ౬౮

వ ఇట్లు ప్రాణాపాయప్రాయంబగు నైరృతిచేతిహేతిపాతంబున భూతలపతితు లై
యెట్టకేలకుం దెలిసి యలసి యయ్యసురవరు లిరువురు దురంబునకుం
దొలఁగి పఱచి రంత నంతకాకారు లయి నీరధిపతిం బొదివి వికటసత్వ
వృశ్చికరోమ కపిలాక్షులు నిశితక్షురప్రంబులం గప్పిన యాదఃపతి ప్రతి
విశిఖపరంపరల నా తెంపరుల పెం పుడిపె గంధవహవేగంబునకు నోర్వక
విముక్తగర్వు లై కాలకేయ కాలదంష్ట్రవక్రదంతులు దిగంతంబులం బరిభ్ర
మింపం దొడంగి రయ్యెడ. ౬౯

క. ఖరబలులు బలవదాహవ, ఖరు లై క్ష్వేళార్భటీముఖరు లై యలకే
శ్వరుఁబొదివిరి యాశరదంబుల, వరుషరవము విండ్లయులివు ప్రతిభయములుగన్.

గీ. వారితోఁ గూడి శస్త్రాస్త్రవారవాణ, వరశిరస్త్రాణధరులు దుర్వారబలులు
రాక్షసులుగొంద ఱాధనాధ్యక్షు మీఁద, నురవడించిరి భూరజంబుత్కటముగ.

వ. యక్షాధ్యక్షుండును యక్షరాక్షసకిన్నరబలంబులతోఁ జలంబు మెఱసి హరిం
బఱపి పరుషగదాదండంబుల నఱికి యు సురియల నసువులు వెఱికి యు

శరంబుల నురంబులు చించి యుఁ బరశువులఁ బర్శుకంబులు మురియం
జేసి యు న త్తళంబుల నొత్తి యుఁ బ్రాసంబులం ద్రాసంబు నొందించి యుఁ
జక్రంబులం జక్కు సేసియు ముసలంబులం గసిమసంగియు నొక్కఁడయ్యును
బెక్కురూపంబులు దాల్చి పొల్చి నిల్చినయట్లుండె నుండుటయు. ౭౨

శా. ఒల్లంబోయినసేనఁ గన్గొని ఖరుం డుగ్రాస్త్రపంక్తిం దలల్
డొల్లం జేయుచు యక్షరాడ్బలము *బిట్టుంజందము న్నార్చి చే
వి ల్లాఖండలచాపలీల వెలుఁగ న్విత్తేశ్వరుం డాసి క్రో
ధోల్లాసంబున నార్చుచుం బలుకు విద్యుద్భ్రమదంష్ట్రాస్యుఁ డై. ౭౩

ఉ. కోమటిబింక మేమిటికి ఘోరపరాక్రమ మైన రాక్షస
స్తోమముఁ గిట్టుటెల్ల నిది దోమలు సామజరాజిఁ దాఁకి సం
గ్రామము సేయుచంద మగుఁ గాదె ధనాధిప బుద్ధి గల్గిన
న్వో మగుడంగఁ బాడి యవివేకమున న్నెఱిదప్పఁ గార్యముల్. ౭౪

గీ. గుహ్యకేశాభిధానంబు గ్రుడ్డిగవ్వఁ, బోలువెడగ్రుడ్డు హేయమా పొడవుగల్గు
నీదుపోటును గలిగిన నేఁటినుండి, కలుగకుండునె జగములోఁ గప్పకాటు.

ఉ. నావిని విత్తనాథుఁడును నంజుడు నెత్తురుఁ గ్రొవ్వు నాని పె
న్గావర మెత్తి పల్కెదవు కష్టనిశాచర లావు గల్గినం
బోవక పోరు న న్నెదిరి పోటునకై †యతుక్రమ్మి వచ్చి యే
లా వదరంగ దుర్వచనలాలసు మెత్తురె శౌర్యవిత్తముల్. ౭౫

క. నీరజ్జు లణఁచి పుచ్చెద, నోరోరీ నిలువు మనుచు నుజ్ఝితగదుఁ డై
యారాక్షసు ముంచె శరా, సారంబున యక్షరాజు చాపము మెఱయన్.

క. హరిచిత్రగతులు మెఱయఁగఁ, బరిపంథిరథాశ్వపంక్తి బడలువఱిచి ని
ష్ఠురభల్లంబున నొక్కట, హరసఖుఁ డసురేంద్రసూతు పసువులఁ బాపెన్.

మ. విరథుండై దనుజాధినాథుఁడు మహావేగంబుతో ధారుణీ
ధరకూటంబుననుండి డిగ్గుమదవద్దంతావళారాతిభీ
కరరేఖ న్వసుధాస్థలంబునకుఁ జక్కం దాఁటి యక్షేశుబల్
తురగంబు న్నిజముష్టి నొంచుటయు నెత్తుర్గక్కె నావీతియున్. ౭౬

క. కనుచెదరి హయము గూలిన, ధననాథుఁడు విల్లు విడిచి దారుణగదఁ గై
కొని యసురకడకు వేసిన, వెనుకకొదిఁగె నతఁడు ధాతువికలత్వమునన్.

---

*బిట్టుంజెంద్దము (బిట్టుంజెద్దియము?) †పోటునకయ్యరుగ్రమ్మి.

క. తనయన్న కైనదుర్దశఁ, గని బలిదానవుఁడు తనదుకనకరథంబున్
ధనపతి కభిముఖముగ సూ, తునిచేఁ జేయించి వింటఁ దూపులుగురిసెన్.
క. గద విసరి యంపపదువులు, విదళించుచు యక్షరాజు వెసఁ గదిసి హస
ద్వదనముగఁ బగుల ఁ సురదముఁ, జిదురుపలుగఁ జేయుటధికచిత్రంబయ్యెన్.
క. అన్నయుఁ దమ్ముఁడు నీదశఁ, గిన్నరపతిచేతఁ బొంది కృతనిశ్చయులై
మిన్నంట నార్చి వేఱొక, పన్నినరథ మెక్కి కేలిబలువిం డ్లొలుమన్. ౮౩
క. శరములు గురియుచు ధరణీ, చరుఁ డగువిత్తాధినాథు జవ మడఁచినఁ గి
న్నరవిభుఁడు దెరలుటయుఁ డ, క్షత్వరమనఖుఁడు రుద్రుఁ డేచిప్రమథావృతుఁడై
గీ. తొలుతఁ దనమీఁద ధూమ్రాక్షదూషణాఖ్యు
లసురవర్యులు గవిసిన నదియు సరకు
గొనక నిజనఖరక్షకై యనికి నడిచె
ఖరబలులమీఁద వృషభవల్గనము లలర. ౮౫
శా. ఆయీశానుఁడు శూలహస్తులుఁ గపాలాలంకృతుల్ కృత్తివా
సోయుక్తుల్ భసితాంగరాగులును జక్షుఃశ్రోత్రహారుల్ ఘన
చ్ఛాయగ్రీవులు నైనకింకరుల నిచ్ఛారూపులం బంప న
మ్మాయాసంగరకోవిదుల్ గదిసి నిర్మర్యాదనాదోగ్రులై. ౮౬
సీ. పులులఁ బుట్టించియు నెలుఁగులఁ జూపియు గజములఁ గొల్పియుఁగాలసర్ప
సమితి నాడించియుఁ జండానిలంబులువిసరఁజేసియు రాలునిసుముఁ గురియు
మొగులు మొత్తంబుల మునుమాదిగల్పించియునునంధకారంబుగొనలుసాగఁ
బ్రబలించియును నస్థిపలలమేదోమజ్జరాసులు వెనిచియు రాసభోగ్ర
నాదములుదీటుకొలిపియునవకబంధ,బంధురముగనునానభఃపథముమునుఁగు
వడనొనర్చియుఁ బోరిరపారశౌర్య,ధుర్యులై రాక్షసేంద్రులుతొట్రుకొనఁగ.
క. మాయాసంగరమున వి, చ్ఛాయం బగుననురబలముఁ జదియఁగ నలకా
నాయకుఁడు మోదెగడఁగొని,యాయీశానుఁడుననురహరణమొనర్చెన్.
వ. ఇవ్విధంబున నవ్విబుధయోధులచే విచ్చియుం జచ్చియు ప్రీలియుం దూ
లియు వెఱచియుం బూరిగఱచియు మరలియుం దెరలియు నొటరియుం
బోటువడియు మ్రందియుం గుందియు మ్రగ్గియు మ్రొగ్గియు నలసియు
సొలసియు నసురవిసరంబు పసచెడి దశదిశలకుం బాఱిన యెడ వారణా
రంబు లవారణంబులై మావంతులు లేమిం దమయంత విభ్రాంతంబు లై

వంతల మంతలుంబోలెఁ గాంతి దళుకొత్తి *సురిగ హరిగ కరవాలంబుఁ గిరుసు వంకిణియు డొంకెన జముదాడి కొంగవాలు హలాయుధంబు మొదలుగా నాయుధంబులు విడిచి పదాతు లనవదాతవదను లై పెదవులు దడుపుచు నొదిఁగిరి రావుత్తవిహీనంబు లగు మరుత్తమావులు ప్రోవులుగట్టి కల్యాణ పల్యాణప్రముఖంబు లగు సవరణలతోడ నేడఁజూచినం దామయై సము ద్రంబునందుఁ బవిసినకలంబుల చందంబునయథా యథలై యవధింబోరలెఁ బృథులంబు లగురథంబు లుపభుక్తపూర్వపుణ్యఫల పురుషవిముక్త సురపుర విమానంబులుం బోలె నవమానంబులకు నధిష్ఠానంబు లగుచు నున్నయవి యున్నయట్లనె వన్నెదళుకొత్తిగియొఱగెఁ గామలకుఁబాసిన హేమచ్ఛత్త్రంబులు మృత్యుభుక్తిపాత్త్రంబులు భుక్త్యంతంబునంబోవైచినయవియివి యనరవణంబు లుడిగి బెడఁగు దళుకొ నంచలు చంచువులం ద్రుంచివైచిన నెండవడి బడలు పుండరీకంబులలాగున ననాళంబు లగుచమరవాలంబులు సమర సరిత్తీరంబునకు జరత్కాశప్రసూనంబు లై ది - - - - నుడిగి కానంబడియెఁ గంకణాంగదగ్రైవేయకటకతులాకోటికోటులు విటతాటంబై యుత్పాతకాల పతితమహోల్కాజాలంబుల గేలిసేయుచు నేలయెల్లనుం దామ యై యప హృతరామణీయకంబులై విశీర్ణంబు లయ్యె నెత్తు రొత్తరించె నెమ్ములుదుమ్ము లయ్యెఁ గండలుగుండుగూలెఁ బ్రేగులు ప్రోగువడియె వాద్యంబులు ప్రద్యో తంబయ్యె (?) నెయ్యెడఁ జూచిన దయ్యంపుగుంపులు క్రొత్తయెఱచిగరచిల పులు(?) మేయుచు నర్తింపం దొడంగ నయ్యెడ. ౮౯

సీ. గగనగంగా పయఃకాండంబుఁ గబళించు నిబిడధరారేణునిచయధార గుభుగుభుల్లని హరితో(? )ణసామజకర్ణవిదళనం బొనరించురొదలకతన వియదంబురాశినవీనవిద్రుమలతాతతి యైనయాయుధద్యుతివిభూతి నజునిసర్గమునందు నవతారమందు జంతువులట్లు తలచూపు వివిధసేన రాక్షసోద్రేకనిర్వాపణక్షణోగ్రుఁ, డగుసహస్రాక్షుదృష్టికి నపగతారి యయ్యెభువనంబు శాత్రవవ్యాప్తమైన, కరణిఁగనుపట్టెఘూర్ణితాకారమగుచు

క. మరుదీశవిశ్వవసుకి, న్నరనరగంధర్వయక్షనాగఖచరు లా హరిహయునిరుగడల భయం, కరరోషోదగ్రు లగుచుఁ గమియుటయొప్పెన్

క. పాకారి యిట్లు విజయ, శ్రీకాంతుం డగుచు నడువఁ జెదరి బెదరి ముం జీకాకుపడినరక్షో, నీకిని ప్రహ్లాదుఁ గాంచి నివ్వెఱ గదురన్. ౯౦

* సురిగె హరిగె.

సీ. వీరరసోద్ధన్యవిక్రుతియందలి*జున్ను వడువున నురువులు వోడమ నోళ్ల
విజయాదిగుణములు వెడలుచో నడరెడుకన్నీరు క్రియ ఘర్మకణము లురులఁ
బరిపంథిపదములఁ బడితి మిట్లనులీలఁ బడుచు లేచుచునున్న భంగి మెసఁగ
నినకరఁబులఁ జిరింగిన తమోదేహజక్షతముల క్రియఁ బోటుగం ట్లెసంగఁ
బాదహతి నేల వ్రక్కలువార గళిత, ఖడ్గవల్లులు పదకంటకములు గాఁగ
నాహిరణ్యకశిపుసూను నపుడు గాంచి, పలికి రొక్కట వేగులపరికరంబు.
శా. దేవా దేవవిభుండు దిక్పతులు నుద్రేకించి బాహార్గళ
వ్యావల్గత్కరవాలదీప్తులు ధరాస్వర్లోకము ల్నిండ వీ
రావేశంబున రాక్షసధ్వజినిఁ బాయంజేసెఁ గయ్యానకు
న్నీవైదగ్ధ్యము చూపఁగాఁ దగు బలోన్మేషంబుఁ బోషించుచున్. ౯౪
క. నావుడు నేవోసిన జి, హ్వావలి వెలయంగ వెలుఁగునగ్నియ పోలెన్
దైవతవిమతుఁడు తెల్లని, మావుపయి న్నిలిచి శత్రుమర్దనపరుఁడై. ౯౫
వ. త్రోచి నడచె నయ్యెడ ననీచంబులగు చమూసమూహంబు లుభయపక్షం
బులయవియు నభయోల్లాసంబునం దారసించి, పోరునెడ. ౯౬
సీ. ధరణీప రాగ మంతయు నొక్కగ్రుక్కగాఁ గొనియె నూతనరక్తఘనరసంబు
శాకినీఢాకినీలోకంబు లిచ్ఛానురూపవర్తనముల నేపుచూపెఁ
గరవాలలూనభీకరశిరఃపంక్తులు పక్వతాళీఫలభ్రాంతిఁ జూపి
నొఱగునేనుంగులఁ బఱచునశ్వంబులు విఱుగు తేరులుఁగను వేఁదుఱోనఁగాఁ
గెడసెగోడుగులువడిగాలువడియెఁ బడగ,లఖిలదిక్కులు ఘూర్ణిల్లెనాహిరణ్య
కశిపునంభవుఁడత్యుగ్రగమనరేఖ, నమరవాహిని మీఁదబిట్టుఱుముటయును.
గీ. అపుడు ప్రహ్లాదుఁ డనిపని కగ్గలింపఁ, దొలుత విఱిగినబలములు తోడుచూపి
నిందుబింబంబు హెచ్చునుగుందు హేతు,వులుప యోధులనుబ్బింపఁజులుకఁజే
క. అనలయమదనుజవరుణప, వనధనదేశాను లపుడు వజ్రాయుధు దూఁ(యఁ.
దొని కదనముశకు నతిమిరి, యనిమిష సైన్యములు నడిచె నత్యుగ్రములై.
క. ఆసేనకు నాసేనకు, నాసురగతి సమర మయ్యె ననిముసలగదా
ప్రాసకరవాలధారో, ల్కాసమితి జగత్త్రయంబుఁ గనుమూయింపన్. ౧౦౦
సీ. విలుమ్రోఁత లార్పులు వేదండఘీంకృతు లశ్వహేషితములు నఖిలవాద్య
హృద్యస్వనంబులు నేకీభవింపఁ జుక్కలు రాలె నెత్తురు గ్రక్కె మొగులు

* జింన్ను -

యోగనిద్రాసక్తి నురగేంద్రశాయియగు నీలవర్ణుఁడు బిట్టు మేలుకొనియె
నభవుఁ గౌఁగిటఁ జేర్చె నచలరాజతనూజ కైలాసశైలంబు కంప మొందె
ధాత దిటదప్పె వేదమంత్రములయందు, సప్తవాయుప్రచారంబు చండివడియె
బీడువాఱిన యద్దంపు బిల్లవోలె, హల్లకారాతిబింబంబు క్రేళ్లుమలఁగె. ౧౦౧

క. ఆవేడఁ బ్రహ్లాదుఁడు కొ, లాయసనారాచధార లమరబలముపైఁ
గోయని యార్చుచు సింగిణి, మ్రోయించుచుఁ గురిసె భువనములుఘూర్ణిల్లన్.

వ. సూచీముఖ శూర్పకర్ణ శంబర కాలకేతు కాలదంష్ట్రి వృశ్చికరోమ ధూమ్రాక్ష కపిలాక్ష వామనదండశూక ప్రముఖ ప్రథమబర్హిర్ముఖులు శతముఖుం బొడగని రాజానుమతంబున నాజినైపుణంబు మెఱయుటయు హరిహయుండు కుండలితకోదండుండై వేదండంబు దిశాలిపి కాకోలకీలికీలాకలాపరూపంబు లగుతూపుల నాపిశితాశనులం గసిమసంగుటయు సింగంబుకరణిం బొంగి యసాదసంగరాహ్లాదుం డగుప్రహ్లాదుండు సాదరసంబుకరణిం ద్రొక్కనివోటులుద్రొక్కుచు నుక్కుమెఱయుతురంగమంబుం బంచవిధగతితరంగితంబుగం గదలించి తనపేరు ముదలించి యదలించి ప్రదరపంచకంబున నహల్యావంచకు నొంచియు సప్తసాయకంబుల సప్తజిహ్వారంహంబు నాఁగియు మూఁడువాఁడితూపుల నంతకుఁ బ్రశాంతుం గావించియు నిశాటువిపాటదళకంబునం బాటితలలాటతలుం జేసియుఁ బాశపాణి నాశుగనవకంబున నవకంబు చెఱచియుఁ బవనుఁ బవనజవంబు లగుపండ్రెండువెడందవాఁడితూపుల నేపణంచియు ధనదు నెనిమిదివిశిఖంబులఁ బిశితమయశరీరుం గావించియు నీశానుం గృశానుజ్వాలాచటులంబు లగుబలుగోలలు పదునొకంట గెంటించియు మిన్నంటనార్చి పేర్చిన* దివిజనివహంబు లుపచితాగ్రహంబులుగం బొంగారి చెలంగె. ౧౦౩

చ. మరలక రాక్షసేశ్వరకుమారుఁడు భల్లయుగంబు నేసి ని
ర్జరపతికేతనంబును నిశాకరవిస్ఫురదాతపత్రము
న్నఱియలు సేసి వేఱొక యమోఘశరంబున విల్లుద్రుంప న
చ్చెరు వెదఁ బిచ్చలింపఁగ శచీవిభుఁ డన్యధనుర్లతాగ్రుఁడై. ౧౦౪

—ఇంద్రుఁడు ప్రహ్లాదునకు బోధించుట.—

క. శర మరివోసి చతుర్దం, తరుచిరదంతావళాద్రిధారాధరమా
గరువంపుమేను వెలయఁగఁ, బరిపంథిం బలుకెఁ బ్రౌఢభాషారభటిన్. ౧౦౫

*దివిజనివహంబులు లపహృతాగ్రహంబులుగం.

క. భగవత్పదయుగభక్తియు, సుగుణంబులు విడిచి నీకు సురసైన్యముతోఁ
దగునే కయ్యము సేయఁగ, నగవే లోకంబు లసురనాయక నిన్నున్. ౧౦౬

గీ. కప్పమెలుఁగుపాముగతి మేఁకవన్నియ, పులి విధాన నీవు పొంచి యుండి
సురల భూమిసురులఁ జుఱవుచ్చుటకు నిది, వేళ యయ్యెఁగాదె వినయదూర.

సీ. పుల్లకండపుఁగొండ పొడిసేసి చల్లిన నుప్పు మానునె లవణోదవేల
ప్రోది నావులపాలు పోసి పెంచిన నైనఁ దొలఁగునే పాముకోఱల విషంబు
నిండఁ బాదునఁ దేనె నించి పెంచినయేని వెడచేఁదు మానునే వేఁపమ్రాను
కప్పురం బెరువుగా గుప్పళించిననాఁడు నుల్లిదుర్గంధంబు నోసరిలునె
తఱచు మెఱుఁగిడ్డ నిత్తడిత్తడియ కాక, హాటకాభరణాకార మందునోటు
చదువులేరాళముగఁజాలఁజదువుచున్నఁ, దొలుతవేల్పులఁబాయునేదుర్గుణంబు

చ. జనకుఁడు కోప మెత్తి నినుఁ జంపఁ గడంగి నిశాటవీరులం
బనిచిన వారు తీవ్రతరబాధల నొంప దృఢానుకంప న
వ్వననిధిశాయి గాచెఁ దగవా పగవాఁడవె పోలె నాజనా
ర్దనుదెస నీసడించెదవు దానవనాయక నీకు నాయమే. ౧౦౯

ఉ. అత్యుతదానవైభవవిహారుల కేనియు ధర్మసంహితా
ధ్యత్యుల కైన నాత్మవిదు లైనమహాత్ముల కైన నెందుఁ బ్ర
త్యక్షముగాని విష్ణుఁడు ప్రియంబున బాలుఁడ వంచు నిన్ను సం
రక్షితుఁ జేసెఁ గాక యసురస్థితి సైఁచునె దానవారికిన్. ౧౧౦

శా. ఆకంజాతకళావిశేష మతిరమ్యం బై భవస్ఫూర్తియం
దేకాలంబు వసించి యున్నకతనన్ హేమాసురప్రేషితా
నేకాభీలనిశాటహేతివితతుల్ హేలాసరోజాతప
త్త్రాకారంబులఁ గప్పెఁ గాదె మును ని న్నాహా వివేకింపవే. ౧౧౧

చ. హరిపదభక్తియుక్తి విడనాడి నిశాచరబోధయూథముం
బిరిగొని రాజ్యగర్వమున మీఁదటికార్యము సెన్నలేక యీ
బరువలఁ గూడి సత్యమును బాడియుఁ దప్పి చరించునీకు మా
కరివరదుండు తోడగునె కల్గునె భద్రము లెందుఁ బోయినన్. ౧౧౨

చ. పెనఁగొని నీవు నే ననఁగ భేద మొకింతయు లేక ప్రాణముం
దనువును బోలె నున్నయెడ ధర్మపథస్థితిఁ దప్పఁ ద్రొక్కి నీ
వనిమిషలోకకాంతు మది నందితిసేనియు నేల కల్గుఁ గో
రినకోలఁదిన్ ఫలించునె యరీణరమాతరుణీ విలాసముల్. ౧౧౩

సీ. ఘ్రాణకోణాగ్రనిర్గళదుగ్రపవనార్తిఁ గనకాద్రిముఖగిరుల్ గాతుకలఁగ
దంష్ట్రానిటంకసంతతి వహ్నికణచులు గుమురులై నలుగడఁ గొండ్లిసూపఁ
జరణాభిహతి విశ్వధరణీతలము వ్రస్సి వ్రయ్యలై యురగవర్గములఁ జూప
భ్రుకుటీభయంకరాద్భుతముఖాంబుజమునమూఁడుకన్నులు తెప్పమూయకలర
హరినృసింహావతారవిస్ఫురణ మెఱయఁ, గంబమున బుట్టి మీతండ్రిఁ గడిననఖర
శిఖలఁ జెండాడునపుడు నీచేర్వదారలుఁ, *ధూళిఁ బ్రుంగిరో గగనంబు దూటిచనిరొ

క. కూటికి నీటికినై నిను, మాటికి మాటికినిఁ గపటమార్గంబున జం
జాటములఁ ద్రిప్పు దుష్టని, శాటులపొం దేల నీకు ననఘవిచారా. ౧౧౫

సీ. శ్రీవత్సకౌస్తుభశ్రీసమావృతవక్షు నంభోరుహాక్షుఁ గృపార్ద్రవీక్షు
నాశ్రితావనదక్షు నాదిమధ్యాంతవిరహితుని యోగముద్రాసహితుని
బ్రహ్మరుద్రాదిభర్మకిరీటకోటిసంఘటితరత్నప్రభాకవచితాంఘ్రి
నఖిలజగత్పూర్ణు నసితసారసవర్ణు యతిమనోభ్యర్ణు లాలితసుపర్ణు
నాదిదేవు సమస్తేంద్రియార్థగమ్యు, సౌమ్యు ధృతశంఖచక్రు శ్రీరమ్యమూర్తి
విడిచితివి గాన నింక నీవిభవ మెల్ల, దినదినంబున కవధిమై జనునిజంబు. ౧౧౬

వ. అని పురందరుండు వలికిన హిరణ్యకశిపునందనుం డిట్లనియె. ౧౧౭

చ. హరికిని నీకు నేమి పని యాయన నన్నెఱుఁ గే నెఱుంగుదున్
హరి నటు లుండనిమ్ము తులువా బలువా దొనరింపఁ బోవునే
పరుషవిరోధియూథకృతబాధలు యోధులు మెచ్చ నాపయిం
గరిఁ బురికొల్పు పొల్పమరఁ గయ్యము సేయుము వేయునేటికిన్. ౧౧౮

గీ. శూద్రవృత్తి గాఁగ సురలోకసౌఖ్యంబు, లిన్నినాళ్లు నీవ యేకహేళిఁ
గైవసంబు చేసి తీవలదా యింక, నాకు నేలుబడికి నాకపురము. ౧౧౯

క. చిలువవారలిచ్చి రందఱు, బలిసద్మము తనకు వసుధ వాయక నాయీ
వలమూఁపునందు నున్నది, కులిశాయుధ నాకమేలుకొదవయ తక్కున్.

గీ. అడిచిపడకుము నాకంబు విడిచి వేగ, నీదుకుళకంబు నీవును నేఁడె వెడలు
మద్భుజాయత్తమమరధామంబు నీకు, నన్యవిత్తాపహరణంబు ధన్యమగునె.

క. తొడిబిసజోడే విడువం, బొడిచి యొడిచి వేల్పుగములఁ బోనొత్తి రయం
బడర సుధాశనలోకము, గడిమేరగఁ దోరణంబు గట్టక వింటే. ౧౨౨

క. నీవేగుము వలసినకడ, కీవిబుధావాస మేన యేలెద ననుడున్
దేవేంద్రుఁ డాగ్రహంబున, దేవారిం జూచి పలుకు ధృతపవి యగుచున్.

---

* ధూళి బ్రింగిరో.

క. గుడినుండి కోయఁ జూచెదు, గుడిత్రాళ్లను మమ్ముఁ గూడుకొని వర్తిలి మా కడఁ జెట్టుగట్టి పొత్తునఁ, గుడిచితి విన్నాళ్ళు దుష్టగుణమిది తగునే. ౧౨౪

క. భల్లూకచర్మ ముదికినఁ, దెల్ల నగునె దుష్టకష్టదితికులజుఁడ వీ
వుల్లంఘించుచు సుమనో, వాల్లభ్యము నొందఁగలవె వక్రవిచారా. ౧౨౫

వ. అనిన దనుజరాజతనూజుం డొండాడనేరక వదనమండలంబు వంచి మిన్నక యుండినం దద్వైలక్ష్యం బుపలక్షించి యతనిపితృవ్యుండగు ధూమ్రాక్షుం డు సహస్రాక్షుతో ని ట్లనియె. ౧౨౬

{ప్రహ్లాదుండు నిరుత్తరుండైన నింద్రునకు ధూమ్రాక్షుం
డుత్తర మిచ్చుట.}

ఉ. మాటలు నేర్తునే ననుచు మాటికి మాటికి నుగ్రసంగరా
స్ఫోటితశత్రువైన దనుపుత్రకుమారకు మీఱి పల్కుఁ ఝుం
ఝూటము గీటముం దగునె యద్భుతవిక్రమశాలికిన్నిరా
ఘాటభుజాసిపాటవము గల్గినఁ జూపుము శక్ర యిక్కడన్. ౧౨౭

సీ. నాకపట్టన మెల్ల *డాకమై ఛేదించి నందనవనమును నఱకివైచి
సిద్ధరసంబులు చీకాకుపడఁజేసి తెఱవల నందఱఁ జెఱలువట్టి
హరిదంతిదంతకుంతాగ్రంబు లగలించి గ్రొచ్చి పెన్నిధులెల్లఁ గొల్లలాడి
పరమేశసఖుని పుష్పకము గైకొని జగద్విదితంబుగా నేకవీరుఁడైన
యాహిరణ్యకశిపుఁడు మాయామనుష్య,మృగముచేదైవవశమునఁదెగినకతన
నేఁడు తెక్కలువచ్చెనే నిర్జరులకు, నీకు నాకేశ యింత†యుత్సేకమేల.

శా. ఆదైత్యేంద్రకుమారుఁడై వెలయు ప్రహ్లాదుం డమర్యాద బా
హాదర్పంబున నెల్లభూపతులఁ గయ్యాలం దిగంద్రోచి నేఁ
డీదేవావసథంబుఁ గైకొనఁగ నిల్చితెంచె నీవిక్రమ
శ్రీదాక్షిణ్యపరాయణున్ గెలువ నేర్తే ధూర్తచర్యానిధీ. ౧౨౯

చ. సురవర నీపరాక్రమముచొప్పు సమస్తము నీఱు గప్ప సం
గరమున దానవాకలితకర్కశబాణము లోర్వలేక బ
ల్విరు దని విష్ణుఁజూపి వెఱపించెద విక్కడ మమ్ము నక్కటా
యురుతలపాదఘట్టనల నూఁగునె తూఁగునె సాలసాలముల్. ౧౩౦

క. త్రిజగములుఁజుట్టియెవ్వఁడు,భుజబలమున నాక్రమించుఁ బూర్ణోదయుఁడై
విజయంబుఁగన్నయవ్విభు, భజియింతురు దేవుఁడనుచుఁ బ్రజ లమరేంద్రా.

* డాకమై బేడించ్చి. † యుద్రేకము.

గీ. మాట లేల శక్ర మగుడుము ప్రాణంబు, గాచుకొనుము గాక కదనవీథి
నిలువఁగలిగితేని నేఁ డెఱుంగఁగవచ్చు, నిర్జరారిబలము నీబలంబు. ౧౩౩

సీ. అదె చూడు మంభోధు లాపోశనముచేసి త్రావనోపినకాలదంష్ట్రబలుల
నాలోకనముచేయు మఖిలమత్తారిదంతావళహర్యక్షు దందశూకు
వీక్షింపు మంభోరుహాక్షుతోఁ బెనఁగంగఁజాలిన కపిలాక్షుశంబరులను
దర్శింపు మఖిలదిగ్దంతిదంతము లూడఁదిగిచి పాఱఁగవైచు గగనచరుని
వీరలయ కాదు ప్రహ్లాదువీట వీరి, కినుమణుంగగు దైత్యు లనేకు లున్న
వారు నీపౌరుషం బింక వారిమీఁదఁ, బ్రతిఫలింపదు చనుము నిర్జరవరేణ్య.

చ. అనఁ గనలెత్తి దేవవిభుఁ డాశుగవేగసముజ్జ్వలాశుగం
బున దనుభూపితృవ్యశిరముం గరముద్ధతిఁ దున్మెఁ దున్మఁ ద
ద్ఘనతరరక్తధార దివి గట్టె నభోవలయాతపత్రకీ
లనమునఁ బొల్చు విద్రుమశలాకయుఁ బోలెఁ ద్రిలోకభీమమై. ౧౩౪

గీ. పొదివి దిక్పాలసంఘంబు పోనరింప, వాసవుం డేనరేఁగి దైవతవిరోధి
వరవరూథినిఁ జెండాడె వనద ముగ్ర,వృష్టిఁ,బద్మాటవుల నొంచువిధముగదుర.

చ. తనపినతండ్రిఁ జంపిన సుధాభుగధీశ్వరుమీఁదఁ గల్పవ
హ్నినిభకటాక్షవీక్షణము నించి దితిప్రభవాత్మజుండు ఘో
రనినదచాపవల్లరిఁ గరంబునఁ బావకకీలవోలె శో
భనరుచియై వెలుంగ లయభానుసమానవిభాభిరాముఁడై. ౧౩౬

స్రగ్ధర. శరము ల్పుంఖానుపుంఖోచ్చలితగతి నభశ్చారియై తూఱనేయం
గరిరాజుం గొల్పి దైత్యోత్కరము నుఱిచి రక్తప్రవాహంబు లుర్విం
దొరుఁగంగాఁ జేసి యేసెన్ దురధిగమజయోద్యోగపద్యావిహార
స్ఫురణన్ దేవేంద్రుఁ డగ్నిస్ఫురదిషువితతు ల్భ్రాతము ల్భీతినొందన్. ౧౩౭

క. జంభారి వైచె దితిసుత, డింభకుమీఁదన్ శతఘ్ని డెప్పర మగునం
రంభమునం దక్కల్లా,నంభారము భువనములకు సాధ్వస మొనఁగన్. ౧౩౮

క. శూలమున నసుర దానిం, దూలిచి లయకాలకుపితధూర్జటివోలెం
గ్రాలఁగ నమ్ముఁగొని విశిఖ,జ్వాలల జంభారి దివిజశత్రుం బొదివెన్. ౧౩౯

చ. పొదివినఁ గోపమెత్తి దితిపుత్రితనూభవుఁ డాబిడౌజుహ
స్తిదళన మాచరించి నలుదిక్కుల ఘూర్ణిలుసేన మానసం
పద వదలింప నిర్జరసమాజము లార్వ బలారి కూల్చె నొ
ప్పిద మగుతత్కిరీటముఁ గృపీటభవోపమకాంతికూటముత్. ౧౪౦

క. కరిపతి దూలిన నిర్జర, *పరివృఢుఁ డరదంబు నెక్కి భాసిల్లుటయున్
హరి డిగ్గి దానవాధీ, శ్వరుఁడు న్రథమెక్కి విజయశంఖము లులియన్.

వ. పావకపాథోధిపతిప్రముఖదిక్పాలపాలితంబగుగరుడగంధర్వకిన్నరకింపురుష
సేనాకలాపంబు లాపురందరుం బాదివిడ్కొని యుండెఁ గాలజంఘకాలదంష్ట్ర
కాలకేయ శంబర దీర్ఘజంఘ సూచీముఖవామనాది పలాదులు ప్రహ్లాదునకు
బాసటలై యాహ్లాదంబు సేయుచుండి రయ్యెడ. ౧౪౬

సీ. జంభశుద్ధాంతరాజనిభాననాఘనస్తనహారహారియై తనరు నెద్ది
పాకశోకస్తనీశోకానలోద్భూతిసామిధేనీస్ఫూర్తి జరగు నెద్ది
బలవధూవరహాసభాసమానమృణాళఖండనహంసమై యుండు నెద్ది
నముచిమానవతీజనప్రేక్షణాంజనతిమిరేందుకాంతియై యమరు నెద్ది(విజుఁ
యట్టి వజ్రంబుఁ గొంగేలహరి హాయుండు,పూనుటయుఁ బాశుపతమెత్తెఁ బూర్వది
డమ్మహాయోధవీరులయాగ్రహమున,నిగ్రహమునొందెనలభూతనివహమెల్ల

క. బలరిపువజ్రము దానవ, కులతిలకము పాశుపతము గొదకొని పెనఁగన్
జలజల విలయానలకణ,ములు దొరఁగెన్ జగములొరగ మురమురవెరిఁగెన్

వ. అయ్యవసరంబున నయ్యాతుధానప్రధానపురుషు లగువామన వ్యాఘ్రగ
మన శిఖావళప్రముఖు లగునిశాచరవీరులు ఘోరాకారులై గండశిలల
ఱువ్వియుఁ గొండ లెత్తివైచియుఁ దరుషండంబుల నొండొండ మోదియు
నాదిత్య†వరూథినికి నిరోధంబు గావించి రప్పు డప్పూర్వకఃప్వతియను
మతి ననలుండు కనలి విశాలజ్వాలాజాలంబు నిగిడించినం జిమిడియుఁ
జీకాకుపడియునుం గమరియుం గాలుమట్లం బోయియును నుడికియు నొటఱి
యుం గలంగియు నలంగియుం గూలియుం దూలియు వావిచ్చియు నొచ్చి
యుఁ బూర్వవియచ్చరనికరంబు కరంబు సంక్షోభించె నాసంరంభంబు జగ
త్త్రయసంధినిర్భేదననిష్ఠురం బగుచు నుండె వెండియు. ౧౪౯

గీ. దేవవిభుతోడ దానవాధిపుఁడు పోరెఁ,గడిమిఁ గరితోడఁ బోరుసింగంబుఁబోలె
మదముబిడనాడిసత్త్వసామగ్రివిడిచి, వితిగవిబుధేంద్రుఁడసురేంద్రవేగమునకు

క. సురపతి దెరలినఁ దెరలె, న్సురబలములు జలధియుబ్బు సొరిగినతఱిఁ బూఁ
దెరలు గరువంబు సడలిన, వెరవునఁ జింతావివర్ణవివృతముఖములై. ౧౫౧

గీ. ఆహిరణ్యకశిపునాత్మసంభవుఁ డాప్త, బలముతోడ బాహుబలముతోడ
సురపురంబు సొచ్చి సుఖముండె ననుటయు, శౌనకాదిమునివితానమపుడు

* పరివృఢుడు. †వరూధంబునకు నిరోధంబు గావించె నసంగు

వ. పరమాశ్చర్యనిర్మగ్నమానసుండై హర్షోత్కర్షంబున రోమహర్షణుం బలికె నయ్యా యయ్యాతుధానునకుం బురుహూతుండు విఱుగుట నిగమవిరుద్ధం బిది యేకరణి సిద్ధాంతీకరించి వాక్రుచ్చితి రనవుడు నతం డమ్మునివేతండ తండంబుతో ని ట్లనియె. ౧౪౯

చ. కలదు రహస్య మాదివిజకాంతుఁడు మున్నొకనాఁడు కొల్వులో
పల విభవాభిరాముఁ డయి భాసిలుచుండఁగ నట్టిచోటికి
న్విలయకృశానుసన్నిభనవీనరుచిం జనుదెంచె మౌను లిం
పలరుచుఁ గొల్వఁ గోపనమహాముని భీమతరప్రభావుఁ డై. ౧౫౦

క. అరిమర్దనంబు రాజ్య, స్ఫురణంబును గలుగుకతనఁ బొంగారి సురే
శ్వరుఁ డాదుర్వాసోముని, వరుఁ బూజింపక వికారవశుఁ డైయుండన్.

వ. సమూలఘాతంబుగ నిఖిలసురసంఘాతంబు నున్మూలింపం జాలియు నాకా లాంతకనిభుండు క్షమాగుణంబున శాంతుండై శచీకాంతు నైశ్వర్యంబు నిశా చరాయత్తం బగుఁగాక యని తన చిత్తంబులోనం దలంచి చనియెం గావున దేవపతికి నియ్యవమానంబు వాటిల్లె నదియునుం గాక. ౧౫౨

క. ఆరీతివీరుతో సరి, పోరిన దేవేంద్రుమహిమఁ బొగడఁగఁ దగదే
మారుతము మీఁద వేఱొక, మారుత మఱుగ్రమ్మినట్టిమత్తమై తోఁచెన్.

క. గురువులయెడ విప్రులయెడఁ, బరిభవ మొనరించువానిభాగ్యశ్రీ న
శ్వర యగు గాలి నిడినదీ, పరుచియునుం బోలెఁ దరళభావోదయ యై.

వ. ఇవ్విధంబున విబుధమానమర్దననిర్దయుండగుపూర్వగీర్వాణశ్రేష్ఠుండునిష్ఠుర పరాక్రమక్రీడావశీకృతలోకత్రయుండై నాకం బేకాతపవారణంబుగ నేలు చుం బెద్దకాలం బుండె నాఖండలుండును నఖండశోకవ్యాకులహృదయుం డై నాకౌకోలోకంబుతోడ లోకాలోకగుహాగేహంబుల దేహంబులు చొ నిపి వనరుచు నపజయక్లేశంబున గాసిల్లుచు నుండె నంత నొక్కనాఁడు.

—: స్వర్గం బేలు ప్రహ్లాదునికడకు శుక్రాచార్యులు వచ్చుట. :—

సీ. నెమ్మేని తేజంబు నింగి యంతయు మ్రింగి వేఱొక్క సూర్యునివిధము సేయఁ
గరకల్పశాఖావికస్వరఫలలీల నిద్ధంపుతీర్థకుండిక వెలుంగఁ
బరమపావనదృక్ప్రభావిభావంబున నజ్ఞులకును బోధ మావహిల్లఁ
గొలిచివచ్చిన శిష్యకులము బ్రహ్మ భజించు దివ్యమౌనులలీలఁ దేజరిల్లఁ
జుక్క తెగి పడినట్టులు శుక్రుఁ డాత్మ, భవనవాటికసొచ్చి రాఁ బ్రథమదివిజ
పుంగవుఁడునిర్భరానందపులకితాంగుఁ,డగుచుఁ బూజించె నా దేశికాగ్రగణ్యు

క. పూజించి తెచ్చి నిజమ్మృగ, రాజమణీపీఠి నునిచి ప్రాంజలి యగుచున్
వేజాడల నుతియించెఁ బ, యోజాసనుఁ బొగడు నిగమ యోయితఁడనఁగన్.

ఉ. ఆదరమొప్ప శుక్రుఁ డమరాహితనందను నిందుకాంతసం
పాదితపీఠిపై నునిచి పల్కు హిరణ్యనిశాటపుత్ర యా
హ్లాద మొనర్చె నీచరిత మంతయు మాకు నశేషశోకవి
చ్ఛేదిని యయ్యె నీభుజవిశేషవిజృంభితశక్తియుక్తియున్. ౧౫౮

మ. జనకుం జంపిన క్రించు పీఁడని రమాజాని న్విసర్జించి నీ
యనుఁగుందమ్ములు నెల్లబాంధవులు గాఢానందపాథోధిమ
జ్జనముం జేయ మహేంద్రు గెల్చి త్రిదివేశత్వంబునుం బొంది వం
దనము ల్గొంటివి శత్రుజాలములచేతన్ ధూతధూర్తవ్రజా. ౧౫౯

సీ. నీప్రతాపము నోర్వనేరక రిపులక్ష్మి నీవెల్లగొడుగు క్రొన్నీడ నిలిచె
నీకృపాణీధార నిచ్చెనగా నెక్కె నీవలపటిమూఁపు న్నేలగోల
నీగుణగంధమానెడు వేడ్క సుజనషట్పదములు నీదండఁ బాయ వెపుడు
నీవితీర్ణికి నోడి నీరాకరము నీదుదానాంబుధారలఁ దగులుకొనియె
నిన్ను వర్ణింప నెవ్వారు నేర్చువారు, దానవాన్వయసౌధకార్తస్వరఘట
నిన్నుఁ జూచినదివసంబు నిఖిలభోగ, భాగ్యసౌభాగ్యములకుఁ జేపట్టుగాదె.

క. నీరాంజలిఁ దృష్ణాతుర, పూరుషు లాసించులీలఁ బోరుల నిన్నున్
వైరిజనహరణమునకుం, గోరెదు మాకోర్కి నేఁడుకొనసాగెఁ జుమీ. ౧౬౧

క. మాదానవపతి నాతో, నాదగునందనులు వినయనయశాలులు ప్ర
హ్లాదుఁ డనుహ్లాదుఁడు సం,హ్లాదుఁడుహ్లాదుండు ననుట నవి ఫలియించెన్.

క. హరిహయశిఖయమసురరిపు, శరధిపపవమానశంభుసఖశంకరులన్
దురమునఁ గింకరులం బలె, శరతాడనపీడ నొంపఁ జను నీ కనఘా. ౧౬౩

క. వంచినతల యెత్తనిన, క్త్రంచరులకు నేఁడు గలిగె దానవవర య
భ్యంచితతేజము నీదుభు, జాంచలకరవాలకీల యలరుటకతన్. ౧౬౪

శా. పాతాళంబును భూతలంబు దివియుం బాలించె మాతండ్రి నీ
వాతీండ్ర న్వాలుఁ గొందియున్కి సుభటాహ్లాదంబు నొందించె నీ
వాతంకంబులు మాన్చి రక్షణము సేయం బాడి యోదానవ
వ్రాతంబుం బరిపంథిమర్దనవిధావైదగ్ధ్యహృద్యంబుగన్. ౧౬౫

క. నావిని ప్రహ్లాదుఁడు ర, క్షోవంశాచార్యుఁ బల్కు సుజనస్తుత నీ
పావనకటాక్షవీక్షా, శ్రీవైభవ మిట్లు నాకు సిరు లొనగూర్చెన్. ౧౬౬

క. నాతరమా పోతరమున, ఘాతుకులై యున్న సురలఁ గసిమసఁగఁగ ను
ద్యోతితభవదనుకంపా,ఖ్యాతియె యనిఁ దనకు వజ్రకవచం బయ్యెన్. ౧౬౭

చ. అనవుడు నల్ల నవ్వి దనుజాన్వయదేశికుఁ డమ్మహాత్ముహ
స్తనలినలాలనంబునఁ బ్రసన్నమతి న్మెయి డుల్పి మౌళి మూ
ర్కొని పులకించి హర్షరసగుంభితబాష్పకణార్ద్రనేత్రుఁ డై
ఘననిభకంఠనిస్వనముగాఁ బలుకు న్సభికు ల్నుతింపఁగన్. ౧౬౮

శా. అన్నా వెన్నుని నమ్మఁగా వలదు మాయానాట్యకేళీరతుం
డన్నారాయణుఁ డాదితేయులకు రంధ్రాన్వేషసంపాది యై
యున్నీసంపద లన్నియుం *గిలిబి తా నిచ్చు న్నిజం బీవు సం
పన్నప్రౌఢి వహించి యేమఱకుమీ ప్రత్యర్థికృత్యంబులన్. ౧౬౯

క. అని బుద్ధిచెప్పి ప్రహ్లా, దుని వీడ్కొని శుక్రుఁ డరిగె దుర్దమ తేజో
దినకరబింబము మిన్నున, గనగనయని వెలుఁగ నయనకౌతుకకరుఁడై. ౧౭౦

వ. ప్రహ్లాదుండు నసాదప్రమోదమేదురహృదయుండై దనుజగురువచనరచన వలన జాగరూకుండై నాగలోక నరావాస నాకపురంబు లేకచ్ఛత్రంబుగా నేలుచు నుండె నిట్లు బహువిధం బగుకాలం బతీతం బగుటయు నగధరుండు నగవిరోధిప్రముఖబర్హిర్ముఖపరాభవప్రతీకారంబు నిజాంతఃకరణంబునం జింతించి కృతనిశ్చయుండై యుండె నంత నొక్కనాఁడు. ౧౭౧

క. ఊదరదాఁకినకుడ్యవి, ఛేదకతతివోలెఁ బాకభిన్ముఖదివిజుల్
వేదనలఁ బొరలి రాప్రహ్లాదునిచే నిజవిభూతి యపహృత యగుటన్.

గీ. అఖిలలోకరక్షుఁ డగుపుండరీకాక్షు, శరణుచొరఁ దలంచి సురలుమునులు
సత్యలోకనాథుసమ్ముఖమ్మున కేగి, యతఁడుఁ దారుఁ గూడి యాక్షణంబ.

వ. వైకుంఠవాసు వాసుదేవు వనధరశ్యాము వనమాలి వందారుమందారంబుం గనుంగొని రె ట్లనిన. ౧౭౪

క. శరణాగతపరిరక్షణ, కరణా ఋగ్వేదిజననికాయాభరణా
పరిణాహిశుభవ్యంజన, చరణా రణదళితశత్రుచయసంసరణా. ౧౭౫

ఉ. నీరధిరాడ్గభీర హిమనిర్మలకీర్తివిహార సజ్జనా
ధార సురాద్రిధీర హరిదత్తవిచార కవీంద్రబృందమం
దార విరోధినీరదకదంబసమీర సమస్తపుణ్యవి
స్తార కృపాప్రపూర ఘనధామవిభాకర శోభనాకరా. ౧౭౬

* గిలిమి

భుజంగప్రయాతము. మహౌదార్యశీలా సమాఖ్యాలవాలా
మహోపీతిహోత్రా రమావత్కళత్రా
సహాసావలోకా రసాపుణ్యపాకా
గృహీతాశ్రితాళీ నికృత్తాఘపాళీ. ౧౮౮

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాదసహజసారస్వతచంద్రనామాంక భారద్వాజసగోత్రపవిత్ర గామపిద్వన్మణికుమా రాష్ట్రఘంటావధానపరమేశ్వర హరిభట్టారక ప్రణీతం బైన నరసింహపురాణోక్తం బగు నుత్తరభాగంబునందు వర్షాశరద్వర్ణనంబును బ్రహ్లాదుండు సంక్రందనుమీఁద దండు వెడలుటయు నసురవరచకితుండై యాఖండలుండు చిత్రశిఖండిప్రసూతినిసీతిమార్గంబడుగుటయును సురాసురయుద్ధంబును నందు వృద్ధశ్రవుపలాయనంబును దితిసుతసూతి నాకలోకం బేలుటయు ననుకథలంగల చతుర్థాశ్వాసము.



శ్రీరస్తు.

# నారసింహపురాణము.

## ఉత్తరభాగము

### పంచమాశ్వాసము.

---

క. శ్రీశ్రితమందిర సంప, ద్వ్యాశ్రవణ వచోవిశేషవైచిత్రీచ
క్షుశ్శ్రవణసదృక్షు పురా, ణశ్రుతిపూతాంతరంగ నరసయరంగా. ౧

వ. ఆకర్ణింపు మాశౌనకాదులకు నాదరప్రథితుండై కథకుం డిట్లనియె నట్లు
నవ్యాక్షేపంబున పుండరీకాక్షు నిరీక్షణంబు సిద్ధించుటకుఁ బ్రవృద్ధప్రహర్షు
లైన యమరవృషభులా జగద్విభుం బ్రణామపూర్వకంబుగ నభినుతించిరి. ౨

—: బ్రహ్మాదులు విష్ణుదేవు స్తుతియించుట. :—

మ. జయ నక్తంచరగర్వవంచక జగత్సాక్షీ సరోజాక్ష ని
ర్ణయముక్తవ్యవహారఘోరభవదూరా వార్ధిపర్యంక స
ర్వయతివ్రాతమనోగుహాహారికిశోరా శౌరి శార్ఙ్గి కృపా
శ్రయ విశ్వంభర చంద్రశేఖరసఖా చక్రాయుధా శాశ్వతా. ౩

క. లోకంబులు సృజియించుచు, లోకాంతర్వర్తనము విలోకించుచు ను
ల్లోకప్రక్రియ మను నిను, మాకు స్నుతియింపఁ దరమె మధునిర్మథనా. ౪

క. వేదంబు లేమి నేర్చు, న్నీదుమహామహిమఁ దెలియ నిశ్వాసము లా
వేదంబు లెల్ల నీకు మ, హోదధిపర్యంక పంకజోదర కృష్ణా. ౫

క. అనుపమ మాద్య మమేయం, బనవధి నీతత్త్వవిభవ మైనంగానీ
జననీజనకులు నీవై, తను పెనుతువు గాదె ముజ్జగములు ముకుందా. ౬

సీ. నీకనుసన్న చే నిర్ణీత మయి కాదె యీయహోరాత్రంబు లేరుపడుట
నీపాదతీర్థంబు నెలకొంటచేఁ గాదె పాపంపు టసలెల్లఁ బలుచ నగుట
నీమాయఁ బుట్టిన యామూఁడుగుణములవలనఁ గాదే సృష్టి మొలచు టెల్ల
నీకృపావిభవ మస్తోకమౌటనె కాదె శిష్టరక్షణలీలఁ దుష్టి గనుట
నిన్ను నిదమిత్థ మగునని యెన్న నరిది, నీవిహారంబు లన్నియు నీకె చెల్లు
జలజదళనేత్ర నీరదశ్యామగాత్ర, సాధుజనమిత్ర మదమత్తశత్రుజైత్ర. ౭

చ. అని కొనియాడుచున్న చతురాననముఖ్యులఁ గాంచి స్మదలో
చనుఁ డను మీముఖాబ్జములచందము తేపటిచంద్రునందమై

పినుఁగుఁదనంబు సూపె నన బిమ్మిటి యించుక దేఱి పల్కి రా
మునులు నిలింపులున్ భవతమోహరు నయ్యహిరాజతల్పునిన్. ౮

క. నీ వంతర్యామివి యీ, జీవుల కందఱికి నీదు చిత్తంబున ల
క్ష్మీవర తోఁపనియది గల, దా వినవలతేని వినుము తత్త్రమ మెల్లన్. ౯

చ. అనిమొన నీవు నాఁ డటులు హాటకదైత్యుని గీటణంచి త
త్తనయున కైనయాపదలతండము నొందును జిక్కనీక పోఁ
జొనిపి కృపాకటాక్షములఁ జూచితి వారజనీచరార్భకున్
వనజదళాక్ష వాఁడె పగవాఁడగుచు న్మము నేఁచె నీచుఁ డై. ౧౦

క. ఖలజనబోధంబులు విని, యలుకం బ్రహ్లాదుఁ డిప్పు డమరపథంబున్
బలిమిఁ గొని మమ్ము నిందఱ,నిలయములకుఁ బాపెఁ బాపనిశ్చితుఁ డగుచున్.

సీ. ఇనరశ్ములకునైన నెడ యించుకయు నీని కాఱడవులలోనఁ దూఱిదూఱి
నక్రచక్రోదగ్రవిక్రాంతిఘోరంబు లేఱులఁ జేయీఁత నీఁదియీఁది
పులులుసింగంబులెల్గులు సహచరులుగాఁ గొండలోయలలోనఁ గుందికుంది
యెట్టిచప్పుడు విన్న నిదె వచ్చె నమరారి పదపదం డని సారెఁబఱచిపఱచి
కలఁగి తలగంప విరుగడగాక వలస, చేయుచున్నారమిఁక నేమి చేయఁగలదు
శ్రీవధూనాథ వాని శిక్షించి మమ్ముఁ,గావఁగదవయ్య మాకేడుగడయునీవ.

క. అని విన్నవించు వేల్పుల, ననుకంపాసంపదభిమతాలోకనఖే
లనలాలసములఁ దాపం, బునకుం బాపుచు మురారి ముదమునఁ బలుకున్.

చ. వెఱవకుఁ డేల యేఁ గలుగ వేదన మీకసురారులార యే
నెఱుఁగుదు దైత్యనందనునహీనపరాక్రమ మింక వాని నే
నణఁగఁగఁ బట్టి మీపదవు లన్నియుఁ గ్రమ్మఱ మీకు నిచ్చెద
న్మఱవుఁడు తొంటిదుఃఖములు*మాన్పుదు మానసపీడ లన్నియున్. ౧౪

క. ఎల్లింటి నేఁటిలోపల, నుల్లంబుల మీకుఁ గలుగునుడు కార్చెద భీ
తిల్లకుఁ డని వేల్పుల శ్రీ, వల్లభుఁ డత్యాదరప్రవర్ధితమతి యై. ౧౫

క. తగ వీడుకొలువ వారున్, జగదీశ్వరుపలుకులకుఁ బ్రసన్నహృదయులై
మగిడిరి ప్రహ్లాదుని బలు, మగఁటిమి వారింపఁదలఁచి మధుమథనుండున్.

—:నారాయణుఁడు వృద్ధబ్రాహ్మణవేషముఁ దాల్చుట.:—

సీ. తలమోచియున్న దుస్తరజరాభర మనఁ బాకపింగళజటాపటలి బిగియ
నొడలుగూనగుచుండ మెడయులోనికిఁబోయి జరఠకచ్ఛపరాజుచాయఁదోఁపఁ

---

* మానుడు.

జేవెలుం గిడి చూడ నేవస్తుతతి నైన నవ్యక్తరూపమై యవధిఁ బోవఁ
జరణవిన్యాససౌష్ఠవ మఖిలంబును నాధారయష్టియం దత్తమిల్ల
వలిపలితకర్కశాంగంబు వణఁకుగదురఁ,గంఠబిలమునసుక్కనగడలుకొనఁగ
వృద్ధభూసురవేషాభివృద్ధిఁదాల్చి, నాకపురి కేగె నిందిరానాయకుండు. ౧౭

క. ఆపురములోనఁ బూర్వపుఁ, గాపరియును బోలె నొక్కకడ జీర్ణకుటీ
రాపాదనపరతంత్రుం, డై పరమబ్రహ్మనిష్ఠుఁడై విహరించున్. ౧౮

సీ. ఆస్థానరత్నసింహాసనం బేయిందువదనకు నుత్ఫుల్లవనజవాటి
నవనిధానంబు లేనాగేంద్రయానకు లీలాకటాక్షమాలికలనిగ్గు
పుట్టిని ల్లేశరత్పుండరీకాక్షికి నమృతాభిరామమహా నంబురాశి
కడుపుచల్లఁగఁ గన్నకొడు కేవఘూటికి జగదేకవీరుండు శంబరారి
సరసమేయింతివిహరించుసౌధవాటి,పుణ్యములయిక్కయేభామభూరిమూర్తి
యమ్మహాలక్ష్మివృద్ధాంగనాభిరామ, కలితయైకొల్చియుండెనక్కపటవిప్రు.

క. ముత్తవ్వయుఁ దాతయు నని, తత్తాదృక్పౌరజనులు తము మన్నింపం
బుత్తడిచూపులమగువయుఁ, జిత్తజజనకుండు దివి వసించిరి మఱియున్.

వ. ఆశాంబరీభూసురుండు కాలనేమికి ననుకూలుం డయ్యును విప్రచిత్తిచిత్తంబు
వడసియు శూర్పకర్ణునికిఁ జుట్టఱికంబు నెఱపియు వృశ్చికరోమునకు వియ్యం
పువావిచూపియు వ్యాఘ్రదంష్ట్రునకు వశంవదుం డయ్యును గంకటునింట నుం
కువ గొనియుఁ గాలకేయునకుం గాలగతులు దెలిపియు వామనునకుఁ
బ్రేమాస్పదుం డయ్యును శంబరుం బాటించియు మఱియుఁ గలుగునిశాట
వీరులతోడఁ బోరామి యొనర్చుచుసుండె. ౨౧

క. తలలోపలినాలుక పూ, సలగ్రుచ్చినబాంధు దుగ్ధసంయుతజలముం
బలెఁ గపటభూసురోత్తమ, కులతిలకము దనుజపతులఁగొలిచిమెలంగున్.

సీ. కార్తాంతికాకృతి గైకొని యొకచోట జ్యోతిరాగములరీతు లెన్ను
నొకచోట, వేఁకి వెచ్చకు నగదంకారుఁడై మందు లిచ్చుచు నలవునెఱపుఁ
బరమపాశుపతరూపముఁ దాల్చి యొకచోట శైవతత్త్వార్థవిస్తరముగఱపు
నొకచోటఁ,బౌరాణికకులాగ్రగణ్యుఁడై యితిహాసములఁదెల్పునెన్నియైన
యోగియైయోగశాస్త్రంబులొక్కచోట, యోగవిదులకునుపదేశమొనరఁజేయుఁ
గపటనటనానటుండైనకంసవైరి,యాత్మనిశ్చితమగుకార్యమైనదనుక. ౨౩

క. ఆచతురచరితుఁ డఖిలని, శాచరులకుఁబూజ్యుఁ డగుచుఁ జరియించు సుధా
వీచివలమానమృదువా, చాచాతుర్యంబు శ్రవణసౌఖ్యము నొసఁగన్.

గీ. పొడగనియెనంత నొకనాఁడు పుడమి వేల్పు నిండుగొలువున నున్న యాక్షాంతలారి
విబుధవైరులు తనసాధువృత్తమెల్లఁ, జేరుకొని పేరుకొని కానిపించుకతన
క. నోరాగన్నులఁ జూచుచు, నారక్షోవరకుమారుఁ డవనీసురు బం
గారముగద్దియయం దిడి, గారవమునఁ బలుకు వినయగంభీరోక్తిన్. ౨౮
క. ఎందుండి రాక కాఁపుర, మెందులనో మీకుఁ గూర్చు హితు లిల్లాలు
న్నందనులు గలరె నిను నే, మందురు పే రెన్నుచోట ననఘవివేకా. ౨౭
క, నీవర్తనంబు నిఖిలముఁ, గైవారము సేయుచుండఁగా వినుచుందున్
ధావతి పడి(?) యీక్రియ నువ, ధావన సేయంగ నేల దనుజకులంబుల్.
క. సురకార్యార్థము వచ్చిన, పురుషుఁడవో కాక మమ్ముఁ బొడగని యేదే
పురుషార్థము మాచేఁ గని, మరలెదవో యనుడుఁ గపటమహిసురుఁ డనియెన్
సీ. నాయిక్క వైకుంఠనగరంబు ననుఁ దనుఁగాఁ జూచుచుండు శంకరసఖుండు
కులపాలికయుఁ గొడుకులుఁ గల్గివర్తింతు నారాయణాహ్వయోన్నతుఁడ నేను
బరమర్షి హృదయపద్మంబులఁ గ్రీడింతుఁ బుణ్యతీర్థముల నేప్రొద్దు నిలుతు
శ్రుతులు సూనృతవాక్యరతులు దాత లలుబ్ధు లావులు నాదురూపాంతరములు
నీవు దేవేంద్రు గెలిచి తన్నిఖిలరాజ్య, వైభవశ్రీలఁ గొనియున్నవార్త లేను
గిన్నరీగీతికల వినుచున్నకతన, నిన్నుఁ జూచెద నని వచ్చి నిలిచి తిచట.
చ. అనిమిషమానమర్దనవిహారమున న్నడిసన్నయట్టి మీ
జనకునిఁ బోలి శత్రుజనసంహరణం బొనరించి వాలుము
న్మొన నడిపించి తింటికి సముజ్జ్వలరాజ్యరమావిలాసముల్
దనుజకులేంద్ర యింత వలదా బలదారుణవృత్తి చూపఁగన్. ౩౧

—: వృద్ధబ్రాహ్మణుఁడు ప్రహ్లాదుం బొగడుట. :—

క. అనిమొన నీశరసంహతిఁ, దనువు సిరిగి దేవభర్త తల వీడఁగ బ
ల్గును కెత్తినపుడు మనయీ, దనుజకులము నవ్వకున్నె దనుజాధీశా. ౩౨
క. పావకుఁడు నీకృపాణము, చేవిదళితదేహుఁ డగుచు శిథిలప్రభుఁడై
చేవ చెడి పోవునప్పుడు, భావములో నెన్ను నీప్రభావ మధీశా. ౩౩
క. అంతకుఁడు శాంతుఁడై నీ, దంతిఘటలకాలుమట్లఁ దనసైన్యము లిం
తింతలు శకలము లైపడ, నంతఃకరణమున వందఁడా సురవైరీ. ౩౪
గీ. కులమువాఁ డటంచుఁ గోణపుప్రాణాన, కలుగ కీవు బాడుదలయువట్టి
విడిచినట్టి నీదువీరంబు సారంబు, గౌరవంబు నెన్నఁగా వశంబె. ౩౫

క. జలధిపతిబలపరాక్రమ, ములు జలలిపులుగ నొనర్చి ముచ్చెలువుజలం
బులు ద్రావించిన నీయు, జ్జ్వలవిక్రమ ముగ్రతరము శత్రుధ్వంసీ. ౩౬

క. గంధవహబాహుబలధా, రంధర్యము బుజలువైచి రక్షస్సేనా
సింధువు నుబ్బించిన నీ, బంధురరణకౌశలంబు ప్రస్తుతిఁ గనదే. ౩౭

క. ధననాథు నతని చెలికా, నినపోలెఁ భైక్షవృత్తి నిలిపితివి జనా
ర్దనుఁ డెన్ను నెపుడుఁ గూరుచు, జనములలో నీప్రభావసంపల్లీలల్. ౩౮

క. దానవకులవర్ధన యీ, శానశిరశ్చంద్రరేఖ సౌధస్థలసం
దానితదీపకళికగా, వే నిలిపితి వాక్కొ నిబిడవిక్రమగరిమన్. ౩౯

క. సురలోకము నరలోకము, నురగాధిపలోకమును సముజ్ఝితశత్రూ
త్కరముగఁ * బాలించెదునీ, విరివికి నొకఁడొదవ గలదు వినుమెట్లనినన్.

క. శ్రుతులకుఁ దత్తద్వితరణ, కృతులకు యతులకు నిలింపఖేదహాతులకున్
శతపత్రలోచనుఁడు మూ, లతలం బగు † నారసాతలగభీరముగన్. ౪౧

ఉ. కావున నాదిమూలమను నఖండపరాక్రమదాత్రధారచేఁ
దావు తెరల్చి తున్మక యుదగ్రము గాదు భవత్ప్రయత్న మో
దేవవిరోధి నిక్కము మదీయవచోవిభవంబు నిత్తెఱం
గీ వానరించి తేని గలఁడే నినుఁ బోలిన వీరుఁ డెయ్యెడన్. ౪౨

క. వామనసూచీముఖముఖు, లై మెలఁగెడు నీప్రధాను లనువాసరముం
దామెచ్చుదు రీవిధము మ, నోమార్గములందు దితితనూభవతనయా. ౪౩

వ. అని యమ్మహాస్థానంబుఁ గలయం గనుంగొనుటయు నెల్లవారలుఁ దద్విప్ర తల్లజప్రోక్తంబు లుత్తమోత్తమంబు లని దైత్యసత్తమునకు విన్నవించి రావం చనా ‡ చుంచురుండు వెండియు నిట్లనియె. ౪౪

క. బలముగలనాఁడ శత్రులఁ, బొలియింపఁగఁ దగు సమూలముగ వేరున్నం
దల లెత్తు వెండియును హల, హలనిభవీరారికులలయానలకీలల్. ౪౫

సీ. వేదతుల్యములు మద్విమలవాక్యములిందు సంశయింపకుము రాక్షసకులేంద్ర
హరి సురావళి కెల్ల నాధారమై యుండు నతని గెల్వక యున్న నమరపదము
చేకూరు నెల్ల నస్థిరము గావునఁ బ్రయత్నము సేయు తజ్జయోత్సాహమునకు
నామిత్ర మగు, నైన నాళీకదళనేత్రు మాయావి గాన నమ్మక చరింతు
ననినఁ బ్రహ్లాదుఁ డిట్లను నవనిదివిజ, వర్య నీపల్కు లెల్ల నవద్యదూర
తరము లెచ్చోటనుండు శ్రీవరుఁడు నాదు, కట్టెదుర నిల్వకున్న నేకరణి గెల్తు.

---

* పాలింప్పెదు. † సారసాతలగభీ. ‡ చుంచురుండు అనిచో, వేఱొక్కచోటనుం గలదు.

చ. జలముల నుండునో మఱి రసాతలగర్భముఁదూఱి యుండునో
కలుచన నొంటిగాఁ దగుచుఁ గానన వాటికనుండునో మహీ
వలయమ(?)మైనకంబమునఁ బాయక యుండునొ యెందు నుండు నా
జలధరవర్ణుఁ డీ వెఱుఁగఁ జాలుదు వాక్యము తదాశ్రితన్నలుల్. ౪౭

క. నావిని మాయాభూసురుఁ, డావిబుధద్రోహిఁ బలుకు నసురాధిప నీ
కావిష్ణు నేనె చూపెదఁ, గావలయున యేని వేగఁ గదలుట యొప్పున్.

చ. అని తన కాప్తుఁడై పలుకు నమ్మతకంవుఁబిసాళిపంకుఁ(?)బా
ఱునకు సురారి యిచ్చె నదరు ల్వెదచల్లు శరీరకాంతులం
దనరువధూజనంబుల మదావళిపంక్తుల మేలితేజులన్
ధనకనకాంబరావళుల దానజనంబుల సుప్రసన్నుఁడై. ౪౯

క. అవి యెల్లఁజూచి యిట్లను, నవనీసురనూతి నగుచు నసురాధిప న
న్నవివేకిఁగాఁ దలంచితి, వివి నా కేమిటికి నిన్ను నే వేఁడితినే. ౫౦

క. జలములు వల్కలములుఁ బం,డులుఁ గూరలుఁ గాక యతికతోరనియమశ
ష్కులులై యుండెడువారికి, వలయునె బహువిధపదార్థవై భవసుఖముల్.

క. పరపురుషార్థము సేయని, పురుషులజన్మంబుఁ బొల్లువోయినకొలుచున్
సరిగానఁ బరుల కుపకృతి, పొరయింపఁగవలయు ననుచు బుద్ధిఁదలంతున్

క. నీవస్తువు లివి నాయవి,గావా దేవా విధూతకైటభనిభను
శ్రీవిభవ గిపుల గెలిచిన, యావేళ నొసంగవయ్య యఖిలార్థములున్.

క. వైకుంఠనగరవస్తువు, లీకొలఁదులయవియు వాని నేనొనరింతు
న్నీకై వసముగ నిప్పుడ, నాకౌకఃప్రత్యనీకనాయక యనుడున్. ౫౪

క. విప్రునిసౌహార్దము నా, విప్రునివైరాగ్యగుణము విప్రుని మృదువా
క్యప్రౌఢియు మది మెచ్చుచు, నాప్రహ్లాదుండు నిశ్చితాశయుఁ డగుచున్.

క. తనతనుసంభవుని విరో, చను బురరక్షకు నొనర్చి సైన్యసహితుఁడై
దనుజుఁడు వైకుంఠపురం,బునకుం జను భూసురోత్తముఁడు తెరువొసఁగన్.

స్రగ్ధర. హరిమీఁదం దాడివెట్టెన్ హరిహయరిపుఁ డం చద్భుతాక్రాంతులై ని
ర్జరవైరుల్ భూరిభేరీస్వనములు చెలఁగన్ సర్వసైన్యంబుల న్నీ
కరలీలం ద్రోయఁ జేయం గలఁగె నభము దిగ్దంతు లాటాడెఁ దారా
పరిషత్తు ల్మత్తియంబుల్ బలె ధరఁ దొరఁగెం బర్వె దుర్వారరేణుల్.

క. భూమిపయిఁ బర్వతంబుల, పై మరుదధ్వంబుపై నపారములై ను
త్రామరిపువాహినులు చను, భీమగమనరేఖ జగము బిమ్మిటి గొలిపెన్.

—:ప్రహ్లాదుఁడు వైకుంఠముపై దాడి వెడలుట.:—

సీ. ఆకాశమండలం బనుసుప్పముస్నిటి కౌర్వాగ్నిశిఖ లయ్యె నాయుధములు
ముదురు వెన్నెలగాయు ముక్తాతపత్రసంతతులు చంద్రానవస్థలు ఘటించె
రవిమీఁద దండెత్తు రాహుగ్రహంబులకరణిఁ బతాకానికాయ మడరె
భువనంబులెల్ల నాపోశనంబుగ మ్రింగె జగతీరజఃకుంభజన్మమూర్తి
శబ్దమయములుగావించెసకలదిశల,మురజఢక్కాహుడుక్కాదితరళరవము
లవనిదైవతదృష్టమార్గానుసరణ, మాచరించి సురారిసైన్యములుదళుమ.

క. మాయావిప్రాకృతి యుగ, నాయఖిలేశ్వరుఁడు నిర్జరాహితబలమున్
వే యాకర్షించె సహ, స్రాయుతయోజనము లొక్క యరనిమిషమునన్.

ఉ. ఎక్కడఁ జూచిన న్వనము లెక్కడఁ జూచిన వాహినీకులం
బెక్కడఁ జూచిన న్మృగము లెక్కడఁ జూచిన దావపావకం
బెక్కడఁ జూచిన న్విషధరేశ్వరఫూత్కృతులై మనోభయం
బెక్కుఁగఁ జేసె దైత్యులకు నేగెడు మార్గము దుర్గమాకృతిన్. ౬౧

క. అంతర్ధానము నొందె ము, రాంతకుఁ డాఘట్టమున భయాకులమతులై
చింతాజలధి మునింగిరి, దంతావళతుల్యబలులు దైత్యాధీశుల్. ౬౨

క. అవు డొకచీఁకటి దోఁచెం, జపలతరయమస్వసృప్రసర్పద్వీచీ
విపులం బై సంఛాదిత, విపులం బై గిళితవస్తువిస్మృతి యగుచున్. ౬౩

శా. దూరోత్సారితవామనత్వముగ రోధోరంధ్రనీరంధ్రమై
యారూపంబున నంధకార మధికం బై పర్వఁ దోడ్తోన గం
భీరధ్వానముతోడఁ బెల్లు విసరెం బెన్గాడ్పు భూమీరజో
ధారాసారపరంపరాస్థగితభూతవ్రాతదృక్స్ఫాత మై. ౬౪

క. వీచుబలుగాలిఁ దూలుచు, నేచినచీఁకటియుఁ గాఁగ నెదవడి గమన
శ్రీచాతుర్య మడంగి ని, శాచరవీరులు భయప్రసక్తహృదయు లై.

సీ. అరదంబు లొరఁగిన నట్టిట్టు చనలేక వికలప్రయత్నులై వెకలువారు
దంతిసంతతి పరిభ్రాంతి నిట్టట్టు గా మరలింపనేరక మరలువారు
సైంధవస్కంధంబు జడిసి వికీర్ణమై పోవ నొండనలేక పొగులువారుఁ
బత్తివిపత్తిసంప్రాప్తి చిత్తంబుల నొత్తరించిన నుడుకొందువారు(ఉచువారు
గొడుగులుఁ బతాకలును గూలఁ గుందువారుఁ, జామరధ్వంసమునకు వాచ
నైరి ఘోరాంధకారవికారకలిత,గాఢవాత్యానిగుంభంబు గసిమసంగ.

క. శల్లాచదరైదానవ, వల్లభుసైన్యములు విష్వ వాసవరిపుఁ డు
త్ఫల్లీల నిలిచె నొక్కెడ, పొల్లడలిన వెలయు ధాన్యపుంజముపోలెన్. ౬౭

వ. ఆప్రహ్లాదుం డప్రతర్కితవీరరసప్రసారుండై మహాసారసారవర్ణంబును మహిత
జనయోగిహృదయాభ్యర్ణంబును మంజులప్రభానుభావవికీర్ణంబు నగుతత్త్వం
బు సాత్త్వికబుద్ధిం దలంచుచుం గలంచునలఘుతమఃపుంజంబుగుఱించివిరించి
బాణప్రయోగంబు సేయుటయు. ౧౮

క. తమ మెల్ల నణఁగె వాయు, క్రమవిక్రమణంబు నడలెఁ గానఁగవచ్చెం
గమలాప్తబింబ ముజ్జ్వల, తమమై దివిఁ దోఁచెఁ జంద్రతారాచయముల్.

క. ఆపన్నగవజ్రాయుధు, నాపన్నగశాయిఁ దలఁచునంత నసురహృ
త్తాపంబు లణఁగెఁ జాలఁ బ్ర, దీపించెఁ బ్రబోధరవి యుదీర్ణప్రభుఁడై. ౨౦

గీ. పొడివియున్న బలము లదవద మైపోవ, నుప్పుగల్లువోలె నొక్కెడ నిలిచి
శాంతుఁ డగుచు నసుర చింతించుఁ దనలోన, దేవనుతము వాసుదేవమహిమ.

సీ. ఇంతయై యంతయై యేమియు నెఱుఁగని నావర్తనంబు లున్నతికిఁ దెచ్చెఁ
బ్రాణగొడ్డములైన బలుసంకటంబులు పాయంగఁ ద్రోచి శోభవమునొసఁగెఁ
బరమతత్త్వ మెఱుంగు బ్రహ్మర్షికులములో న న్నగ్రగణ్యుఁగా నెన్ని మనిచె
నిబిడతామసగుణాన్విత మైనకులమునఁ బుట్టినాఁ డనక చేపట్టె నన్ను
నట్టిహరికిని భృత్యులో నమరవరుల, దుష్టజనబోధములు విని తూలఁ జేసి
వాసివహియించియున్న నావరభుజోరు, శక్తియిట్లయ్యెఖలులకుజయముగలదె

సీ. హరిదాసు లగువార లఖిలధర్మజ్ఞులు హరిదాసు లుజ్ఝితదురితభరులు
హరిదాసు లాగమోత్కరశుకపంజరుల్ హరిదాసు లురుకీర్తిహారయుతులు
హరిదాసు లనఘులు హరిదాసు లప్రమేయారంభతత్త్వనిత్యస్థలములు
హరిదాసు లెవ్వసియాలయంబులైనఁ జనిరి వైకుంఠ మాస్థలము లెల్ల
నట్టిహరికిని దాసులై యతిశయిల్లు, వృత్రశాత్రవముఖులైన విబుధులకును
నెగ్గు సేసితిఁ గావున నిపుడు నాకు, నిట్టి దుర్దశవాటిల్లె నేది గతియొ. ౨౩

క. దుర్బోధకరులు సఖులున్, మార్బలముల గెలువఁజాలు మత్పరికరముల్
నిర్బంధము నొందిరి భువ, నార్బుదసంక్షోభకృన్మహావిలవిహృతిన్. ౨౪

క. ఘోరవనంబులు నక్ర, క్రూరమహానదులు విపులకూటనగేంద్ర
త్మారుహములు దక్కఁగ నె, వ్వారుం బొడసూప రెట్టివడువో యిచటన్.

క. ఏ నెంతదవ్వు వచ్చితి, నో నాకము వెడలి మున్నొగతిఁ దత్సం
ధానము లోఁపదు వికలత, మానసమునఁ బర్వె నెట్టిమత మీమతమో.

ఉ. నేరుపునేరము ల్కలపనేరఁడు సారసపత్రలోచనుం
డారజనీచరారిచరణాంబుజము ల్మది నిల్పియున్న నె

వ్వారికి నైన నన్ను గెలువం దరమా పరమార్థసార్థగా
ధారభటీవిహారు లగు నాదిమును ల్వీపదబ్ధిమగ్నులే. ౮౦

—: ప్రహ్లాదుని పశ్చాత్తాపము. :—

క. కొడుకులు తప్పులు చేసిన, యెడ విడువం దగునె తండ్రి కిటువలెనే పో
 బెడదలు గొలిపెడుభక్తుల, యెడవిసువక బుద్ధి యొసఁగు టిభవరదునకున్.

సీ. సర్వాశయస్థాయి సర్వేశ సర్వజ్ఞ సామగానప్రియ సాధువినుత
 నిర్మల నిరవద్య నిత్య నిశ్చలరూప నిరతిశయానంద నీరజాక్ష
 పరమాత్మ పరమేశ పరతత్త్వపారగ పరమదయాలోల భక్తిగమ్య
 కమఠాంగ కమలేశ కమలాసనార్చిత కామాదిశత్రుసంఘాతదమన
 దేవ దేవేశ దేవారిదృగ్విదూర, సత్య సత్యామనోనాథ సాత్యకినుత
 వసుమతీధర వసువంద్య వాసుదేవ, ప్రోవు మాపన్నిమగ్ను నాబోటివాని.

సీ. నీమేటిసెమ్మేనిరోమకూపంబుల బ్రహ్మాండకోటు లుద్భవమునందె
 నీపదాంబుజముల నేపారు మిన్నేఱు తివిరి కెందమ్ములఁ దేనె వోలె
 మఱుఁగైన నీమహామాయాంధకారంబు చింపంగ లేరు సలింపు లైన
 సంవర్తవటపత్త్రశాయియై నీకన్ను మూయుట సృష్టియు మోడ్పు లయము
 నయ్యెనిన్నెన్నఁగాఁదరంబా నెమాని, మానసాంభోజకర్ణికామధులిహేంద్ర
 నన్ను నాపన్నుఁ బ్రోవు సంపన్నకరుణ, నరుణకరచంద్రనేత్ర సత్యాకళత్ర.

క. నాకున్ బుద్ధులు చెప్పిన, యాకోవిదవరుఁడ వీవ యటు గాకున్నన్
 వీకున బహుయోజనమిత, మీకడ కెవ్వాఁడు దెచ్చు నీనాసేనన్. ౮౧

శా. ఓనాభీభవపద్మ యోభవహరా యోయోగిమోక్షప్రదా
 యోనిత్యోన్నత యోనిశాచరహరా యోదీనకల్పద్రుమా
 యోనమ్రప్రియ యోకృపాజలనిధీ యోభక్తిగమ్యోదయా
 నీనామంబు నుతించువారలకు నిర్నిద్రత్వ మౌ టబ్రమే. ౮౨

ఉ. ధూసర మొందు వోయితివి ధూమ్రశిరోరుహ నీకుఁ బాడియే
 కాసరవాహనాదిసురగర్వ మడంపక పెంపు దింప ను
 ల్లాసము నొందు నాతలఁపులన్ ఫలితంబులు సేయ కోసర
 గ్రాసకులంబ డంబు చెడఁగా నగునే తగునే తొలంగఁగన్. ౮౩

క. వచ్చితిఁ గడు దూరము నా, కిచ్చట నెవ్వారు గల రహీనకృపాఢ్యుల్
 విచ్చలవిడిఁ బ్రేలెదు నా, నెచ్చెలిగమి యింత సేయునే దుర్బుద్ధిన్. ౮౪

—: ప్రహ్లాదునికి విష్ణుమూర్తి ప్రత్యక్షమగుట. :—

గీ. అనుచు దానవకులసింహ మపుడు తోఁక
నీరు మోచి గజేంద్రుని గౌరవమున
శార్ఙ్గిఁ గుఱియించి ఘోషించుసమయమున ము
రారి ప్రత్యక్షమయ్యె నయ్యనఘమతికి. ౮౫

వ. ఇట్లు సాక్షాత్కరించి యప్పుండరీకాక్షుండుపక్షిపరివృఢదృఢస్కంధారూఢుం డై రోహణశిఖరిశిఖరావలంబి నీలాంబుదంబుచందంబున ననల్పసౌందర్య మందిరుం డై యిందిరాదేవి పొలయలుకలకలకలం గలంగి యందంద వందనం బాచరింపం దదీయసీమంతసిందూరరజోరంజితంబు లనం గెంజాయ రంజిల్లు చరణపల్లవంబులును నడుగునడుగునం బొడమినమిన్నెటి తేటనీటం బర్యటనంబు సేయు పాఠీనంబులపరిపాటిం బాటిల్లు చిందంపుమీలమేని జాలిగల పొలపంబుఁ దెలుపుచు బలభిదాదిదివిజకిరీటకోటిమాణిక్యశాణోత్తేజనంబున రాజిల్లుచరణనఖరశిఖరంబులును గాంతిలీలాకళాచికలై జానుచ్ఛాయాద్విగుణితశోభాభిరామంబు లై యిలేందిరాకరారవిందోపలాలన పరిస్పంద*మందిరంబులై సొంపొందుజంఘల యలంఘ్యప్రభావిభవంబును నభిరామనాభీకమలవిమలపరాగపరంపరా †పిహితంబు లగు నివియన ధగద్ధగని చిగురుపసిండికాసియ వాసికెక్కు చక్కని యూరుప్రదేశంబును గాంభీర్యంబున నంభోజసంభవుం డొక్క చక్కిం జిక్కి చేవమ్రానుదొలఁచు నలికలభంబు సులభగతి నతీతానాగతంబులు చింతింప నత్యంతకాంతిమంతం బగుచు శోభిల్లు నాభిపల్వలంబును ద్రివళీవలయవలయితంబై గుణత్రయవిచిత్రమూర్తి యగు మాయప్రోయాలునుం బోలెం గ్రాలుచు గగనతలవివర్తం బై సూక్ష్మేక్షణలక్షితంబగునవలగ్నంబు ‡సొగువునునగణిత ముక్తాదామాభిరామం బై ప్రేమాస్పదం బగుచుం గందర్పకరకంబు బిబ్బోకంబు|| నాగడంబు సేయు కంధరాధౌరంధర్యంబును నాజానులంబితంబులై తేజరిల్లుచు ననర్ఘ్యమణిమయముద్రికాముద్రితాంగులీకనలయంబులుం బన మీఱి శోభిల్లుచు నల్లోకలావణ్యాపణ్యస్థలంబు లగు నతిస్థూలబాహాస్థానంబులును నపరిక్షీణ జలధరశకలకలిత నభోభాగంబు బాగున నంచిత శ్రీవత్సలాంఛనం బగువత్సప్రదేశంబునుం జంద్రమండలంబు బెండుపఱిచి ముకురంబును వికవిక నగి జిగిదమ్మియొమ్మెలడంచియుదంచితవిలోచనపుండ

* మందిరంబ్బులంబ్బులై †బహితంబ్బు. ‡సోగిపును. ||న్నాగంబ్బు శేయు.

రీక పలాశపేశల ప్రభాభిరామంబై యుద్దామనిగమనిశ్వాస వికస్వరనాసా
పుటఘటితంబై కుటిలకుసుమశరశరాసనసౌభాగ్యభాసమాన భ్రూలతాలా
లితంబై మకరకుండలమండితగండస్థలంబై యఖండాఖండలకోదండఖండ
పరిహాసనపండిత కిరీటమండలంబై పదనుమీఱు వదనవనజంబునుం గలిగి
వేదలతావితానంబునకుం బాదును నస్తోకశాస్త్రనిస్త్రింశంబునకు నొఱ
యును బురాణపటిమాపరిణామంబునకు శరణంబును నితిహాసకిసలయంబు
లకు రసాలశాఖియు మంత్రంబులకు శుద్ధాంతంబును దంత్రంబులకుం దగిన
నెలవును యోగంబునకు భాగధేయంబును విజ్ఞానంబునకు నుపజ్ఞంబును వివే
కంబునకు నాకరంబును విభవంబులకుఁ బ్రభవస్థలంబును నైనరూపంబు దీపిం
పం బురుషోత్తముండు పురాణపురుషుండు భూతభవ్యభవ నాథుండు భోగి
శాయి భూధరధరుండు మాధవుండు మధువైరి మథితకైటభుండు మందాకి
నీచరణుండు మఖఫలప్రదాత ప్రత్యక్షుంబగుటయు నుత్క్షిప్తమానసవికారుం
డై హిరణ్యకశిపుకుమారుండు మారజనకునకుం బలుమాఱుం బ్రణమిల్లి
యిట్లని నుతించు. ౮౬

దండకము. శ్రీమానినీప్రాణనాథా నమద్భక్తయూథా త్రిలోకైకరక్షానమాసక్త
చిత్తా యయత్తావిదూరప్రచారా మహీమానచోరా మురారాతి నీరీతి
యేవంవిధం బంచు నెంచంగరా దచ్యుతా సచ్చిదానందకందా ముకుందా
భుజంగేంద్రపర్యంక యీజంగమస్థావరాకారయౌ సృష్టి విస్పష్టమై పువ్వు
నం దావియుం బోలె నీమూర్తిలోఁ గానిపించు న్విరించి స్తుతా విస్తృతం
బైననీమాయ కన్నాయఁగా నెవ్వఁడోపు న్విధూతవ్యపాయా జపాయోగ
విస్ఫేరమై మీఱు కాశ్మీరఖండంబునన్ రక్తిమవ్యక్తి జొత్తిల్లులీలన్ గుణ
శ్రేణి శ్రేష్ఠు న్నినుం గప్పి యుండు న్మణీకుండలస్ఫారగండస్థలా పుండరీ
కాక్షయక్షీణజన్మాంతరాభ్యార్జితానేకపాపాటవీవాటికల్ వీటఁబోవు న్భవ
న్నామవర్ణావళీపావకజ్వాలచే మేలుగాంక్షించు దుశ్శీలుఁడైనన్నినున్లెస్సగా
నేకవారంబు హృత్కీలితుం జేయఁగాఁ జాలినన్ జాలిఁబోఁద్రోలి యుల్లోక
సౌఖ్యోన్నతి న్ముఖ్యవృత్తిం గన న్నేర్చు నన్న న్సదా నిన్ను నర్చించు
వర్చోనిధు ల్భాగ్యసంపన్ను లౌ నంచుఁ గీర్తింపఁగా నేల సద్గీతకీర్తీ మరుచ్చక్ర
వర్తీ భవత్సేవ బల్నావగాదా భవాంభోధి దాఁటింప వేదాఘపాటచ్చర
ధ్వంసి హింసాదిదుష్కర్మము ల్మాని సంసారి నయ్యు న్నినుం గొల్చియే
నిల్చి నిష్ఠాగరిష్ఠుండ నై నిర్మమత్వంబునన్ ధర్మసంపాదినై యుండి యట్లుం

డఁగాలేక వల్గాకినాకాహితానీకము ల్వర్వి నిర్బంధముం జేసి దుర్బుద్ధినుద్బు
ద్ధముం జేయఁ గ్రుద్ధుండనై మీఱి వృద్ధశ్రవున్ బద్ధవైరంబునన్ యుద్ధకేళి
న్విభాళించితిం గ్రించనై వంచనాచుంచురత్వంబున న్నీపదాంభోజము
ల్వ్యాజగానింపఁగాలేక చీకాకులంబొందితి న్వందితిన్నేఁడు పెన్నాటకంబైన
యీమేటిపెంజీఁకటి న్వీఁకదక్కన్ భయం బుత్కటంబయ్యెఁ జిత్తంబు
కృత్తంబు గాఁజొల్చుఁ దూలెం గరాళంబు లౌచుగ్ర సురాళంబులై వాలు
మద్వాహినీజాలముం దూలముం బోలె దిక్కూలముల్ చేరెఁ గారుణ్య
ముం జేయవే పుణ్యసంపాదకా సంపదేకాశ్రయా యాశ్రమస్థైర్యనిర్వా
హకా సర్వసంవేద్యవిద్యానిధీ భూసురేంద్రప్రియా యాసురప్రాణనిర్మోచకా
మేచకాకార నాకానిదుర్వృత్తముల్గత్తిరింపింపవే యుత్తరింతున్ మదూర్మి
స్ఫురద్గర్వవార్వల్లభుం బ్రల్లకంబుం గడం ద్రోచి నీముద్రల న్మోచి నీవారికి
న్నీకునుం దప్పి యుష్పాంగ నెవ్వేళలన్ భవ్యదివ్యాస్త్రస్వాహాన్వధారూప
తాపత్రయోచ్చాటనావ్యగ్ర ఘోరాగ్రహగ్రాహమస్తచ్ఛిదాకాశలోదార
ఖేదారరచ్ఛన్నహృత్తుంభిసంభావనాసంభ్రమారూఢగాఢప్రబోధా, సుధా
శీతళా దేవదేవా నమస్తే నమస్తే నమః. ౧౭

మ. అని నక్తంచరరాజనందనుఁడు దీనాకారుఁడై ప్రస్తుతిం
చినఁ బంచాస్త్రగురుండు భూరికరుణాసిక్తేక్షణాంభోజుఁడై
యనఘాత్మా యిటు రమ్ము రమ్మనుచు డాయం బిల్చి తన్మస్తకం
బునఁ గీలించె రమాకుచద్వయకుభృద్భూన్యస్తమున్ హస్తమున్. ౧౮

వ. ఇట్లు హస్తివరదుండు హస్తమస్తకసంయోగంబు సేయుటయును నయ్యామ
రారి కొమరారి విమలతరనిజహృదయమణిముకురోదరప్రతిఫలితలలితప్ర
బోధమాధురీసాధురీతిప్రసారుండై సంసారపాండిత్యంబున వెండియు
నయ్యండజాధిపస్కంధారూఢునకు గాఢభక్తిం బ్రణామంబు లాచరించి
వాచాలతాచమత్కారంబులు మెఱయ నప్పరమపురుషుం బురుషత్రయ
స్వరూపుం బరావసుం బొగడు నవసరంబున నగణితజలధరజాలవినీలం
బగు నంధకారం బున్మూలితం బయ్యె నుత్తాలంబులై యొత్తరించుసప్తమా
రుతప్రకాండంబు లొండొండ చండిమశి యథాపూర్వప్రధావనంబున
బరిమీఱుట మాని మేనులకుం దనువు సొనిపె నుత్పాదితగగనకోటర
విపాటనంబులగు సికతావర్షంబులు పరిహృతంబు లయ్యె నయ్యెడ. ౧౯

సీ. ఎక్కడఁ జూచిన నిందిరాసుందరీప్రతిమపురంధ్రీప్రపంచలక్ష్మి
యెక్కడఁ జూచిన హేలాలసత్కీరపరభృతాకీర్ణకల్పద్రుమంబు
లెక్కడఁ జూచిన నివతాళమున జాలువాఱు సిద్ధరసప్రవాహకోటి
యెక్కడఁ జూచిన నిభతురంగస్యందనామందభటసముద్దామగరిమ
గలయ నెక్కడఁ జూచినఁ గమలగర్భ, శంభుజంభారిముఖ్యనిర్జరకులంబు
గలిగి రెండవవైకుంఠకటకమనఁగ, నాప్రదేశంబు తోఁచె నయ్యసురపతికి.

క. తనమంత్రులఁ దనసేనలఁ, దనమిత్రులఁ గాంచె నచట దనుజేంద్రుఁడు చూ
పనిమిషముగ నిష్కంపిత, తనుఁడై చిత్తరువు కరణిఁ దావెఱఁగందెన్.

క. మును దనుఁ గొనివచ్చిన విప్రునిరూపము గానవచ్చెఁ బురుషోత్తముమే
నున నట్టిచందమంతయుఁ, గని ప్రహ్లాదుండు మస్తకచలన మమరన్. ౯౨

వ. అవిశేషంబు లన్నియు శేషశయను శాంబరీసమాడంబరంబు లని మ
నంబునం దలంచుచు నంబుజాక్షు గుఱించి మఱియు ని ట్లనియె. ౯౩

ఉ. నేరము చేసి యే నిఖిలనిర్జరలోకము శోకమంద దు
ర్వారమదాతిరేకమున వాలుట మాన్పఁ దలంచి నన్ను మా
యారచనాంబురాశికిని నగ్గము చేసితి వాత్మసంభవుల్
నేరక యున్న నేర్పుఁ గరుణించుఁ గదా జనకుండు శ్రీనిధీ. ౯౪

గీ. పన్నగములచేత బహుపాశములచేత, నాయుధములచేత నగ్నిచేత
నన్నుఁ గాచినట్టి నరమృగాధిప నీకు, నెగ్గుచేసినాఁడ హీనబుద్ధి. ౯౫

క. ఖలజనదుర్బోధంబులఁ, గలఁగె మనసు బోధమహిమ గనుమూసె మదం
బాలసె మహీసురసురపూ, జలు దినదినమునకు నీరసములై తోఁచెన్.

వ. సకలాంతర్యామివి సర్వసాక్షి వణురేణుతృణకాష్ఠంబులయందు దధిష్ఠింతు
వీసృష్టిచేష్టాప్రకారంబు నీకుఁ గటాక్షమాత్రంబు నవధరింపుము. ౯౭

సీ. గురునిందగావించు క్రూరాత్ముఁ డేనియు బ్రహ్మఘ్నుఁ డేనియుఁ బతితుఁ డయినఁ
జండాలపాషండసంగతుం డేనియు మద్యపానాసక్తి మత్తుఁ డైనఁ
జెనకరానివధూటిఁ జెనకినవాఁడైన సజ్జనపీడాప్రసక్తుఁ డైన
విశ్వసించినవారి వెతవెట్టు బలుఁ డైన దుర్మదాంధుం డైన ద్రోహి యైన
బహువిధమృషాప్రలాపలంపటుఁ డయినఁ, బుండరీకాక్ష నీపదంబులు దలంచు
వాఁడు నీవాఁడు నీకూర్చువారి వాఁడు, వాని కైవసములు ముక్తివైభవములు.

క. కుపథంబులఁ జరియింపక, విపరీతమతానుభవము వీక్షింపక మీ
కృప గలిగెనేని మనుజుం, డపవర్గసుఖంబు నొందు నఖిలాండపతీ. ౯౯

మ. వికలాంగుల్ విషమప్రచారులు రుజావిద్ధుల్ వినేత్రుల్ జడుల్
వికటాచారులు విత్తవర్జితులు నుద్వేలక్షుధాపీడితుల్
సకలాన్నగ్రసనాభిముఖ్యనిరతుల్ చండాలకల్పుల్ రమా
ముకురాస్యారమణా నినుంగనని దుష్మ్ముల్ ధర్మసంస్థాపకా. ౧౧౦

సీ. సింహాసనస్థులై సిరులునించినవారు భోగసంపదలచేఁ బొదలువారు
బహుపుత్త్రపౌత్త్రలాభముగల్గి మనువారు విద్యానవద్యులై వెలయువారు
సప్తసంతానప్రశస్తిగల్గినవారు ప్రత్యర్థిసార్థంబుఁ బఱపువారు
తాపత్త్రయవ్యథోద్ధతి నెఱుంగనివారు నిష్టాన్నదాతలై యెసఁగువారు
భవదుదారాంఘ్రిభక్తి సంపన్నులగుచు,మించితొలిమేనమిమ్ము సేవించినారు
వామన ముకుంద గోవింద వాసుదేవ,నలినదళనేత్ర పావనోన్నతచరిత్ర.

సీ. నారాయణాయ కిన్నరనరోరగయక్షసేవితాయ మునీంద్రభావితాయ
నారాయణాయ నానాభవక్లేశవిదారణాయ సమస్తకారణాయ
నారాయణాయ పన్నగరాజపర్యంకబంధురాయ విభిన్నసింధురాయ
నారాయణాయ గండస్థలాంచితరత్నకుండలాయ మహాస్త్రమండలాయ
జలధరశ్యామవర్ణాయ శాశ్వతాయ, కంజహస్తాయ యశస్తాయ గతభవాయ
తేనమోయనిపల్కు సాత్త్వికులకిహముఁ,బరముఁగరతలమాణిక్యపరికరంబు

క. దండించు నన్ను నెన్నే, దుండగములు చేసినాఁడ ధూర్జటిసఖ దో
ర్దండశితచక్రధారా, చండిమచే ననుడు భుజగశయనుఁడు నగుచున్. ౧౧౩

క. ఆలింగనంబుచేసెఁ గృ, పాలింగితహృదయుఁడగుచు నసురేంద్రసుతున్
లోలవిలోచనపాండుర, నాళీకములందుఁ గరుణ నవకము మీఱన్. ౧౧౪

క. హరిగాత్త్రస్పర్శంబున, సురవైరిమనంబు బోధశోభిత మయ్యెం
దరుణారుణకిరణకిరణ, పరిణతి వికసనమునొందు పద్మమువోలెన్. ౧౧౫

వ. అప్పుడప్పుండరీకాక్షుండు చతుశ్శ్రవఃపరివృఢసింహాసనాసీనుండై హిరణ్యకశిపునూనుం దనకుడితొడమీఁదఁ గూర్చుండ నిడికొని తదీయకపోలస్థలంబులు పుడుకుచు లజ్జావైవర్ణ్యంబు నుజ్జగించి బుజ్జ గిలిగింత లిడుచుఁ గొడుకు ముద్దాడువడు వడరం గొంతసేపు వింతవిలాసంబుల భాసమానుండై యయ్యమరాంతకున కిట్లనియె. ౧౧౬

క. ఏమీవు చేయుదువు ను, త్రామహిత దుష్టజనపరంపరకఱపుల్
నీమది తమోమయంబుగ, నీమాడ్కినొనర్చె దీని కేటికి వగవన్. ౧౧౭

ఉ. పుట్టిననాఁటనుండియును బుణ్యచరిత్రుఁడ వైనయట్టి నీ
పట్టున నొక్కతప్పు గనుపట్టినఁ గావఁగఁ బాడి గాక యి
ట్టట్టన నేర్తునే తనయునందలి నేరమి తండ్రి సైఁచి చే
పట్టక మానునే విమతభంజన సజ్జనచిత్తరంజనా. ౧౦౮

క. దనుజస్వభావమున నీ, మనమున నొక్కొక్కమాఱు మద ముదయించుం
గనుగలిగి తద్వికారముఁ, బెనుపక కడ కొత్తవయ్య పేర్చిన తెలివిన్.

క. నామీఁదిభక్తి దృఢతర, మై మది నొలయంగఁ జేయు మంతశ్శత్రు
స్తోమవిదారణకారణ, ధీమహిమ సముద్ధరించి త్రిదశారాతీ. ౧౧౦

గీ. సురవిరోధంబు మానుము సురలు ధరణి, సురలు ధర్మేతిహాసముల్ శ్రుతులు ననఁగ
మచ్ఛరీరాంతరము లివి మది నెఱింగి, చాలఁ బాటింపవయ్య విశాలకీర్తి.

వ. అనినం బ్రహ్లాదుం డాహ్లాదమధురహృదయుం డగు మధుమథనునితో
ని ట్లనియె. ౧౧౨

క. ధన మెల్ల ధాన్య మెల్లం, దనయుల నే నొల్ల రాజ్యతంత్రము నొల్లన్
వననిధిశయాన నీపద, వనజంబులమీఁదిభక్తి వదలమి యీవే. ౧౧౩

వ. దేవా యేవిధంబున భక్తులకు నీయందలి భక్తినిబిడసన్నాహంబై యుండు
ననిన నతనికి శతపత్రలోచనుం డి ట్లనియె. ౧౧౪

సీ. సంతతాచారసంసక్తాత్ము లగు వారు నుసలక సత్యంబు నొడువు వారు
నభ్యాగతార్చనం బాచరించెడువారు నిగమార్థములయాఁదినిలుచువారు
దుర్జనసంసర్గదోష మెల్లనివారు పరకామినీకాంక్షఁ బాయువారుఁ
గలనైన నాఁకొన్నకడుపుఁ జూడనివారు గురుసపర్యాసక్తిఁగొఱలువారు
నిత్యనై మిత్తికముల యన్నింటియందుఁ, బట్టువదలక నిష్ఠఁ జూపట్టువారు
నాదుభక్తులు, వారలనడక యిట్టి, దద్భుతవివేకకలితతత్త్వావలోక. ౧౧౫

క. మద్భక్తులకును బరమప, దోద్భాసిసుఖంబు నొందు నుత్సవము మదిం
బ్రోద్భవమగునేనియు నది, సద్భావంబున నొనర్తు జాడ్యవిదూరా. ౧౧౬

వ. మఱియుమన్మంత్రజాపకులునుమన్నామస్మరణస్ఫురణాభిరామహృదయులును
మద్వ్రతాచరణ పరిణతనియమకృశీభూతశరీరులును మత్పూజాప్రయోజన
విరాజమానులును మత్కథాశ్రవణప్రవణకర్ణకుహరులును, మద్రూపాంత
రంబు లగుమహీసురులు మాననీయు లని మన్నించుమహామహులును మత్ప
దంబుం బ్రాపింతు రాపద్మభవఫాలలోచన బలవిరోధిపవనసఖభానుమత్సూ
ను పలలాశన పాశధర పరిమళరథ భర్గసఖప్రముఖ నిఖిలనిలింపులును యత్

పక్షిరక్షోగంధర్వ సిద్ధసాధ్యతపోధనాది వివిధామరవిశేషంబులును మ దాజ్ఞాచక్రంబునం భరిభ్రమించుచుండుదు రేను భానుకోటిప్రభాభాసమానంబును శ్రీసమేతంబును సుధాజలధిమధ్యమణిమండపవిహారియును మారుతభుగధీశ్వరతలిమతలవలమానంబు నైన పురుషాకారంబు తోరంబుగ నుదారభుజావిజృంభిత ప్రహరణోద్భాసినై వర్తింతు నామూర్తివిస్ఫూర్తి నీవంటి పావనహృదయులు దక్కఁ దక్కినవా రెఱుంగరు, నాయందలిభక్తి యవ్యభిచారిణి యగుటకు నుపాయంబులు గొన్నిగల వవి వినిపింతు విను మని దనుజమర్దనుం డనిమిషమర్దనునితో నిట్లనియె. ౧౧౭

క. ధరణి మదర్పితముగ నాచరితంబగువ్రతము మోక్షసాధక మై సుస్థిరలక్ష్మీకర మై సంగరజయదం బగుచునుండుఁ గల్మషరహితా. ౧౧౮

క. వివిధవ్రతములలోపల, రవి గ్రహములయందు మించురహి వహియించున్ భువనంబుల హరివాసర, మవదాతయశోవిలాసహసితశశాంకా. ౧౧౯

గీ. బహువిధానేకవిభవసంప్రాప్తికరము, కలుషతిమిరౌఘవిచ్ఛేదకారణంబు భర్గసంసేవ్య మపవర్గవర్గదాయి, సువ్రతం బగు నేకాదశీవ్రతంబు.

క. భాసురముక్తిరమాప్తి, కాసర మై సకలసౌఖ్యకమలశ్రేణీ కేసరమై చెన్నగుహరి, వాసర మావ్రము సలుపవలయు మహాత్మా. ౧౨౧

వ. ఏతన్నిమిత్తంబుగ నొక్కయితిహాసంబు గల దాకర్ణింపు మని గోకర్ణశయనుం డాకర్ణనకుతూహలపరవశుండగు దైతేయప్రసూతితో నిట్లనియె మున్నఖిల విభవవిభర్త్సితనిర్జరావసథం బగు గూర్జరదేశంబున శరచ్చంద్రంబను నొక్కపురవరంబు వెలయుఁ దదధీశ్వరుండు. ౧౨౨

—: శ్రీహరి ప్రహ్లాదునకు హరివాసరమహిమఁ జెప్పుట. :—

సీ. కడవీను లంటినకన్నుదోయికి దృష్టి సకలశాస్త్రార్థదర్శనము గాఁగఁ బొంకంబులై యొప్పు భుజశిఖరముల కాతతభూష వసుమతీభృతియ కాఁగ మేరుసన్నిభమైన మెఱుఁగునెమ్మేనికిఁ గవచంబు వినయసంకలన గాఁగ హస్తిగంభీరమా యానలక్ష్మికి నొప్పు మేరమీఱని నేర్పు మెలఁపుగాఁగ వెలసెఁ గదనాభిముఖశత్రుకలభనిటల, విఘటనారంభశుంభన్నవీనతరకృపాణవల్లీపరిష్కృతపాణితలుఁడు, భోజుఁడను రాజు ధీమణీసరోజసూతి.

క. అతనికిఁ బురోహితుం డై, సతతోన్నతి వెలయు విష్ణుశర్మఁ డనఁగ నున్నతివడయు భూసురేంద్రుఁడు, శతమఖునకుగురుఁడువోలెసాధువినతుఁడై.

ఉ. వేదపురాణశాస్త్రపదవిం దుదివిన్కి యెఱింగి ధర్మసం
పాదితయాగతంత్రుఁడయి బాంధవపోషణకామధేను వై
నాదెసఁ గల్గు భక్తికతన న్విలసిల్లె నతండు తొల్లి ప్ర
హ్లాద పటుప్రసాదనిఖిలస్తుతభూరిదయామయాశయా. ౧౨౫

వ. ఆవిష్ణుశర్మ తనధర్మపత్నియందు మందేహుం డనునందనుంగాంచి యావి
ర్భూతబుధగ్రహుండగు సుధాకిరణుకరణింబరిణమించెనావిప్రకుమారుండు

క. కాలోపనీతుఁడై గురు, జాలంబులయొద్దఁ జదివె సకలాగమముల్
నాళీకగర్భునన్నిధిఁ, దాలిమి మును భృగువుచదువు తాత్పర్యమునన్. ౧౨౭

శా. వాచాచాతురి వక్కణించు సభలన్ వైదగ్ధ్యహృద్యంబుగాఁ
దూచాతప్పఁడు వేదవాదములయందు న్నవ్యకావ్యోదయ
శ్రీచాతుర్యము సంఘటించు ద్రుహిణస్త్రీమూర్తి విస్ఫూర్తి తై
భూచక్రస్తుతుఁ డైనవిప్రతనయుం బోలంగలే రెవ్వరున్. ౧౨౮

వ. ఆమందేహుండు సదసత్సందేహాగోచరావలగ్నయై సులగ్న యనుపేరి పురం
ధ్రిం బెండ్లియై నిజజ్యేష్ఠభ్రాతలగు విధాతృధాతృ సంయాతి యయాత్యను
యాతి భూతి ప్రభూతిచ్యవనులకు నవిధేయుం డై వివిధవిభవానుభవంబుల
నభినవయౌవనసౌభాగ్యంబు సఫలంబుగఁ జేయుచు నుండె. ౧౨౯

సీ. అనుదినాభ్యంగంబు నభినవధౌతవస్త్రాదరణంబు ననర్ఘ్యరత్న
భూషణాకలనంబు భూరిసౌరభగంధసాంకస్తూరికాచర్చ విక చ
విచికిలదామసంవేల్లనంబును బరమాన్నభోజనమును నాటపాట
లానసన్నతీర్థయాత్రానుకూల్యంబును ఘుర్ద్యూతకేళియు ధూర్తరతియుఁ
గలిగి దుర్వారసంసారగౌరవంబు, దలఁపఁ డొకనాఁడు వేదశాస్త్రములువిడిచి
వీటఁ గ్రుమ్మరు విటవేష విలసనమున, దేహవన్మథుండు మందేహుఁడకట.

క. పొందుపుఁబ న పత్తు ఎన్నలు, తుదిపుట్టువుగాన వాని దుశ్చేష్టలు నె
మ్మదిఁ దలపోయక యట్లనె, వదినెలు వాటింతు రాకువాళ్ళవుమటుఁదిన్. ౧౩౦

క. చిల్లరచేఁతల నిల్లుం, బొల్లుం జెల్లుగ వెఱంజి భూసురసూనుం
డుల్లోకవృత్తి రోవె, పల్లవపాణులకు నొసఁగుఁ బ్రల్లక మొదవన్. ౧౩౧

సీ. నలుదెఱంగుల బుద్ధి దెలిపి రన్నలు సారె రీతి గా దనిరి తండ్రియును దల్లి
ముట్టనాడిరి కూర్మిచుట్టంబు లెల్లరు సరిగృహమేధు లసహ్యపడిరి
గురువులు చెక్కిలిగొట్టి వారించిరి సజ్జను లిది దురాచార మనిరి
పలుచగాఁ జూచిరి ప్రభుపురాణువవారి లోవనివారు బిట్టుబ్బినగిరి

నెవ్వ రెటువలె బోధించి రేధమాన, శేముషీగౌరవంబునఁ జిక్కఁబట్టి
యంతకంతకునతఁడు కామాంధకార,కలితలోచనుఁడగుఁగాని కాఁడుసుమతి

క. కుసులకు వెఱిగిరి దుష్ట, వ్యసనము విడలేక తిరుగువానిపయిన్ భ్రా
తృసమూహంబును బాంధవ,విసరముగురుజనులుఁగూర్చువియ్యపుఁబ్రజలున్

గీ. ఉరగదష్టాంగుళముఁ ద్రుంచి యుఱకపాటు, వైచు కైవడి నన్నిచు వదలవిడిచి
యింటివారెల్ల సుఖముండి రంటుకొనిన, తెవులు వాసినకరణి నోధీరచరిత.

శా. ఆమందేహుఁడు బంధుముక్తుఁ డయిన చింతాక్రాంతసంతాపమూ
ర్ఛామగ్నాశయుఁ డై చరించుటలు కర్ణాకర్ణికన్ భోజధా
త్రీమందార మెఱింగి వానిఁ గరుణాదృష్టి న్నిరీక్షించి శి
క్షామంజూక్తుల బుద్ధిచెప్పి నిజపార్శ్వస్థాయిగాఁ జేయుడున్. ౧౩౬

క. రాతిరి పగలును వినయో, పేతుండై సేవ చేసెఁ బృథివీనాథుం
బోతర ముడిగి మహీసుర,సూతి మధుచ్ఛన్నమైనచ్ఛురియయుఁబోలెన్.

వ. ఇట్లు విష్ణుశర్మమీఁది కూర్మికతన భోజుం డావిప్రతనూజుం బాటించుచు నుండి కతిపయసంవత్సరంబు లరిగినం దదనంతరంబయొక్కకందువయందు.

క. ఆమందేహునకిచ్చెన్, భూమీవిభుఁ డగ్రహారములకును దేవ
గ్రామంబులకును సమమతి,నై మేరఁ నడుపుమనుచు నధికారంబున్.

*1horse - 2money advanced without interest to the pu*

గీ. ఇచ్చిముద్దుటుంగ్రమిచ్చి వారకమిచ్చి,యందలంబువెట్టి యనుచుటయును
గుజనుఁడతఁడు బ్రహ్మకూఁకటిముట్టి భూ,పాలుపీడుకొని యపారమహిమ.

మ. కరణంబు ల్పరిహాసకు ల్కవిజను ల్కార్తాంతికు ల్గాయకు
ల్దౌరపోతు ల్పరివారము న్సఖులు మంత్రు ల్రక్షక ర్జ్ఞులుం
దెరువు ల్వెట్టి పదార్థము ల్దిగుచు యుక్తిప్రౌఢులై స్మన్న ము
ష్కరులెల్లం దనవంటివారు గొలువంగా సంభృతోత్సాహుఁడై. ౧౪౧

క. సురభూసురభూములపై, హరిణాశ్రితవనము సొచ్చు వ్యాఘ్రముపోలెన్
ధరణిసురసూతిక్రమ్మరి, పరుసఁదనము మీఱఁ బాగుపత్తేము సేయున్. ౧౪౨

సీ. పూర్వంపు టధికారిపురుషుల మీఁదిముత్తెండలన్నియును జిత్రముగనొడిచి
వాచాలురగుచుఁజావడినిరంకుశవృత్తిఁదనరుగ్రామణులకుఁ జనవులొసఁగి
సందుగొందులను లంచపుముఖంబున మాటుపడు నపరాధంపుబెడద లరసి
యొక్కనివెఱపించి యొక్కనిమన్నించి యోఁకడు గానకయుండ నొకనిమనవి
చనవు లేకాంతమున విని సకలజనులఁ, గైవసంబుగఁ జేసె భూదేవదేవ
సీమవారల నాథూర్త శేఖరుండు, రేయుఁబవలునుగను తెప్ప వేయకిట్లు. ౧౪౩

క. సంతాపము నొందించుమి, థోంతఃకలహమున నగ్రహారద్విజులన్
సంతతవిత్తార్జనబహు, చింతాపరతంత్రుఁడగుచు క్షితిసురుఁ డెవ్వఁడున్. ౧౮౮

క. విందులు వెట్టియు ముడుపులు, సందుల దోఁపియును సేవ సలిపియు ధరణీ
బృందారకు లెల్లప్పుడు, మందేహుని గొలిచి రిండ్లు మఱచి గుణాఢ్యా.

క. దేవస్థానంబుల ని, చ్ఛావృత్తిఁ జరించు నతఁడు చంచలతురగ
వ్యావల్గనములు మెఱయఁగఁ, గైవారము సేయ వందిగణ మిరుగడలన్.

సీ. పునుఁగుఁగస్తురియుఁగప్పురముఁగుంకుమగంధసారఖండములుపన్నీరు మొద
సురభివస్తువు లెల్ల శోధించి శోధించి మేలైనయవి తనపాల నిలిపి (లు
రత్నభూషణముల రాయిఱప్పలు మంచియవి యెల్లగిలుబాడీయందుకుఁ బ్రతి
యమరించి జీర్ణంబు లగువానిఁ బెట్టెల నించి నూతనపటీనికరమెల్లఁ
దనదుబొక్కసమింటికిఁ దార్చి పెరుఁగుఁ, బాలు నేతులు బియ్యముల్ పప్పుఁ గూర
కాయగుడములుఖండశర్కరయుఁ దేనె, లాత్మగృహముననుండి రాహావణుపఱిచి

క. శ్రీవిష్ణుస్థానములకు, శైవాలయములకు శక్తిసదనంబులకున్
లేవడి సేయుచుఁ బాత్రుల, హావళిఁ బెట్టుచు మెలంగు నతఁ డనుదినమున్.

సీ. మెఱికలు మలిగండ్లు బెరసినక్రొత్తనూకలు పుప్పిగాఱు పెసలును గసరు
నెయ్యియునూనియ *నెలనాళ్ళనుండియుఁ బులిసిబూరటలాడు బూఁజుపెరుఁగు
నూరెల్ల నొల్లని కూరగాయలు త్రప్పలవుమిరియంబులుఁ జవుటియుప్పు
సౌరభం బెడలినసంబారములు నేఱుఁబిడుకలుఁ జవిచెడ్డ గుడము వరటి
చెడినపులిపండు గాని యాచెడుగు దేవ, తోపహారంబులకు ననర్హోజ్జ్వలాహార
భోజ్యములనంపఁడొకనాఁడుఁ బూర్వకాల, కలితమర్యాదలుడిగె వేల్పులకునెల్ల

క. తొల్లింటికట్టుమట్లు, మొల్లము లన్నియును నమ్మి ముడుపులు సేయు
న్వల్లడికాఁడై తప్పులుఁ, గల్లలుఁ బ్రజలందుఁ దెలుపుఁ గలుగకయున్నన్.

క. తనకొలువును దనపైఁ బెసఁ, చినపదములపాటలను రచింపఁగ దినముల్
చనుఁ గాని 'మేళమున' క, య్యనిమిష సేవకును గలుగ వవకాశంబుల్.

సీ. ఉప్పెనవోయెఁ బయోదధిక్షౌద్రఘృతంబులు దధ్యోదనంబు లుడిగెఁ
బిండివంటలుకథాబీజమాత్రము చిక్కెఁ జఱపులన్నియుఁ బనిచెఱవులయ్యెఁ
బర్వోత్సవంబు లంబరపుష్పదశ నొందె గీతవాద్యంబులు కెళవు దొలఁగె
శాసనస్థగ్రామచయసమాగతవస్తువిస్తార మంతయు నస్తమించె

---

* లెన్నాళ్ళనుండియు.

ధూపదీపంబు లడఁగె దుత్తూరగోత్తము, రకలితార్కనికుంజపూర్ణంబులగుచుఁ
*బాపరిండ్లయ్యెగుళ్లయభ్యంతరంబు,లాతఁడధికారమొనరించునవసరమున

క. సురభూసురపీడనమునఁ, బొరసిన విత్తంబు వానిఁ బొందక పెఱకై
సురిగె నొకకొంత వేశ్యా, శరణములకుఁ గొంత చోరజనవశమయ్యెన్.

గీ. చెట్టుఁ దిన్నపురుగుఁ బట్టి పీడించిన, బసరు వెడలు గాక పసిమిగలదె
దూఱు దక్కఁ గాని దుర్బ్రాహ్మణునకును, నార్జితార్థకోటి యంట దింత.

క. త్రిచతుర్వర్షములకు వి, ప్రచయము దేవాలయంబుప్రజలు నొకటి యై
కుచరిత్రుఁ డైనమందే, హచరిత మాభోజపతికి నొగి నెఱిఁగింపన్.

వ. కాలాకారుండై యభ్భూపాలుండు కోపించి యాకాపురుషు రావించి వాని వలన దేవతాసేవకులును భూదేవనివహంబునుం గలుగరూపించిన యపరాధంబు సైరింపనేరక చతుర్దండయోగ్యుండ యేనియు నయ్యయోగ్య నపవిత్రాంకకళంకాంకితశరీరుం గావించి తనయేలుభూవలయంబునకుం బాపుటయు నాపాపప్రవణుండు.		౧౫౯

క. బహుదేశంబులవెంటన్, బహిష్కృతుం డగుట మాటుపఱిచి చరించున్
మహిసురచండాలుఁడు స, ద్గృహమేధుల యిండ్లఁదిండిదినుఁబలుమాఱున్.

గీ. జఘనకీలితసలిలకషాయపటము, నుత్తరీయంబు కొడవంపు నొరగుశిఖయు
నిటలమునగంగమట్టియు నీరపూర్ణ,కుండికయునైచరించుఁబాపండుఁడతఁడు.

చ. అతఁ డట నొక్కనాఁడు విపినాంతరమార్గమునందుఁ బోవుచుం
బ్రతిభయభానుదీధితులఁ బర్వినదాహము నోర్వలేక శీ
తతరజలంబు నారయుచుఁ దత్సవిధంబునఁ గాంచె నొక్కహం
సతుములమాంసలంబు జలజాతనివాసముఁ జారుహాసమున్.		౧౬౧

వ. కాంచి యానష్టపూర్వద్విజుండు సంతుష్టహృదయుండై యభీష్టంబుగనక్కొలన జలజపరాగ పరంపరావాసితంబులు నతిశీతలంబులును మధురసుధారసప్రాయంబు లగుతోయంబు లాని మేనికిం దనుపు వచ్చుటయు నచ్చట వియచ్చరతరునిభం బగు సురపొన్నగున్నమ్రానినీడం గోడవయను విపిన పవనశిశువులు వినర సొగపు నొందుచుఁ గొంతతడవు మార్గశ్రాంతి నపనయించుచు నుండి నప్పుడు.		౧౬౦

సీ. ముదురుచీఁకటినిగ్గుమ్రుగ్గులన్నియుఁగూడి నిలిచెఁబొమ్మననొప్పువలుదకొప్పు
పైపొర తనుదానె పాయ వెలుంగొందుముగ్ధచంద్రునిబోలు మొగము మేలు

*పాపయిండ్లయ్యె.

మరుమేడపసిఁడికుంభములఁ దప్పాలువట్టు సౌభాగ్యసంధాయిచన్నుదోయి
యిసుకదిబ్బలమించు నిసుమంతగావించుచక్షుః ప్రియకరంబు జఘనభరము
వలుదతొడలును గలహంసలలితగతియు
మృదుమృణాలాభబాహుసంపదయు సింహ
సదృశమధ్యంబుగల యొక్కశబరబర్హా
కబర యేతెంచెఁ బుష్కరాకరమునకును. ౧౬౧

క. ఏతెంచి తజ్జలంబుల, నాతరుణీమణి యొనర్చె నవగాహము ని
ర్ధూతరజోవిక్రియయై, ధౌతస్మరహేతివోలు తను వలరంగన్. ౧౬౨

వ. ఇట్లు రజస్వలయగునావికస్వరపికస్వర పావనస్నానానంతరంబున నవ్వేశంతంబు వెడలి యొక్కకడం గడలి వెలువడి నిలిచిన మదిరాదేవియుంబోలెఁ ద్రిభువనోన్మాదకారిణి యై హరినీలనీలపరంపరాసంపదభిరామం బగు కుంతలస్తోమంబుం దడి యార్చుచుంబటాంతరస్వీకారంబున రాకాశశాంక చంద్రికాసాంద్ర యగు శరద్రాత్రిం బురణించుచు విలసిల్లు నవసరంబున.

గీ. తెరువునడచియలసిసురపొన్నక్రొన్నీడఁ, దూఁగువట్టియున్నతొలుతకులము
నతఁడు కన్నువిచ్చియయ్యింతినీక్షించె,నదియుఁజూచె మోహనాంగునతని.

క. కంతుండు తమ్మిపూబలు, గొంతంబున గంటిచేసెఁ గువలయగంధా
స్వాంతంబు విప్రుడెందముఁ, గాంతారైకాంతభూమిఁ గవకవనగుచున్.

క. అఘటనఘటనాచాతు, ర్యఘనుం డగువిధికతమున బ్రాహ్మణకులుఁడున్
జఘనవినిర్జితపులినయు, నఘదూరా కూడి మాడి యన్యోన్యంబున్.

వ. నిధువనక్రీడాలంపటులై తెంపు మెఱసి సహాసన సహభోజన సహవిహరణ పరాయణులై యొక్కపక్కణంబునం బెక్కేండ్లధివసించి రిట్లాపాపకారులు కాఁపురంబు సేయు కాలంబున. ౧౬౩

క. హరిణములఁ జంపియమ్మియుఁ,దెరువాటులు గొట్టిదోఁచి తెచ్చియుఁ గనకాం
బరములఁ దనుపుచునుండెం, దరుణిం బతి మదనరాగతత్పరమతి యై.

క. వాఁడంత వయసుదిరిగినఁ, బోఁడిమిచెడి కాలుఁ గేలు బ్రుంగుడువడి క్రొ
వ్వేఁడిమి దఱిఁగిన నిప్పును, వీఁడనఁగానుండెఁ జెంచువెలఁదియుముదిసెన్

క. గరు బేఱి తినుచు బ్రదికిరి, పురుషార్థవిదూరులయిన పొలఁతియుఁబతియున్
సరిముదిసి బ్రహ్మలిఖితము, హరునకు నేనియును దాట నలవియె తండ్రీ.

సీ. పుట్టఁడా తానేమి భూసురాన్వయమున సాధువంద్యుఁడు విష్ణుశర్మయందుఁ
జదువఁడా తానేమి చతురాగమంబులు నామూలచూడ మధ్యాస్మసీమ

వెలయఁడా తానేమి విభవదేవేంద్రుఁడై యభిమతార్థశ్రేణు లనుభవించి
యుండఁడా తానేమి యుర్వీతలాధీశునాస్థానమున సింహ మద్రిఁబోలె
నట్టిమందేహుఁ డతిదుర్లభాగ్రవర్ణ, కర్మనిర్ముక్తుఁడై చెంచుగబ్బిగుబ్బ
లానికతమునఁబాతిత్యలీనుఁడయ్యె, నెవ్వఁడెటువంటివాఁడౌనొ యెఱుఁగరాదు

వ. అంత నొక్కనాఁడు. ౧౨౨

ఉ. పండితపుండరీకుఁడు తపఃకృశదేహుఁడు తీర్థకుండికా
దండలసత్కరాంబుజుఁడు దాంతియు శాంతియుఁ గల్గినట్టి వి
ప్రుం డొకరుండు వచ్చె మృగరు టికానకున్
గండకిఁ దీర్ఘమాడుకుతుకంబు మెయిం బయిత్రోవ గావునన్. ౧౨౩

గీ. వచ్చి మధ్యాహ్నవేళనవ్వైష్ణవుండు,నచలఝరవారి నవగాహమాచరించి
యాహ్నికక్రియ డునొక్క,వటతలంబునఁ గూర్చుండివాఁడు దేరి.

మ. కలుషధ్వాంతనిదాఘఘర్మరుచి లోకఖ్యాత మంతారిపు
జ్వలనజ్వాలఘనాఘనోదయము మోక్షశ్రీల స్థలీ
తిలకం బాశ్రితరక్షణక్రమకళాదివ్యద్రువాటంబు నాఁ
గలయేకాదశి నాఁడ యాటకు శిరఃకపంబు గావించుచున్. ౧౨౫

సీ. శరభశార్దూలకాననఘోరమైన యీవన మెట్లు దాఁటి పోవచ్చు నొంటి
నటవీగజముచేయు హావళిచే యథాయథ్మతైరి తనతోడ లేనుఁగు లెల్ల
నొక్కపక్కణమైన నిక్కానఁ బొడగాన రాదు నిర్జనమైన బ్రహ్మసృష్టి
గాఁబోలు నిచ్చోటు గాఢసాధ్వసమునజడిసి మిక్కిలిఁజిక్కువడియెమనసు
శార్ఙ్గికారాధనము నేయుజాడయెట్లు, రాత్రిజాగరమొనరించుక్రమ్మమ్ము దెలియ
నిమ్మహాపుణ్యవాసరంబెవ్విధమున, సాకునొడఁగూడునొక్కొయిన్నాళ్లవలెనె.

గీ. అనుచుఁజింతించువాను దేవాహ్వయంబు,గలుగునవ్విప్రుఁ డీనులనాలమొనొక్క
జనకలకలంబు నీచభాషావిశీర్ణ, వర్ణవైకల్యరూక్షమై వరవిచార. ౧౨౭

క. ఆజాడవట్టుకొని యా, తేజోనిధి యరిగి యగ్రదిక్కునఁ గాంచెన్
భూజననుత శరహతనా,నాజంతుక్షతజచిక్కణమ్ముఁ బక్కణమ్మున్. ౧౨౮

వ. కని యయ్యనఘమానసుండు హరిణహింసాభూయిష్ఠం బగువానిమ్మరప్రదే
శంబు డాయం జని గాలి యొగువ నిలిని యందలి పోలనుకంపు నిజవాసా
పుటకుటీరకుటుంబి గాకుండ నొక్కగండశిలామధ్యస్థలం బధిష్ఠించి యా
శబరాలయంబుఁ గాచుప్రధానశిఖరువలన నిజశరీరరక్ష యొనరింపఁగలవాఁ
డై యొక్కింతసేపు కాలూఁదుచున్నంత. ౧౨౯

సీ. శణలతావల్కసంచయసితచ్ఛాయమా నరపవెంద్రుకముడిశిరమువాఁడు
పాముప్రేఁగును బోలె బర్బరస్పర్శమౌతో లెముకలనంటి తూలువాఁడు
ముడుసులుగాఱుకంగ మొఱవలువోయినయఱుగుడుఁబండ్లనోరడరువాఁడు
బలితంపు విలుబద్ద గిలుబాడి చేసిన యష్టిచుట్టిన గాఢముష్టివాఁడు
చెట్టుచేమలుఁదూఱి యిట్టట్టుఁదిరుగఁ,బగిలి యెఱమన్నుగప్పినపదయుగంబు
వాఁడుమందేహుఁడావిప్రవరునిడాయు,వచ్చికరములుమోడ్చిదీవనలువడసి.
గీ. అతని కనుసన్నఁ గూర్చుండెనంతికమున,నష్టపూర్వద్విజుండు తన్నవ్యదివ్య
గాత్రపవమానసంపర్కగౌరవమునఁ, బాపబంధంబులొక్కింత పట్లువీడ.
సీ. అడిగె మందేహుఁ డాయవనీసురశ్రేష్ఠుఁ డరుదెంచుటకు హేతు వానుపూర్వి
నడిగినఁ దెల్పె నాయయ్య గండకి కేఁగుపనియు వన్యేభసంభవభయంబుఁ
దెలిపిన వాఁడు నాదేవోపముని దెచ్చి విమలగోమయగోముఖములఁ బూత
మగుపర్ణమయగృహాభ్యంతరమున నిల్పె నిల్పిన నందు నానిగమవేది
లోహతామ్రాత్రసంచియు దేహతాప, హారియగునాతపత్రంబు నంఘ్రిరక్ష
లాది నిజసాధనము లెల్ల సర్వభంగిఁ, దగినచోటుల నునిచి చిత్తంబు దేఱి.
గీ. కొంతవడి విశ్రమించెఁ గుకూలకీలి
కీలనిభతాప మగు నెండ వ్రాలు దనుక
బోయయును బోయప్రోయాలుఁ జేయఁదగిన
యూడిగంబులు సేయుచు నుపచరింప. ౧౮౩
వ. మందేహుండు దేహధారిణి యగు ధర్మదేవతయునుంబోని యాస్థాగరిష్ఠు
నకుఁ బచ్చితేనియలు దెచ్చి యిచ్చియును వెదురుబియ్యంబు లుపదచేసి
యు వన్యఫలంబు లెన్నియు సమర్పించియు శ్రీఖండలతాఖండంబులు కడ
కునకు నొడఁగూర్చియు వనమహిషవిషాణవిశకలిత శైలశిలాపట్టంబులనట్టు
కట్టిన గుగ్గులునిర్యాసకల్కంబు లిచ్చియుఁ బ్రక్షాళితకరచరణవదనుండై
శోదమనెత్తావు లొత్తరించు తులసీపలాశపల్లవంబులును వివిధవీరుదుల్లసిత
ప్రసవవిసరంబులును బర్ణపుటికల ఘటియించి యావటించియు దేవా యీ వి
వనచరభయంబు దక్కి సావధానుండవై మాధవారాధనం బొనరింపు
మని సభార్యుండై తదభిరక్షణదీక్షితుండై యున్నంత గభస్తిమంతుం
డస్తగిరి యవ్వలికిం జను నవసరంబున. ౧౮౪
గీ. శబరపరివృఢనిర్దిష్టసారసాక, రాంబుధారల సాంధ్యకృత్యములు దీర్చి
కమ్మపిచ్చుకవాతినెత్తమ్మివిరులఁ, గలువపువ్వులు శుద్ధోదకములఁ దెచ్చి.

క. తొలుకొ్రొత్తగారనూనియుఁ, దళకొత్తించెం బ్రదీపదాపుకములు త
న్నిలయాంతరమున జ్వాలా,వలయాహతతరుణతిమిరవైషమ్యముగన్. ౧౮౮

గీ. అటులుమత్పూజనోన్ముఖుండగుచువాసు, దేవుఁడిట్లనుమం దేహదిక్కుఁజూచి
యన్న హరివాసరంబు నేఁ డవధిఁబోక, జరగెనీకతమున నీకుజయముగలదు.

గీ. నిదురగాచియుండుమదగజంబులొనర్చుభయముగలదొయే మొపక్కణమున
రేయి నాల్గుజాలుఁ జేయంగవలయు జాగరణమచ్యుతునకుఁ గౌతుకముగ.

వ. అనిన విని వాఁడు వల్లె యని సభల్లంబుగ విల్లెక్కుద్రోచి పల్లియలోని
నల్లమందిం గొందఱఁ బిలిపించుకొని తదన్వితుం డై యతిచండంబు లగు
శార్దూలశరభసింహసింధురాది సత్త్వంబులువచ్చుత్రోవ లరయుచుంగావలి
కిం జాలియుండె నాభూసురపుండరీకుండు. ౧౮౯

క. అభిషేకప్రసవార్చా, విభవంబుల ధూపదీపవిలసనముల సా
రభరితఫలపానకములఁ, ద్రిభువననుత నాకు నధికతృప్తిరొయునర్చెన్. ౧౯౦

క. కుముదోన్మీలన మాదియుఁ, గమలవికాసంబు తుదియుఁ గా యామవతిన్
మను నర్చించెఁ బ్రజాగరణముతో భూసురుఁడుమదిఁగనకభయలవమున్.

క. బోయయు బోయతయును నా, బోయకుఁగలసఖులు రేయుప్రొద్దంతయుఁగ
న్మాయక యాయకలంకుఁడు, చేయుమదర్చనము వినుతిసేయుచునుండన్.

శా. భానుం డగ్రకుభృన్మణీమకుటమై భాసిల్ల నుత్ఫుల్లప
ద్మానీకం బగునొక్క నిర్ఝరమునం దావిప్రుఁడర్థిం గృత
స్నానుండై దివసాననార్ఘ్యవిధి నిష్ఠాయుక్తుఁ డై చేసి పూ
ర్ణానందంబున నింటికిం జని మదియస్తోత్రము ల్సల్పుచున్. ౧౯౩

వ. అవనధశుద్ధిగావించి యథాసంభవపదార్థంబుల నన్నసంపాదనంబొనరించి
కృతపారణుండై లేచివార్చివనపవనకిశోరప్రసారశమితశరీరగ్లానియైతులసీప
లాశచర్వణం బాచరించుచు నాచెంచునకు భుక్తావశిష్టంబు లగుభోజ్యంబు
తొనంగుటయుఁ బొంగి యంగనాసహితుండై యాగహనచరుం డదియెల్ల
నుపయోగించి యామహీసురపంచాననుంగొనిచనియాదిమార్గంబువట్టించి
మరలె నాధరణీసురుండును గండకీతటంబునం గొండొకకాలం బధివసించి
సాధకులచేత నతిదుస్సాధం బగు లక్ష్మీనారాయణ శ్రీమూర్తిసాలగ్రామ
శైలగర్భంబునం గొని తెప్పించికృతకృత్యుండై నిజావాసంబుం బ్రవేశించెఁ
దదనంతరంబ యిచ్చట. ౧౯౪

శా. ఆమం దేహాఁడు దేహబంధనముఁ బాయం డాయఁ గావచ్చి రు
ద్ధానుక్రోధకషాయలోచనులు హస్తన్యస్తభీమాయుధ
స్తోముల్ సామజనీలవర్ణులు మదాంధుల్ బంధురక్రూర దం
ష్ట్రామాద్యత్తటిదుగ్రవక్త్రులు వివస్వత్సూను సేనాధిపుల్. ౧౯౫

వ. వచ్చి యుచ్చైస్స్వరంబుల నార్చుచు నాపతితు భూపతితుఁ జేసి పొరలిం చుచు నీ వెంపరి పరిత్యక్తకులాచారుండనియును నీనిష్ఠురుండుతిష్ఠన్మాత్రుం డనియు నీయభాగ్యుండు గురుపరిత్యాగశీలుం డనియును నీపన్న దురాన్న భోజయనియు నీకఅటి పరకామినీపరిచయపరిణతుం డనియును నియ్యధముం డు మధుమథనమన్మథాంతకప్రముఖనిఖిలనిర్జరద్రోహి యనియును నీపిచ్చ కుక్కఁచ్చుమోచిన నీచుం డనియును ననేకప్రకారంబులఁ గర్ణకఠోరంబు లాడుచు వరుణపాశకీలితుం జేసి యమావసథంబునకుం గొనిపో వుమధ్య మార్గంబు నవరోధించి మత్ప్రేరితు లగుపారిషదు లావైవస్వతు సేవకులం బోవం దటిమి యటిమ ఱిం బేర్చి యుదర్చిరుజ్జ్వలం బగువిమానంబున నావిష్ణుశర్మసూను నారోహణంబు చేయించి నాయున్న యెడకుం దెచ్చిన నేనును నానిష్కళంకునకుఁ బుష్కలం బగు శంకుకర్ణాభిధానం బొనరించి వైకుంఠగోపురద్వారపరిరక్షణ పట్టభద్రుంగాఁ జేసితి నీవి శేషంబ శేషపాపా చరణనిపుణుండ యేనియు నాధరణీసురునకున మేఘువర్ణోదయంబును నప్ర సవతరుఫలంబునుం బోలె నకారణప్రాప్తం బగు నేకాదశీజాగరణ పుణ్యం బునం బ్రాసించెంగావున

ప్లోదంబున నుపదేశించి యాకాంచనవసనుండు వెండియు

సీ. - - - - - - - - . దశితిథిఁ బావనస్నానశోభవశరీరుఁ
డగుచు గీ - - - - - - - - - - - - -
- - - - - - - - - ముండి బహుప్రకార, పూజలును
జాగరణమున - - - - - - - - - - - -
- - - - - - - - రణనద్వైష్ణవులును దాను ౧౯౬

గీ. బాలురును వృద్ధులున - - - - - - - - - -
- - - - - - - - - - ల్లదికర్తనంబు - - - - . ౧౯౭

సీ. ధరణి గంగాదితీర్థజలాంతరంబు - - - - - - - - -
మహా బ్రహ్మ ప్రతిష్ఠాది బహువిధసప్తసంతానసంజనిత - - - - -
- - - - - - - - - - - - - - - - - దత్తాన్నదానమునకు
సాటిగాదని శ్రుతికోటి చాటుచుండు - - - - - - - - ౧౯౮

గీ. - - - - - - - - శేయము
విష్ణుదేవుండు దెలుప నవ్విజయశాలి
తద్వ్రతమొనర్చు తలఁపుఁ జిత్తమున నిలిపె
హరియు రావించె నింద్రాదిసురకులంబు. ౨౦౦

వ. రావించి యద్దేవవిరోధివలని విరోధం బుడిపించి విబుధాధిపతికి నవిహతస్వర్గాధిపత్యం బేకాతపవారణంబుగా నొసంగి యసురవరునకు వసుధావలయం బొసంగి మున్ను యథాయథలై చనిన దేవతాయూథంబులం బిలిపించి యథాస్థానంబులం బ్రతిష్ఠించి ప్రహ్లాదుం గౌఁగిలించికొని మర్యాదోల్లంఘనంబు చేయకు విశృంఖలవృత్తి మత్తిల్లకు శాంతస్వభావంబున నభ్రాంతుండవై మహీమండలంబుఁ బాలింపు మని యనిచిన ననిచినవినయంబున ననిమిషు లావనజోదరు నాదరంబువడసి తమతమనిలుకడల కరిగి రంత.

మ. పుడుఁగుందత్తడి పుట్టుమచ్చ బలితంపుం గెంపు బల్నెట్టెముం
దెలిదమ్మిం గలలోఁతు పొక్కిలియు నింతిందాల్పు వేగక్కునా
నలిలాధామనికాశయు (?) న్నొసలివాచాకట్లు రాకాసిమేఁ
తలచుట్లును గల్గు వేల్పు చనియెం దానేలు వెల్దీవికిన్. ౨౦౨

క. హరియాజ్ఞ నేలె సుస్థిర, తరముగ ధరణీతలంబు దానవపతి ని
ర్జరవిభుఁ డనువాసరముం, బరమాప్తుం డగుచు నతనిపాలనె నిలిచెన్. ౨౦౩

వ. అని యిట్లమ్మహర్షులకు రోమహర్షణుండు శరభనృసింహసంవాదంబును బ్రహ్లాదకథాకథనంబును నెఱింగించిన నావిరించినిభు లన్నివారము ప్పింపచు నారాధించి ప్రహృష్టహృదయులై యతనివలన నిహపరసాధనంబు లగు శ్రీమదష్టాక్షరీప్రముఖవైష్ణవమంత్రరహస్యంబులు దెలిసి విలసిల్లి రాకథకుండును యథేచ్ఛావృత్తిం బృథివీతలంబున మెలంగుచునుండె. ౨౦౪

క. ఈప్రహ్లాదచరిత్రము, భూప్రజలు పఠించి సకలబుధవర్ణితకీ
ర్తిప్రాప్తియు నిహపరసౌ, ఖ్యప్రీతియుఁ గలిగి సిరులఁ గాంతురువరుసన్

క. రాజన్యకకరతలవి, భ్రాజితజంబీరగౌరఫలసంకాశా
రాజత్కీర్తివిరాజిత, రాజార్ధకిరీటనిర్జరధునీకాశా. ౨౦౬

మ. హనుమాంబారమణీమణీసుహృదయాబ్జా రామపుంస్కోకిలా
ఘనధాటీముఖఘోటికాశతినరింఖానంఘసంఘాతసాం
సునికాయాంతరితాంతరిక్ష సుకవిస్తోత్రార్హచారిత్ర దు
ర్జనశిక్షాగుణదక్ష విక్రమకరాంచన్మత్తకంఠీరవా. ౨౦౭